హిళా ఉద్యమ కరదీపిక

# చైతన్య మానవి



త్రైమాసపత్రిక

జనవరి - మార్చి, 2007

## భూమి కోసం - భుక్తి కోసం

మార్చి 8 పిలుపు




# సంపూర్ణ పారిశుధ్య పథకము - గ్రామీణ నీటి సరఫరా విభాగము, గుంటూరు




అన్నిటికి సమాధానం! మరుగుదొడ్ల నిర్మాణం!! అంచనా వ్యయం 750రూ॥ అంచనా వ్యయం రూ॥1150 అంచనా వ్యయం 2,000రూ॥ అంచనా వ్యవయం 2,500రూ॥

## పారిశుధ్య లోపం వల్ల వచ్చే సమస్యలు:

- అతిసారం, డయేరియా, మలేరియా, పచ్చకామెర్లు, కలరా వంటి ప్రాణాంతకరమైన వ్యాధులు విస్తరిస్తున్నాయి.
- బహిరంగ ప్రదేశాల్లో మల విసర్జన, పరిసరాల అపరిశుభ్రత వలన నీరు కలుషితమై ప్రజలు అనారోగ్యానికి గురవుతున్నారు.
- బహిరంగ విసర్జన చేయడం వలన మహిళలు ఆత్మగౌరవానికి భంగం చీకటి పడితే తప్ప బహిర్భూమికి వెళ్లలేని దుస్థితి.
- బహిరంగ మల విసర్జనవలన వర్షాకాలంలో రహదారులు, అంతర్గత వీధులు, అపరిశుభ్రం ప్రజలకెంతో ఇబ్బంది, అసౌకర్యం

## మరుగు దొడ్ల నిర్మాణమునకు ప్రోత్సాహాలు:

- సంపూర్ణ పారిశుధ్యం సాధించిన గ్రామాలు, మండలాలకు నిర్మల గ్రామపురస్కార్ బహుమతులు రూ. 50,000 నుండి 50,00,000 వరకు
- పారిశుధ్య ఉద్యమానికి విశేష కృషిచేసిన వ్యక్తులు స్వచ్ఛంద సంస్థలకు ప్రత్యేక బహుమతులు (రూ.15,000/- నుండి రూ. 30,000)
- గ్రామపంచాయితీ ఆధ్వర్యంలో ప్రజలందరి భాగస్వామ్యంతో ఉదయమ స్ఫూరితో అమలు.
- సంపూర్ణ పారిశుధ్య పథకములో భాగంగా 132598 వ్యక్తిగత మరుగుదొడ్ల నిర్మాణము మరియు 2427 స్కూల్స్ నందు శానిటరీ సౌకర్యము ఏర్పాటు చేయటం జరిగింది. హడ్కోప్రోగ్రాం క్రింద 19434 వ్యక్తిగత మరుగుదొడ్లు ఇప్పటివరకు పూర్తి చేయడమైనది.
- పారిశుధ్యముపై పాఠశాల విద్యార్థులలో అవగాహన పెంచుటకు ప్రతి బుధవారము "పారిశుధ్య దినముగా" పాటించడం జరుగుచున్నది. వ్యక్తిగత పరిశుభ్రత అలవాట్లను తెలియజేయు సంపూర్ణ పారిశుధ్య ఉద్యమ క్యాలెండర్ ప్రతి విద్యార్థికి ఇవ్వటం జరుగుచున్నది. ప్రతి రోజు ప్రతిజ్ఞ తరువాత హెల్త్ డ్రిల్ నిర్వహించడం జరుగుచున్నది. తరగతి గది తలుపు దగ్గర ఉపాధ్యాయులకు ప్రతిరోజు విద్యార్థులు ఈ క్రింది అంశములను చూపుతూ వరుస క్రమములో వెళ్లునట్లు అలవాటు చేయుట జరిగినది. సోమవారం విద్యార్థులు తమచేతి గోళ్లును, మంగళవారం అరచేతులను, బుధవారము రెండు కళ్లను, గురువారం నోటిలో పళ్లును, శుక్రవారము దుస్తులను, శనివారం తలవెంట్రుకలను చూపుతూ వెళ్లునపుడు ఉపాధ్యాయులు ఆభాగములను పరిశీలించి, విద్యార్థులలో వ్యక్తిగత పరిశుభ్రత పెంచుటకు చర్యలు తీసుకోవడం జరుగుచున్నది.
- ప్రజల భాగస్వామ్యంతో ప్రజాప్రతినిధుల సహకారంతో మెరుగైన ఉన్నతమైన ప్రమాణాలతో గ్రామీణ నీటి సరఫరా విభాగము ద్వారా భాధ్యతాయుతమైన సేవలందించుటకై విశేషకృషి చేయుటకు సంకల్పించడమైనది.



**ఎ.ఎన్.ఎస్.వి. ప్రసాద్,**
సూపరింటెండెంట్ ఇంజనీర్ (పి.ఆర్)
గ్రామీణ నీటిసరఫరా సర్కిల్ గుంటూరు.

**జి. జయలక్ష్మి** ఐ.ఎ.ఎస్.
కలెక్టర్, గుంటూరు.



******************************** సంపాదకీయం...

# ప్రజా సంక్షేమాన్ని మరచిన బడ్జెట్

రాష్ట్ర ప్రభుత్వం ప్రవేశ పెట్టిన బడ్జెట్ మహిళల జీవితాల్ని విభిన్న రీతులో ప్రభావితం చేస్తుంది. బడ్జెట్‌లో స్త్రీలకు సంబంధించి ప్రత్యేక పథకాలకు నిధులు కేటాయిస్తారు. మహిళా-శిశు సంక్షేమ శాఖకు గత సం॥ కన్నా 1.26 శాతం నిధులు పెంచామని చెపుతున్నా కేటాయించిన నిధులలో ప్రణాళికేతర వ్యయం ఖర్చు ఎక్కువగా వుండటం పైగా బడ్జెట్‌లో కేటాయించిన నిధులు కూడా ఇతర పద్దులకు తరలించటం వలన మహిళాభివృద్ధికి వుపయోగపడటం లేదు. ప్రభుత్వ సాధారణ పరిపాలనా విధానాల వలన మహిళలపై అనేక భారాలు పడుతున్నాయి. ప్రపంచీకరణ విధానాల వలన అత్యధికంగా నష్టపోతున్నది స్త్రీలే. సామాజిక సేవా రంగాలపైన బడ్జెట్‌లో నిధుల కోతల వలన మహిళలే బాధితులవుతున్నారు. ఎన్నికలలో ప్రజలకు ఇచ్చే హామీలకు బడ్జెట్ కేటాయింపులకూ వ్యత్యాసం వుంది. పైగా పన్నుల భారం గురించి ప్రస్తావించకుండా సంవత్సరం పొడుగునా ప్రజలపై ప్రత్యేక్ష, పరోక్ష పన్నులు వేసే పద్ధతి కొనసాగుతున్నది.

ఆర్థిక శాఖా మంత్రి 2007-08 ప్రవేశపెట్టిన బడ్జెట్ ప్రపంచ బ్యాంకు బడ్జెట్. ఇది మహిళల ప్రయోజనాలను కాలరాసేవిగా ఉన్నాయి. ఇప్పటికే అరాకొరగా ఉన్న సంక్షోమ బాధ్యతలను ప్రభుత్వం ప్రైవేట్ పరం చేస్తోంది. ఈ బడ్జెట్ విద్య, వైద్య రంగాలను నిర్లక్ష్యం చేశారు. ప్రాథమిక విద్యను ప్రైవేటీకరించేందుకు కాన్సెప్ట స్కూల్స్‌కు ప్రభుత్వం ప్రయత్నాలు ప్రారంభించింది. బడ్జెట్‌లో 300కోట్లు దానికి కేటాయించింది. విద్యకు గత సంవత్సరం కేటాయించిన 10.84 శాతం మంచి 9.62 శాతానికి తగ్గించింది. దీని వలన బాలికలు విద్యకు మరింత దూరమవుతారు. ఆరోగ్య రంగానికి 3.39 నుండి 3.37 శాతానికి కేటాయింపులు తగ్గించింది. ఇప్పటికే శిధిలావస్థలో ఉన్న ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల నిర్వహణ బాధ్యత నుండి తప్పుకునే ప్రయత్నాలు ప్రారంభించింది. అనంతపురం జిల్లాలో గుడిబండ ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని ప్రైవేటు సంస్థకు అప్పగించింది. భవిష్యత్తులో రాష్ట్రమంతా ఇదే మార్గాన్ని అనుసరిస్తుంది. వైద్యఆరోగ్య రంగాలకు 750 కోట్లు కేటాయించగా అందులో ప్రణాళికేతర వ్యయమే 414 కోట్ల రూ.లు, ప్రాథమిక ఆరోగ్యానికి 2006-07 బడ్జెట్ 179 కోట్ల కేటాయిస్తే 2007-08లో 135కోట్లు మాత్రమే కేటాయించారు. రాష్ట్రంలో శిశు మరణాలు 1000కి 62 మంది చిన్నారులు పొత్తిళ్ళలోనే కనుమూస్తున్నారు. ప్రసూతి మరణాలు 407 మంది ప్రసవ సమయాన చనిపోతున్నారు. ఐన ప్రభుత్వం ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల సౌకర్యాల మెరుగదలకు తగిన బడ్జెట్ కేటాయించలేదు.

ఈ నిధులలో కూడా కుటుంబ నియంత్రణ కొరకు ఎక్కువ కేటాయిస్తున్నారు. దేశంలోనే మొదటి స్థానంలో ఉన్న ఎయిడ్స్ నివారణ గురించి ప్రస్తావన లేదు. విదేశీ నిధులకు లోబడి ఎయిడ్స్ వ్యతిరేక ప్రచారం జరుగుతుంది. ప్రపంచబ్యాంకు షరతులలో యూజర్ చార్జీలు ఒకటి. ఇప్పటికే ఇది అమలు జరుగుతోంది. పెరుగుతున్న పేదరికం కారణంగా పేద మహిళలకు కడుపు నిండా తిండి కూడ దొరకడం లేదు. దీని వలన అనారోగ్యం పాలైతే డాక్టరు ఫీజులు, మందులు ఖర్చులు భరించలేక వైద్యానికి దూరమవుతున్నారు.

రాష్ట్రాభివృద్ధి బ్రహ్మాండంగా ఉన్నదని అంకెల గారడీ చేసే ప్రభుత్వం పేదరికంలో వున్న అమ్మాయిలను మోసగించి అక్రమ రవాణాకు పాల్పడుతున్న ముఠాలను నిరోధించే ప్రయత్నాలు లేవు. దేశంలో 20 లక్షల మంది మహిళలు, బాలికలు వ్యభిచార గృహాలకు అమ్మబడుతుంటే ఒక్క మన రాష్ట్రం నుండే ఐదున్నర లక్షల మంది ఉన్నారని లెక్కలు తెలుపుతున్నాయి. దీని నిర్మూలనకు కనీసం పునరావాసానికి కావలసిన బడ్జెట్ కేటాయింపులు లేవు.

2007-08 బడ్జెట్‌లో ఎక్సైజ్ ఆదాయాన్ని ప్రస్తుతమున్న 3421 కోట్ల ఆదాయాన్ని ఏటా 700 కోట్ల అదనపు ఆదాయం రాబట్టాలని ప్రభుత్వం భావిస్తోంది. నిత్యావసర వస్తువుల ధరలు తగ్గించని ప్రభుత్వం మద్యం ధరలు తగ్గించి రాష్ట్రాన్ని మద్యం మత్తులో ముంచి పరిపాలన సాగించాలని చూస్తోంది.

ప్రజాపంపిణీ వ్యవస్థను నిర్వీర్యం చేస్తోంది. ప్రపంచ బ్యాంకు షరతులతో సబ్సిడీల ఎత్తివేత, రేషన్ కార్డుల కుదింపుకు పూనుకుంటుంది. పేదలకు ఆహారభద్రత కరువైంది. ఫ్యూచర్ ట్రేడింగ్‌కి అవకాశం ఇవ్వటం వలన దళారులు అక్రమ నిల్వలు చేసి ధరలు పెంచుతున్నారు. వీటిపై ప్రభుత్వ నియంత్రణ లేదు. రాష్ట్రంలో 6,35,000 స్వయం సహాయ గ్రూపులు ఉండగా మొక్కుబడిగా పావలా వడ్డీకి 100 కోట్లు కేటాయించింది. గత సం॥ము 30%గ్రూపులకు కూడా పావలా వడ్డీ అమలు కాలేదు. రివాల్వింగ్‌ఫండ్, సబ్సిడిలోన్స్ పూసేలేదు.

రాష్ట్ర జనాభా 8కోట్ల 27లక్షలు. మొత్తం రాష్ట్ర రుణభారం 86,464కోట్లకు చేరింది. ఈ సంవత్సరం చెల్లించు వడ్డీ 8628 కోట్లు. ప్రతి మనిషి పైన 10,455 రూ॥ల అప్పుల భారం ఉంది. ఒక వ్యక్తిరోజుకి రూ॥ 10.75పైసలు పన్నుల రూపంలో రుణం చెల్లిస్తున్నారు. ఈ భారం సగ భాగంగా ఉన్న మహిళలపైన పడుతుంది. బడ్జెట్ స్త్రీల కోణం నుండి విశ్లేషించాలి. మహిళా ఉద్యమ జండర్ బడ్జెటింగ్ కోరుతున్నది. ప్రభుత్వ పథకాలలో మహిళా సంబంధ అంశాలకు ప్రత్యేకంగా నిధులు కేటాయించాలి.

# మానవి

ఈ సంచికలో...




అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం

1-8-538/4, చిక్కడపల్లి, హైదరాబాద్ - 20.

ఫోన్ : 27605845, ఫ్యాక్స్ : 040 - 27605845

సంపాదకులు

**ఎస్. పుణ్యవతి**

మేనేజర్

**ఎం. సుధ**

సంపాదక వర్గం

మల్లు స్వరాజ్యం

అల్లూరి మన్మోహిని

టి. జ్యోతి

కె. స్వరూపరాణి

విరాళం రూ : 5/-

ప్రజాశక్తి డైలీ ప్రింగ్‌ప్రెస్, ముషీరాబాద్, హైదరాబాద్ - 500 020




మోటూరు ఉదయం వర్థంతి : 30 మార్చి

## జై జై జై

జై జై జై మన మహిళా పతాకకు జై
జై జై జై మన విజయ పతాకకు జై

1. వేగ రావోయ్ కార్మిక సోదరీ
   వేగ రావోయ్ కర్షక సోదరీ
   కలసిమెలసి నడవవోయ్ మహిళా పతాకకు జై ॥జై॥

2. బాంబుల వర్షం కురిసిన మర ఫిరంగులు మ్రోగిన
   ఎత్తిన జెండా దించకోయ్ మహిళా పతాకకు జై ॥జై॥

3. కత్తులు దూచుకుపోయిన నెత్తుటేరులు పారినా
   ఎత్తిన జెండా దించకోయ్ మహిళా పతాకకు జై ॥జై॥

4. పీడిత ప్రజల రక్తామున్ త్రాగేటి వారలు బెరరగన్
   ఆకాశమందున ఎగిరేడి మహిళా పతాకకు జై ॥ జై॥

# భూమి కోసం... భుక్తి కోసం

✍ ఎస్. పుణ్యవతి

"తెచ్చిన జీతమంతా అద్దెలకే పోతే ఏం తింటాం? పిల్లలకేం పెడతాం?" సర్కస్ లాంటి సంసారం చెయ్యలేక ఒక మహిళ పడే ఆవేదన. "పిల్ల పెళ్లి చేశామండీ, ఇల్లు అమ్ముకున్నాం. వచ్చే పెన్షన్ రాళ్లు మందులకీ, ఇంటద్దెకి చాలట్లేదు. బతకాలా? చావాలా! మీరే ఆలోచించండి" వయస్సు మళ్లిన మరో తల్లి దుఃఖం. "మా ఆయన ఆటో ఏస్తాడండీ! బేరాలు బాగుంటే రోజుకు యాభై రూపాయలు తెస్తాడు. అది తాగుడికి, పోలీసు మామూళ్లకి పోగా ఏటి తినాలండీ!" ఒక ఆటో డ్రైవర్ భార్య పరిస్థితి.

ఇలా చెప్పుకొంటూపోతే ఇల్లు, వాకిలి లేని వాళ్ల బాధలకీ గాధలకీ అంతేలేదు. ఆ బాధలే వారిని పోరాటంలోకి ఉరికేట్లు చేశాయి. పోలీసుల దెబ్బలు, అవమానాలు, జైళ్లు ఇవన్నీ వారి బాధలముందు దిగదుడుపే అయ్యాయి. సాగరుడి గంభీరానికి, ప్రశాంతతకీ మారుపేరయిన విశాఖ మహా నగరం దాదాపు పది రోజులపాటు వార్తలకు వేదికయ్యింది. ప్రభుత్వ మొండి వైఖరికి, పోలీసుల కసాయితనానికి, మహిళల పాత్ర అద్వితీయమయినది. ఇంత జాగా కోసం తుప్పలు, ముళ్లచెట్లు నరికి శుభ్రం చేశారు. పాత చీరలు, తాళ్లు తెచ్చి కొలతలు వేసుకున్నారు. ముగ్గు పోశారు; అక్కడే రాళ్ల పొయ్యిలు పెట్టుకుని వంటలు చేసుకున్నారు. కొంకర్లు పోయ్యేట్టు ..లిని, మంచుని ఖాతరు చెయ్యకుండా చలిమంటలు వేసుకుంటూ రాత్రి తెల్లవార్లూ జాగారం చేశారు. పోలీసులు దెబ్బలు కొడుతున్నా, బూతులు తిడుతున్నా, ఈడ్చిపారేస్తున్నా లెక్కచేయకుండా మళ్ళీ తమ స్థలంలోకి చేరుకున్నారు. వారి పోరాటాన్ని పత్రికలు, ఎలక్ట్రానిక్ మీడియా ద్వారా తెలుసుకున్నవారికి ఆశ్చర్యం కలగకమానదు.

## ఇల్లు గడిచేదెలా?

ప్రపంచ బ్యాంకు ప్రచారంలో పెట్టిన 'సాధికారత' నినాదం స్త్రీకి హక్కులనివ్వకపోగా బాధ్యతల్ని పెంచింది. ఒకనాడు నెలనెలా భర్త చేతికిచ్చిన జీతపు రాళ్ళతో గుట్టుగా సంసారాన్ని నెట్టుకొచ్చిన స్త్రీ, నేడు తాను కూడా ఏదో ఒక పనిచేసి సంపాదించినా సంసారం నెట్టుకురావడం సాధ్యం కావడం లేదు. మద్యం మహమ్మారి ప్రభుత్వానికి వేలకోట్ల రూపాయల ఆదాయాన్ని తెచ్చిపెడుతోంది. పేద కుటుంబాలకు మాత్రం కొద్దిపాటి మనశ్శాంతి కూడా లేకుండా చేసింది. అందుకే విశాఖలో స్త్రీలు అంత తెగింపుగా ముందుకు వచ్చారు. ఉంటే తింటాం, లేకుంటే పస్తులుంటాం అనుకుని ఇంత జాగా కోసం ఆరాటపడ్డారు. పోలీసు స్టేషన్‌కు వెళ్లడమే అవమానంగా భావించే స్త్రీలు వందల సంఖ్యలో అరెస్టయి కటకటాల్లో కాలం గడిపారు. ప్రపంచమంతా కొత్త సంవత్సరం వేడుకలు జరుపుకొంటుండగా అరెస్టయిన మహిళలు, మహిళా నాయకులు డిసెంబరు 31 అర్ధరాత్రి పోలీస్ స్టేషన్‌కు, ఆ తరువాత కోర్టుకు పోలీసు వ్యానుల్లో ప్రయాణించారు. చంటి బిడ్డల్ని, కుటుంబాల్ని వదిలి జైలుకెళ్లారు. జైలుకి వెళ్లిన వారిలో స్త్రీలే ఎక్కువ మంది. మొత్తం 143 మంది జైల్లో ఉంటే వారిలో దాదాపు 80 మంది స్త్రీలు.

## కష్టాల సుడిలో మధ్య తరగతి :

ఇళ్ల సమస్య పేదలకే పరిమితం కాలేదు. అది దిగువ, మధ్య తరగతికి కూడా పాకింది. కట్నాలు, పెళ్లి ఖర్చులు, పిల్లల చదువులకు అయ్యే వ్యయం-అన్నీ పెరిగిపోయాయి. కొద్దోగొప్పో ఉన్న ఆస్తులు హరించుకుపోగా రిటైరైన దంపతులు రోడ్డున పడ్డారు. పట్టణాలు, నగరాలు, మహానగరాలు పెరుగుతున్నాయి. వాటితోపాటు పేద, మధ్య తరగతి ప్రజల సమస్యల్ని పెంచుతున్నాయి. ఇంటి అద్దెలు, పెరుగుతున్న ధరలు ఇంటి నిర్వహణా భారం మోస్తున్న స్త్రీలను మరీ



... ఈ ఉద్యమం ఎవరో కొందరు రెచ్చగొడితే జరుగుతున్నదని ప్రభుత్వం అనుకుంటే అది అవివేకమే. ఇప్పటికైనా సమస్యను అర్థం చేసుకోకుంటే రానున్న కాలంలో నివాస స్థలం కోసం మరిన్ని ఉద్యమాలు రాష్ట్ర వ్యాప్తంగా రాకమానవు. 'దిక్కు మొక్కులేని జనం-ఒక్కొక్కరు అగ్నికణం'గా మారి, 'సింహకంఠ నాదంతో వస్తారు'...

వేధిస్తున్నాయి. ఒకవైపు భూముల ధరలకు రెక్కలొచ్చి అవి చుక్కలనంటుతుండగా మరోవైపు ప్రభుత్వ భూములను రాజకీయ భూబకాసురులు దిగమింగడంతో పేద, దిగువ మధ్య తరగతి ప్రజలు ఊరిబయటి జాగాలకు తరలిపోతున్నారు. ఇప్పటికే నగరానికి సమీపంలో ఉన్న కొండలపైకి సాధ్యమైనంత మేరకు చేరారు. మంచినీటి సౌకర్యం లేకున్నా, కొండచరియలు విరిగిపడతాయన్న భయంవెంటాడుతున్నా, పిల్లలు, వృద్ధులకు కష్టమయినా ఖాతరు చెయ్యకుండా కొండలపైన నివాసం ఏర్పాటు చేసుకున్నారు. ఇప్పుడు ఆ కొండలమీద కూడా జాగా దొరక్క ఈ పోరాటానికి నడుంకట్టారు.

## సంక్షేమం ఊసేది?

ప్రభుత్వ విధానాల దుష్ఫలితాలు కూడా ఈ పోరాటానికి ఆజ్యం పోశాయి. విశాఖ మహానగరం పారిశ్రామికంగా రాష్ట్రానికి రెండవ రాజధాని వంటిది. వజ్రోత్సవాలు, స్వర్ణోత్సవాలు జరుపుకొన్న ఆంధ్రా యూనివర్సిటీ, పోర్టువంటి సంస్థలు, రక్షణ రంగంలో తూర్పు నావికాదళం, ఓడల నిర్మాణ కేంద్రమైన హిందూస్తాన్ షిప్‌యార్డు, భారత హెవీ ప్లేట్స్ అండ్ వెస్సెల్స్‌తోపాటు ఆంధ్రులు పోరాడి సాధించుకున్న విశాఖ ఉక్కు, థర్మల్ విద్యుత్ కేంద్రాలు ఉన్నాయి. ప్రైవేటు రంగంలో చిన్న, పెద్ద పరిశ్రమలు అనేకం ఉన్నాయి. ఉత్తరాంధ్ర జిల్లాల నుంచేకాక రాష్ట్రం నలుమూలల అనేక మందికి విశాఖలో ఉపాధి లభిస్తోంది. సహజంగానే ప్రభుత్వరంగ సంస్థలు కార్మిక సంక్షేమానికి ప్రాధాన్యం ఇచ్చాయి. గౌరవప్రదంగా బతకడానికవసరమైన జీతంతోపాటు, సొంత ఇల్లు కట్టుకోవడానికి, స్థలం కొనుగోలుకు అప్పులు మంజూరు చేశాయి. ఇటీవలికాలంలో అలాంటి సంక్షేమ కార్యక్రమాలన్నీ అటకెక్కడం మొదలయ్యింది. ప్రభుత్వ సంస్థల్ని నష్టాల ఊబిలోకి నెట్టడంతోపాటు, పర్మినెంట్ కార్మికుల సంఖ్యను కుదించడంలో ప్రభుత్వం జయప్రదమయింది. ఉదాహరణకు లాభాల బాటలోఉన్న బి.హెచ్.పి.విలో నాలుగువేల మందికిపైగా కార్మికులుండేవారు. ఇప్పుడా సంఖ్య 1100కి పడిపోయింది. ఇలాంటి పరిశ్రమలపై ఆధారపడ్డ అనుబంధ పరిశ్రమలు చావుబతుకుల మధ్య కొట్టుమిట్టాడుతున్నాయి. ఉన్న ఉద్యోగాల్లో కాంట్రాక్టు పద్ధతి పెరిగింది. విశాఖ స్టీల్ ప్లాంటులోనే సుమారు 12,000 మంది పర్మినెంట్ కార్మికులుంటే 10,000 మందికి పైగా కాంట్రాక్టు కార్మికులు పని చేస్తున్నారు. మొత్తం మీద కొత్త తరానికి స్థిరమైన ఉద్యోగాలు కల్పించడంలో ప్రభుత్వం విఫలమయ్యింది. కాంట్రాక్టు కార్మికులు, షాపు గుమాస్తాలు, ఆటోలు నడిపేవారితోబాటు చివరికి పాచిపని చేస్తూ బతుకు తెరువు వెతుక్కునేవారి సంఖ్య పెరిగింది. ఒకవైపు ధరలు కొనుగోలు శక్తికి అందకుండా పెరగడం; విద్య, వైద్యం శక్తికి మించిన భారం కావడంతో నివాస సమస్య తీవ్ర రూపంలో ముందుకొచ్చింది. మున్సిపాలిటీలు మురుగుదొడ్లు, మంచినీరు వంటి సేవలకు కూడా డబ్బులు వసూలు చేయడం వల్ల పేదలపై భారం ఇంకా పెరిగింది.

## ఉక్కు నిర్వాసితుల దుస్థితి:

స్టీలు ప్లాంటు నిర్వాసితులది మరోరకం సమస్య. సుమారు 30 సంవత్సరాల క్రితం ప్లాంటు నిర్మాణం ఫలితంగా వేలాది మంది నిర్వాసితులయ్యారు. వారందరికీ పునరావాసం కల్పిస్తామని, ఉద్యోగాలిస్తామని అప్పట్లో ప్రభుత్వం వాగ్దానం చేసింది. కాని యథావిధిగా వాగ్దానం అమలులో అవకతవకల కారణంగా సగం మందికి, అంటే 6300 మందికి ఉద్యోగాలు దొరకనే లేదు. కొంతమంది కాంట్రాక్టు కార్మికులుగా ఉంటే మరికొందరు నిరుద్యోగులుగా మిగిలారు. అలాంటివారికి ఆవాసం పెద్ద సమస్యగా మారింది. పిల్లా, పాప, ముసలీ ముతక ఉన్న కుటుంబాలు అతితక్కువ స్థలంలో ఇరుక్కొని ఇరుకు రోడ్లకు అటూఇటూ బతకడం అసాధ్యంగా మారింది. ఇప్పుడు కటుంబాలు పెద్దవయ్యాయి. పెళ్లైన కొడుకులు, కోడళ్లు, పిల్లలు ఎక్కడ ఉండాలనేది పెద్ద సమస్య.

## భూ బకాసురుల కుహకాలు:

పోరాటం తరువాతయినా సమస్య తీవ్రతను గమనించాల్సిన ప్రభుత్వం అందుకు నిరాకరించింది. భూబకాసురుల్ని రక్షించడానికి పూనుకుంది. ప్రజల మీద మాత్రం లాఠీలు ఝళిపించింది. వందల ఎకరాల భూములు ఆక్రమించుకుని సంవత్సరాల తరబడి అనుభవిస్తున్న పలుకుబడి కలిగిన పెద్దలు, రాజకీయ నాయకులు మంత్రులు, శాసన సభ్యులు, పార్లమెంట్ సభ్యుల బాగోతాల్ని స్థానిక ప్రజలు కథలు కథలుగా చెబుతున్నారు. భూబకాసురుల వివరాలను ఆధారాలతో ప్రభుత్వానికి అందచేసినా ఫలితం లేదు. 'భూ ఆక్రమణ చట్ట విరుద్ధం, ఏదైనా సమస్య ఉంటే మా దృష్టికి తీసుకురావాలి కదా' అని ముఖ్యమంత్రి అంటున్నారు. పది లక్షల ఎకరాలు అసైన్డ్ భూములు పెద్దల ఆక్రమణలో ఉన్నాయని ముఖ్యమంత్రే ప్రకటించారు. వాటిని ఆక్రమించిన పెద్దలమీద ఏ చర్యా తీసుకోకపోగ పేదల ప్రతాపం చూపడం భావ్యమా అన్నది ఆయనకే తెలియాలి!

విశాఖ నగర పోలీసు కమిషనర్ వాస్తవాలు వ[illegible] లించాల్సిందిపోయి 'మహిళల్ని అడ్డం పెట్టుకుని ఉద్యమా చేస్తున్నారంటూ' తన పురుషాధిక్య ధోరణిని ప్రదర్శించారు. [illegible] వాకిలి లేక, అద్దెలు కట్టలేక మహిళలు పడుతున్న బాధల్ని, వా[illegible] నివురుగప్పిన నిప్పులా ఉన్న అసంతృప్తిని, పట్టుదలను ఆ అధి[illegible] గుర్తించలేకపోయారు ప్రజల విజ్ఞప్తుల్ని మరచిపోవడం పాలకు[illegible] ఆనవాయితీ. వారు తప్పు తమదగ్గర ఉంచుకొని నేరాన్ని ప్రజ[illegible] మోపుతున్నారు. 2004 నుంచి సమస్య నలుగుతోంది. అప్పటినుం అనేక పర్యాయాలు వినతులు, విజ్ఞాపనలు, ధర్నాలు, కలెక్టరే ముట్టడులు... ఈ అన్ని ప్రయత్నాలు చేసి చివరికి ప్రభుత్వం ద్వం[illegible] ప్రమాణాలు అనుసరిస్తోంది. పశుసంవర్ధక శాఖ నుంచి 4[illegible] ఎకరాలను స్వాధీనం చేసుకొని 150 ఎకరాలకు పైగా విమ్స్ వగై[illegible] హెల్త్ సిటీకి కేటాయించారని, మిగిలిన భూమిని రాజకీ[illegible] నాయకులకు అప్పగిస్తారని, వారి కోసమే ముడసరలోవ రిజర్వాయరుకు మంచినీరు రాకుండాచేసి విశాలమైన రోడ్లు నిర్మించారని వినికిడి. పరిశ్రమాధిపతులకు, రాజకీయ నాయకులకు వందల ఎకరాలు కట్టబెట్టే ప్రభుత్వం అందులో పదోవంతైనా పేదలకు నివేశన స్థలం ఇవ్వడానికి నిరాకరిస్తోంది.

## అర్థంకాని ప్రభుత్వం:

ఈ ఉద్యమం ఎవరో కొందరు రెచ్చగొడితే జరుగుతున్నదని ప్రభుత్వం అనుకుంటే అది అవివేకమే. ఇప్పటికైన సమస్యను అర్థం చేసుకోకుంటే రానున్న కాలంలో నివాస స్థలం కోసం మరిన్ని ఉద్యమాలు రాష్ట్ర వ్యాప్తంగా రాకమానవు. 'దిక్కు మొక్కులేని జనం-ఒక్కొక్కరు అగ్నికణం'గా మారి, 'సింహకంఠ నాదంతో వస్తారు'. లాటిన్ అమెరికా దేశాల్లో పేదలు ఇళ్ల కోసం, తాగునీటి కోసం, బతకడానికి అవసరమైన కనీస సదుపాయాల కోసం చేసిన పోరాటాలు గడచిన కొన్నేళ్ళుగా అక్కడి ప్రభుత్వాలనే మార్చివేస్తున్నాయి. బతికే హక్కుతోనే రకరకాలుగా చెలగాటమాడటానికి ప్రభుత్వాలు సాహసిస్తే ఆ అనుభవాలు ఇక్కడా నిజం కావడం తథ్యం.



# స్త్రీల పరమైన ఇంటి సమస్య - పోరాటంలో మహిళలు



బి. ప్రభావతి

విశాఖ నగరంలో సుమారు 2 లక్షల మందికి గూడులేదు. చిన్న గదికి 1,000 నుండి 2,000 రూ॥ వరకు అద్దె చెల్లించవలసి వస్తుంది. స్వాతంత్ర్యం వచ్చి ఆరు పదులు దాటినా పేదవారికి 60 గజాల స్థలం "అందని ద్రాక్షలాగే" ఉంది. ఎన్నికలకు ముందు శ్రీ వై.ఎస్. రాజశేఖర్‌రెడ్డి 50 లక్షల ఇండ్ల స్థలాలు ఇస్తామని వాగ్దానం చేశారు. ఎన్నికల వాగ్దానం అమలు చేయలేదు.



విశాఖ జిల్లాలో ప్రభుత్వ బంజరు భూములు పెద్దోళ్ళు పరమాన్నాలుగా భుజిస్తున్నారు. ఎం.ఎల్.ఎ తిప్పల గురుమూర్తి రెడ్డి బంధువుల ఆక్రమణలో 2,400 ఎకరాలు ఉంది. అగనం పూడిలో సర్వే నెం. 181లో 100 ఎకరాలు ఒక మంత్రిగారి అధీనంలో వుంది. ఆరిలోవలో ఇడుగుర్లోవలో 2,000 ఎకరాలు, శీలా నగర్‌లో 56 ఎకరాలు, గోపాలపట్నంలో సర్వే నెం. 76లో 103 ఎకరాలు వేపగుంటలో సర్వే నెం. 75లో 100 ఎకరాల కొండ బంజరు, వేల ఎకరాల పోరంబోకు భూములు స్థలాలు అన్యాక్రాంతమై పోతున్నాయి. పై లెక్కలలో ఇంత స్థలంఉండగా కొద్దిమందికి అగ్గిపెట్టెలు లాంటి వాంబే కాలనీలు కట్టించి ఇస్తాం అని అంటున్నారు. తప్ప పేదవారికి 60 గజాల స్థలం ఇవ్వటానికి ప్రభుత్వం వెనుకాడుతుంది.

ఇవే స్థలాలు రియల్ ఎస్టేట్ దారులకు, ఫిల్మ్ సిటీలకు పెద్ద పెద్ద కంపెనీలకు ధారాదత్తం చేయడానికి వెనుకాడుట లేదు. కనుకనే మహిళలు స్థలాలను ఆక్రమించుకొనుటకు పూనుకున్నారు.

జిల్లా సమగ్రాభివృద్ధి జరగాలని మహిళా నాయకులు పాద యాత్రలు చేపట్టింది. ఆ సమయంలో ఏ గ్రామం వెళ్ళినా ఇండ్ల స్థలాలు లేవని, పట్టాలు లేవని మహిళలు అర్జీలు ఇచ్చేవారు. ఈ సమస్యపై హైదరాబాద్‌లో నిరవధిక నిరాహార దీక్షలు కూడ జరిగాయి. ప్రభుత్వం దిగి వచ్చి ఇండ్ల స్థలాలు ఇస్తామని హామీ ఇచ్చారు. దీనిపై ఒక కమిటీ కూడా వేసారు. కాని జిల్లాలో ఆనాటి నుండి ఈనాటి వరకు ఒక పట్టాగాని, స్థలం గాని ఇచ్చినది లేదు. కాని మంత్రులకు, ఎమ్.ఎల్.ఎలకు, జడ్జిలకు, పోలీసు ఆఫీసర్లకు, ఐ.ఎ.ఎస్ ఆఫీసర్లకు మాత్రం స్థలాలు ఇస్తామని ప్రకటించింది.

సర్వే నెంబర్లతో ప్రభుత్వ బంజరు భూములను పేదలకు ఇళ్ళ స్థలాలకి ఇవ్వాలని గత రెండున్నర సంవత్సరాలుగా పెద్ద ఎత్తున అనేక ఉద్యమాలు నడిచాయి. మహిళలు ఈ ఉద్యమంలో చురుకైన పాత్ర వహించారు. ప్రభుత్వం స్పందించలేదు. విసిగి వేసారిన ప్రజలు డిసెంబరు 7న 10,000 మంది కలెక్టరేట్ ముట్టడించారు. దానిలో కూడా మహిళలు ఎక్కువ మంది పాల్గొన్నారు. జవహర్‌లాల్ నెహ్రూ నేషనల్ అర్బన్ రెన్యువల్ మిషన్ క్రింద ఇండ్లు ఇమ్మని అడిగితే డి.ఆర్.ఓ గారు నెలాఖరుకు సర్వేలు నిర్వహించి ఇండ్లు మంజూరు చేస్తామని హామీ ఇచ్చారు. నెల దాటినా సర్వేలకు రాలేదు. ఇక పేదవాళ్ళ ఓపిక నశించి పోయింది. డిసెంబరు 7.12.2006న మీరు రాకపోతే మేము స్థలాలను ఆక్రమిస్తాము అని చెప్పారు. డిసెంబర్ 7 నుండి 28 మధ్య అన్ని ప్రాంతాలలో పట్టణ పేదల సంక్షేమ సంఘాల కమిటీలు వేసి నెలాఖరుకు ఇండ్ల స్థలాలు ఆక్రమిస్తామని సిపియం ప్రకటించింది. అయినా ప్రభుత్వం స్పందించలేదు. గత్యంతరం లేక 26.12.2006న విశాఖలో 7 కేంద్రాల్లో భూ ఆక్రమణకు పేదలు కంకణం కట్టుకుని భూమిలోకి దిగారు.

డిసెంబరు 28.12.2006 ఉదయం 6 గం॥ల నుండి చిన గదిలి మండలం ఆరిలోవలో 10,000 మంది, గాజువాక ప్రాంతంలో 10,000 మంది, గోపాలపట్నంలో 500 మంది, వేపగుంటలో 500 మంది ప్రభుత్వ స్థలాల వద్దకు విశాఖ పేద ప్రజానీకం ఒక ప్రవాహంలా కదిలారు. పోలీసులు అనేక విధాల భయపెట్టారు. చంటి పిల్లలతో, ముసలి వాళ్ళతో వెళ్ళకూడదు అని, భూమిలోకి వెళ్ళితే అరెస్టులు చేస్తామని, జైల్లో పెడతామని మీ జీవితాంతం అక్కడే ఉంటారని భయపెట్టారు. ఆరిలోవలో భాగ్యలక్ష్మి, సుజాతల నాయకత్వంలో మహిళలు రాత్రిపగలు ఉన్నారు. మహిళలను చెదరగొట్టడం కోసం పోలీసులు కీచక పర్వం సాగించిన తీరుకు సభ్య సమాజం తల వంచుకున్నే పరిస్థితి దాపురించింది. చెవులలో ఈలలు వేయడం, చెంగులు లాగడం, మిమ్మల్ని ఇక్కడ ఏమైనా చేస్తే ఎవరు దిక్కు అని అవమానించినా మహిళలు బెదరలేదు. స్థలం విడువలేదు. చివరికి లాఠీచార్జీ, అరెస్టులు చేసి, జైలుకు పంపించారు. గాజువాకలో

(తరువాయి 8వ పేజీలో...)





# మహాత్ముని హత్య జాతికే మాయని మచ్చ

✍ అల్లూరి మన్మోహిని



అది 1948 జనవరి 30. సాయంత్రం 5 గం॥లు. దేశ రాజధాని ఢిల్లీలోని బిర్లా ప్రార్థనా మందిరం (భవనం) గుమ్మం ముందు నాథూరాం గాడ్సే పిస్తోలుకి జాతిపిత గాంధీజీ 'హేరామా' అంటూ రక్తపు మడుగులో నేలకొరిగారు. హిందు ముస్లిం భాయి భాయి అనే గుండె ఆగిపోయింది. స్వతంత్ర భారతాన తొలి బలిదానం బాపూజీ.

"నాకు వద్దు ఈ స్వతంత్రం. నేను కోరినది ఈ స్వతంత్రం కాదు" అన్నారు (బాపూజీ) గాంధీజీ.

1947 ఆగస్టు 15 తొలి స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలకు గాంధీజీ హాజరు కానేలేదు. వేదనతో ఇంట్లోనే ఉండిపోయారు. పాకిస్తాన్‌ని విడదీసి (అంటే భారతదేశంలోని కొంత భాగాన్ని విడదీసి, దానికి పాకిస్తాన్ అని పేరు పెట్టి) ఇచ్చిన స్వాతంత్ర్యాన్ని గాంధీజీ అంగీకరించలేదు. హిందు, ముస్లిం భారతమ్మ బిడ్డలు. పాకిస్తాన్‌ని విడదీస్తే తల్లి గర్భం చీల్చినట్లే అని ఘోషించాడు గాంధీజీ. అందుకే స్వతంత్రం వచ్చిన ఐదున్నర నెలలకే గాడ్సేల ముఠా జాతిపిత గాంధీజీని నిలువునా హత్య చేసింది. సామ్రాజ్యవాదుల "చీలించు, పాలించు" అనే పథకం విజయవంతమయింది. అన్నదమ్ముల మధ్య పెట్టిన చిచ్చుతో హిందూ ముస్లిం వైషమ్యాలతో దేశం రక్తపాతమయింది. ఆ ఫలితం దేశం ఈ నాటికే అనుభవిస్తూనే ఉంది. రోజు రోజుకి వేర్పాటువాదం విలయతాండవం చేస్తోంది. ఇద్దరు దేశ ప్రధానులు ఇందిరా గాంధీ, రాజీవ్ గాంధీలుహత్య చేయబడ్డారు. సమైక్య భారతంలో చిచ్చు రగులుస్తూ గాంధీజీ పిలుపిచ్చిన భాషా రాష్ట్రాలను విచ్ఛిన్నం చేస్తున్న ప్రమాదం తయారయింది.

"భారత రాజ్యాంగంలోని కీలకమైన లౌకిక విధానానికే తూట్లు పొడిచి దేవుని పేరుతో చిచ్చు రగిల్చి బాబ్రీ మసీదుకూల్చి మతోన్మాదం అధికారం చెలాయించింది. అహింసాయుత రామ రాజ్యం కావాలి అన్న మహాత్ముని సందేశాన్ని హింసాయుత రామరాజ్యం చేశారు.

ఇక్కడ ఒక వివరణ: మతం అంటే అభిమతం. వాడి మతం వాడిది అని మన వాళ్ళు వాడుక పదం కూడా అది. అనగా ఎవరి ఇష్టం వాళ్ళది అని. అందుకే మన రాజ్యాంగంలోని కీలక అంశం కూడా లౌకిక విధానం. అన్ని మతాలను గౌరవించటం. అందుచే ఏమతానికైనా ఉన్మాదం ప్రమాదకరం. అందుకే మతోన్మాదం పనికి రాదు. ఈ సందర్భంగా ఒక విషయం గుర్తు చేయాలి.

దేశంలో ముస్లింల (మొగలాయిల) పరిపాలన కాలంలో ఔరంగజేబు తాను సున్నీ మతస్థుడైనా ఎవరి మతం వారిది అని మత సామరస్యం పాటించాడు. ముఖ్యంగా మొగలాయిల పాలనలో ప్రముఖుడైన అక్బరు గొప్ప మత సామరస్యం పాటించాడు. హిందూ మతాన్ని గౌరవించే తన విధానానికి రుజువుగా స్వయంగా తానే ఒక హిందూ స్త్రీని వివాహం చేసుకున్నాడు. మరియు అన్ని మతాల సారం ఒకటే అనేది రుజువు చేయుటకు తాను 'దీన్ ఇలాహి' అనే ఒక మత

సంస్థను నిర్మించి ఆగ్రాకు దగ్గరలో ఉన్న ఫతేపూర్ సిక్రీలో ఒక ఆలయం కూడా నిర్మించాడు. ఆ ఉన్నతమైన మత గౌరవాన్ని అలవర్చుకోవాలి. మానవత్వమే మతం అనేది గుర్తించాలి.

గాంధీజి స్వతంత్రం వచ్చాక కాంగ్రెసు సంస్థనే రద్దు చేయమన్నారు. "కాంగ్రెసు సంస్థ స్వతంత్రం సాధించే వరకే దాని పాత్ర" అన్నారు బాపూజీ.

అంటే స్వాతంత్రం సాధించాలి. పరాయి పాలన పోవాలి అని దేశంలోని సకల ప్రజానీకం కాంగ్రెసు సంస్థలో చేరారు. అందులో ఎంతోమంది గొప్ప దేశభక్తులు, త్యాగధనులతోపాటు స్వార్ధపరులు, దొంగలు, బందిపోటులతో సహా ఉన్నారు. కాంగ్రెసు సంస్థ పాలనలో నిస్వార్ధ దేశ భక్తులు, జవహర్ లాల్ నెహ్రూ, బాబూ జగజ్జీవన్ రామ్, రాజేంద్ర ప్రసాద్, వల్లబాయి పటేల్, టంగుటూరి ప్రకాశం, లాల్ బహదూర్ శాస్త్రి మొదలైన త్యాగధనులు ఉన్నారు. కాని మహామేధావి అయిన మహాత్ముడు దూరదృష్టితో స్వాతంత్ర్య ఫలాలు దేశ ప్రజలందరికి దక్కవు. నోరు గల వాళ్ళదే పెత్తనం అవుతుందనేది గ్రహించే కాంగ్రెసు సంస్థను రద్దు చేయమన్నారు. అది జరగలేదు.



అందుచేతనే త్యాగధనుల పేరుతో స్వార్థపరశక్తులే పైచేయి అయింది. గాందీజీ, నెహ్రూ ఆశలు నెరవేరలేదు. కాంగ్రెస్‌లో నెహ్రూ భూసంస్కరణలు ప్రకటించారు. సోషలిస్టు తరహా సమాజాన్ని నిర్మిస్తామన్నారు. ఇందిరాగాంధీ సోషలిజమే నిర్మిస్తాను అన్నారు. కాని భూసంస్కరణలు సంగతి చూస్తే స్వతంత్రం వచ్చి 60 సం॥లు అవుతున్నా దేశంలో వేలాది ఎకరాలు గల బడా భూస్వాములు సెంటు భూమి లేని కోట్లాది వ్యవసాయ కార్మికులు వున్నారు.

బ్రిటిష్ వలస పాలనకు ముందు భారతదేశం సిరి సంపదలతో పాడిపంటలతో విలసిల్లింది. అనంతరం పరాయి పాలనతో సంపదలు కొల్లగొట్టబడ్డాయి. దేశం బానిసత్వంతో నలిగిపోయింది. చివరకు ఎందరెందరో మహనీయులు, దేశ ప్రజల అనంత త్యాగాల ఫలితంగా స్వతంత్రం సాధించుకున్నాము. దేశానికి పూర్వ వైభవం వస్తుందని ఆశించాము. కానీ ఇంకా ఇంకా మెజారిటీ ప్రజల కష్టాలు పెరిగిపోతున్నాయి. అవినీతి రాజ్యమేలుతోంది. అరాచకం, ఆటవిక హింస పెరగిపోయింది. దేశ సంపదలు చీకటి బజారుకు చేరిపోతున్నాయి. ఎటు చూచినా అప్పుల భారతంలో పేదరికం తాండవిస్తోంది. కోట్లాది అభాగ్యులు, తిండి కరువై తలదాచుకొనే నీడలేక ఫుట్‌పాత్‌ల మీద చెట్ల క్రింద, కటిక చలిలో, ఎండలో, వానల్లో అలమటించే దృశ్యమే ఈ స్వతంత్ర భారతం.

అన్నపూర్ణ ఆంధ్రలో ఆకలి చావులు, కరువులు, ప్రకృతి శాపమా? పాలకుల శాపమా? ఎటు చూచినా జీవనదులు, పసిడి పంటలనిచ్చే సారవంతమైన భూములు, పర్యావరణాన్ని కాపాడుతూ అడవితల్లి సంపదలతో అలరారే భాగ్యదేశం మనది. స్వతంత్ర దేశంలో విదేశీ బహుళ జాతి కంపెనీలు ప్రవేశించి స్వదేశీ వస్తువులకు సవాలుగా తయారయ్యాయి. ప్రపంచ బ్యాంకుకు దేశాన్నే తాకట్టు పెట్టుకుంటున్న దీనావస్థ చివరకు జాతీయతనే కోల్పోతున్న దుస్థితి. భారత ప్రజలకు తిండి పెట్టి పోషించే రైతాంగం చేనేత కార్మికులు వేలాదిగా అప్పులపాలై చివరకు ఆకలి చావులు ఆత్మహత్యలతో గ్రామ సీమలు ఘోషిస్తున్నాయి. గ్రామీణ భారతమే నిర్వీర్యమైపోతోంది.

బాపూజీ, భారత దేశం గ్రామాల్లో నివసిస్తోంది అన్నారు. గ్రామ రాజ్యాలు నిర్మించమన్నారు. కాని గ్రామీణ జీవితమే నిర్జీవమైపోతున్న దీనావస్థ.

## గాంధీజీకి ప్రాణం రాట్నం:

బ్రిటిష్ పాలనకు ముందు దేశంలో చేనేత పరిశ్రమ ఎంతో ఉచ్ఛ దశలో ఉండేది. బ్రిటిష్ ప్రభుత్వం తమ దేశం నుండి మిల్లు వస్త్రాలు మన దేశంలోకి దిగుమతి చేసి చౌకధరలకు అమ్మటం మొదలు పెట్టారు. మన చేనేత పరిశ్రమను దివాళా తీయించారు. గాంధీజీ బ్రిటిష్ ప్రభుత్వ దోపిడీ విధానానికి సవాలుగా విదేశీ వస్త్ర బహిష్కరణకు పిలుపిచ్చారు. స్వతంత్రపిపాసతో ఉన్న ప్రజలంతా తమ ఇళ్ళలో ఉన్న విదేశీ వస్త్రాలన్నీ వీధులలో కుప్పలుగా పోసి తగులపెట్టారు.

గాందీజీ తాను స్వయంగా రాట్నం పట్టి నూలు వడికారు. దేశ ప్రజలంతా ఇంటింటా రాట్నం పెట్టుకొని నూలు వడకాలి, అందరూ చేనేత బట్టలే కట్టుకోవాలి అని పిలుపిచ్చారు. కాంగ్రెసు కార్యకర్తలంతా బట్టల షాపుల వద్ద విదేశీ బట్టలు అమ్మకుండా కొనకుండా పికెటింగ్‌లు చేయమన్నారు. ఇంటింటా రాట్నం వెలిసింది. నూలు వడుకుట, చేనేత వస్త్రాలు తయారీ ప్రతి భారతీయుని పవిత్ర ధర్మంగా

సాగింది. చేనేత పరిశ్రమ అభివృద్ధి కోసం సాగిన ఆ మహోద్యమం ఎంతో ఉజ్వలాయమానంగా సాగింది. బ్రిటిష్ ప్రభుత్వం ఖంగుతిన్నది, గడగడలాడింది.

కాంగ్రెసు కార్యకర్తలు ఇళ్ళలో రాట్నాల మీద నూలు వడుకుతూ రాట్నం యొక్క విలువను ప్రబోధిస్తూ పాటలు పాడేవారు. మా అమ్మ గారు పాడుకునే పాట కొంచెం గుర్తు వచ్చింది ఈ సందర్భంలో

పాడవే రాట్నమా - ప్రణయ భారత గీతి ॥పా॥
ఆడవే కదురనీ - ఆటయే మా కోట ॥పా॥
కదురాడి నీన్నాళు - కరువులే లేవాయె ॥పా॥
కదురాగి పోగానే - కడగండ్లు ఘనమాయె ॥పా॥
విశ్వ సోదర భావ - విజ్ఞాన విభవంబు ॥పా॥
వెలయించి ఖండాంత్ర - విలయంబు కూర్చవే ॥పా॥

ఇంతటి ప్రతిభగల రాట్నమే దేశంలో ఈనాడు 3వంతులు కనుమరుగైపోయిన విషాదస్థితి.

కాంగ్రెసు సంస్థకే ప్రతిష్ఠాత్మకమైనది చేనేత పరిశ్రమ. కాంగ్రెసు సంస్థ జెండా మీదే రాట్నం గుర్తు. గాంధీజీకి ప్రాణ సమానమైనది చేనేత పరిశ్రమ. రాట్నం కాంగ్రెసుసంస్థకు గర్వకారణమైన చేనేత పరిశ్రమనే ఈనాడు దివాళా తీయించారు. నేత వృత్తిపడిపోయి చేనేత కార్మికులు మామూలు కూలీలుగా, చిన్న చిన్న షాపుల్లో జీతగాళ్ళుగానూ బ్రతుకుతున్నారు.

బ్రిటిష్ పాలకులు మిల్లు వస్త్రాలు తమ దేశం నుండి తీసుకొచ్చి మిల్లు వస్త్రాలు గొప్పవని విర్రవీగే సందర్భంలో దానికి సవాలుగా విక్టోరియా రాణికి ఒక చేనేత కార్మికుడు 7 గజాల చీరను చేసి అగ్గిపెట్టెలో పెట్టి కానుకగా ఇచ్చాడు. అద్భుత చేనేత కళా ప్రతిభను సృష్టించిన ఆ చేనేత కళాకారులు అంతమైపోతున్నారు. పనులు లేక వస్తులతో, అప్పులపాలై ఆకలి చావులతో నేత కుటుంబాలు రోదిస్తున్నాయి.

## గాంధీజి హరిజనోద్ధరణ:

"హరిజనోద్ధరణ కావాలి. అంటరానితనం అంతరించాలి". అని గాంధీజి అస్పృశ్యతా నివారణకు తన జీవితం అంకితం చేసాడు. గాంధీజి తన పర్యటనలలో హరిజన వాడలలోనే మకాం పెట్టేవాడు. తనకు ఆడబిడ్డలు లేక ఒక హరిజన బాలికను పెంచుకొని ఎప్పుడూ తన కూడా ఉంచుకునేవాడు. కాని ఇప్పటి పాలకులు, మహాత్ముని శిష్యులు, పెద్దలు దళిత వాడలలో బసలు చేసిన సందర్భాలు కానరావు. ఈనాటి నవనాగరిక యుగంలో అంటరానితనం యథేచ్ఛగా సాగిపోతోంది. గ్రామాలు, పట్టణాలలో మారుమూల దళిత వాడలలో మరుగు దొడ్లు, మంచినీరు, మొదలైన కనీస సౌకర్యాలు కూడా లేని దుస్థితి. అంటరానివారు అనే అహంకార నిషాలో అనేక గ్రామాలలో అగ్రవర్ణ పెత్తందార్లు కొంతమంది వ్యవహరించటం చూస్తున్నాం. మూఢ విశ్వాసాలతో దళితులపై దాడులు, హింసలు, ఈనాటి శాస్త్రీయ విజ్ఞానానికే సవాలుగా సాగిపోతున్నాయి. ఉదా:- ఒకసారి కంచికచర్ల అనే గ్రామంలో పాలేరుగా ఉన్న 12సం॥ల అమాయక దళిత బాలుణ్ణి చిన్న తప్పుకోసం యజమానులు క్రూర మృగాల వలె చెట్టుకు కట్టి గడ్డితో సజీవ దహనం చేసిన ఘటన, ఆ కిరాతకం గుర్తు వస్తే ఇది మానవ సమాజమా? మృగాల సమాజమా? అనుకుంటాం. ఇంకా ఇటీవలి కాలంలో దళితులపై జరుగుతున్న ఎన్నెన్నో ఘోరాలు, నేరాలు చట్టాన్నే వెక్కిరిస్తూ వికటాట్టహాసం చేస్తున్నాయి. దీనికి మహాత్ముని సాక్షిగా పాలకులు జవాబు చెప్పగలరా?

## స్వతంత్రానికి రుజువుగా గాంధీజి సందేశం:

"భారత స్త్రీ ఒంటరిగా అర్ధరాత్రి రోడ్డుపై ధైర్యంగా నడవగలిగినపుడే దేశానికి నిజమైన స్వతంత్రం వచ్చినట్లు రుజువు" అన్నారు.

కానీ ఈనాడు స్త్రీలను, బాలికలను అమ్ముకునే మార్కెట్లు పవిత్ర భారత స్త్రీ శరీరం వెలకట్టి కోటానుకోట్ల ధనరాశులు ఆర్జిస్తూ ఆటవిక వ్యాపారం సాగుతున్న ఈ దేశంలో అందని మహాత్ముని మాటలు ఊహకు కూడా రాలేని విషాద భారతం ఇది. పట్టపగలే స్త్రీకి రక్షణ లేని దుస్థితి. ఇంటా, బయటా పైకి కనిపించని హింస మహిళలపై సాగుతోంది. పట్టపగలే పొలాలలో, ఫ్యాక్టరీలలో, ఆఫీసుల్లో, విద్యాలయాల్లో స్త్రీకి రక్షణ లేని దుస్థితి. స్వతంత్ర భారతంలో ఈ మహిళల దుర్గతికి ఏమని జవాబు చెప్పగలరు పాలకులు?

దేశంలోని నిజమైన దేశ భక్తులు త్యాగధనులు ముందుకు రావాలి. కోట్లాది పీడిత శ్రామిక జనావళి నిద్రాణ శక్తి మేల్కొలిపినపుడే బాపూజీ కలలు గన్న నిజమైన స్వతంత్ర భారతిని చూడగలం. ఇంకా అమరులైన భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్‌ల వంటి ఎందరెందరో మహనీయుల త్యాగాల ఆశలు నెరవేరగలవు. మరో స్వతంత్ర్యోద్యమానికి దేశం సన్నద్ధం కావాలి.

(జనవరి 30 గాంధీజీ వర్ధంతి సందర్భంగా)

*

(5వ పేజీ తరువాయి )

## స్త్రీల పరమైన ఇంటి సమస్య - పోరాటంలో మహిళలు

శేషారత్నం, సంతోషం, సుజాత గార్ల నాయకత్వంలో అందరిని అరెస్టులు చేసి జైలుకి పంపించారు. మహిళలను అరెస్టు చేసి జైలుకు పంపిస్తే ఉద్యమం ఆగిపోతుందని ప్రభుత్వం భావించింది. తిరిగి మరల మహిళలు తాము ఆక్రమించిన స్థలాలవద్దకు వస్తూనే ఉన్నారు.

చిన్న పిల్లలను, ముసలి వాళ్ళను సైతం వదిలి పెట్టకుండా అరెస్టులు చేశారు. 15 రోజులు జైల్లో పెట్టారు. సిటీలో ఏ పోలీస్ స్టేషన్ ఖాళీగా లేవు, 'మమ్మల్ని అరెస్టులు చేయండి' అంటూ మహిళలు అరెస్టులకు సైతం బెదరలేదు.

మొదటి రోజు అరెస్టులు, లాఠీల భీభత్సమును చూసి మరల తిరిగి ఆ స్థలంలోకి రారు అని పోలీసులు, ప్రభుత్వం భావించింది. కాని పేద మహిళల మనోధైర్యం దెబ్బ తినలేదు. 30.12.2006 నుండి మహిళలు ఆ స్థలంలోనే వంటా వార్పు చేసుకున్నారు. ఇది చూసి పోలీసులకు దిక్కుతోచని పరిస్థితి ఎదురైయింది. అధిక బలగాలను తెప్పించుకున్నారు. డిసెంబర్ నెలలో చలి తీవ్రత అందరికి తెలిసిందే! అయిన మహిళలు రాత్రులు చలి మంటలు వేసుకొని అక్కడే ఉండేవారు. ఆ కొండలలో, తుప్పలలో, పాములు తిరుగుతున్న, నీళ్ళు లేకపోయినా, పగలు ఎండకు, రాత్రులు చలితో ఉండటం చూస్తే, ఇల్లులేని వాళ్ళు పడే బాధ అర్థం చేసుకోవచ్చు.

మొత్తం ఈ ఉద్యమంలో 150 మంది అరెస్టు అయ్యారు. వారిలో 80 మందిపైగా స్త్రీలు. దారిద్ర్యం చాకిరీ స్త్రీల పరమయినట్లుగానే ఇంటి సమస్య కూడ స్త్రీల పరం కావడమే స్త్రీలు ఇంతగా కదలి రావడానికి కారణం.

*

# ప్రపంచ వ్యాప్తంగా పోరాడే మహిళలకు మార్చి 8 ఓ స్ఫూర్తి

టి. జ్యోతి

మార్చి 8, అంతర్జాతీయ మహిళా దినోత్సవం. ప్రపంచ వ్యాప్తంగా మహిళలకు ఉత్తేజాన్ని, స్ఫూర్తినిచ్చే రోజు. 1911 సం॥ నుండి ప్రారంభమైన ఈ హక్కుల దినం మహిళలు స్వేచ్ఛ, సమానత్వం, స్త్రీ విముక్తి కోసం గళం విప్పిన రోజు.

డెన్మార్క్ రాజధాని కోపెన్ హగన్‌లో జరిగిన అంతర్జాతీయ కమ్యూనిస్టు సదస్సులోనే వివిధ దేశాల నుండి హాజరైన మహిళా నాయకులు స్త్రీల సమస్యలు, హక్కులపై ప్రపంచ వ్యాప్తంగా ఒక రోజు పాటించాలని తీర్మానించారు. అదే సమయంలో అమెరికాలో లక్షలాదిగా వున్న మహిళా కుట్టు కార్మికులు వేతనాలతోపాటు ఇతర సమస్యలు పరిష్కరించాలని, మహిళలు ఓటు హక్కు కోసం సమ్మె చేశారు. కొన్ని సమస్యలు పరిష్కరించుకున్నారు. ఆ సాంప్రదాయాల్ని కొనసాగించే భాగంగానే మార్చి 8 ప్రపంచ మహిళా దినోత్సవంగా పిలుపునిచ్చారు.

ప్రపంచ వ్యాప్తంగా యుద్ధ మేఘాలు కమ్ముకుంటున్న రోజులవి. పని లేదు, ఆకలితో అలమటించే పరిస్థితి. స్త్రీలపై అణచివేత, వివక్ష, చట్టపరమైన హక్కులు, ఓటు హక్కు లాంటివి లేవు. ఆ సమయంలో సోషలిస్టు మహాసభ ఇచ్చిన పిలుపు ప్రపంచ వ్యాప్తంగా మహిళలకు ఉత్సాహానిచ్చి పెద్ద సంఖ్యలో పోరాటాల్లో పాల్గొని పోరాట పటిమను ప్రదర్శించేట్టు చేశారు. కొన్ని హక్కులు సాధించుకున్నారు. ఆనాటి నుండే విశ్వవ్యాప్తంగా మహిళలు తమకోర్కెల సాధనకు, ప్రభుత్వంపై వత్తిడి తేవడానికి అంతర్జాతీయ మహిళా దినోత్సవం ఒక పోరాట సాధనంగా మారింది.

మార్చి 8 పోరాట స్ఫూర్తితో రాష్ట్రంలో కూడ 1936 సం॥లోనే మహిళా సంఘాన్ని స్థాపించి మహిళల సమస్యలపై, హక్కులపై గళమెత్తి తనకంటూ ఒక ప్రత్యేకమైన స్థానాన్ని నిలుపుకుంది ఐద్వా. నేడు మహిళా ఉద్యమం కొన్ని హక్కులు సాధించుకుని ఒక అడుగు ముందుకేస్తుంటే సరికొత్త సమస్యలు చుట్టుముట్టి సాధించుకోవలసిన హక్కుల కోసం పిడికిలి బిగించమంటున్నవి.

కేంద్రంలో ఉన్న యుపిఏ ప్రభుత్వం మరియు రాష్ట్ర కాంగ్రెస్ ప్రభుత్వం ప్రజా, మహిళా వ్యతిరేక విధానాలు అవలంభిస్తూ సామాన్యుల హక్కులు కాలరాస్తున్నవి. జీవితాలను దుర్భరం చేస్తున్నవి. దేశ వ్యాప్తంగా దిగజారుతున్న మహిళల స్థితిని మెరుగుపరుచుకు నేందుకు మహిళలంత గొంతు విప్పాలి. ఈ క్రింది డిమాండ్స్ సాధనకు కదలాలి.

## నిత్యావసరాల ధరలు ఆకసంలో:

నిత్యావసర వస్తువుల ధరలు దినదినము ఆకసాన్నంటుతూ సామాన్యుడి జీవితాల్ని దుర్భరం చేస్తున్నవి. గత ఏడాదితో పోల్చుకుంటే



బియ్యం, పప్పు, చింతపండు, ఉల్లిగడ్డ, వంట నూనెలు ఒకటేమిటి ఈ ఏడాది అన్ని నిత్యావసర వస్తువుల ధరలు విపరీతంగా పెరిగాయి.

2005 అక్టోబరుతో పోల్చుకుంటే పప్పు, గోధుమలు, శనగపప్పు టోకు ధరలు వరుసగా 84%, 68%, 23% పెరిగాయి. మొత్తం మీద నిత్యావసర వస్తువుల ధరలు 12 నుండి 84% వరకు పెరిగాయి. ఇప్పటికే అత్యధిక మంది మహిళలు, పిల్లలు పోషకాహారం లభించక రక్త హీనతతో బాధపడుతున్న తరుణంలో రెక్కలొచ్చిన అధికధరల వల్ల వారి పరిస్థితి మరింత అధ్వాన్నం కానుంది.

## ధరల పెరుగుదలను ఒకసారి గమనిస్తే...

| క్వింటాలుకు | 2005 అక్టోబర్ | 2006 అక్టోబర్ |
|---|---|---|
| పెసరపప్పు | 2,189 | 4,035 |
| శనగపప్పు | 1,878 | 3,158 |
| గోధుమలు | 802 | 983 |
| నూనె (కెజి) | 51 | 63 |
| పాలు ,, | 16 | 20 |
| నెయ్యి ,, | 160 | 200 |
| ఉల్లిపాయలు | 3 | 17 |

ధరల పెరుగుదల వల్ల విద్య, వైద్యం, రవాణాలకు కూడ ప్రజలు మరింత ఎక్కువగా ఖర్చు పెట్టవలసి వస్తున్నది. వలసలు, అప్పులు పెరుగుతున్నాయి. రుణభారం పెరగడానికి, వైద్య ఖర్చులు కూడా ఒక కారణంగా వుంటున్నది. కుటుంబాన్ని బతికించుకోవడానికి మహిళలు వ్యభిచార వృత్తిలోకి నెట్టబడుతున్నారు.

ప్రజల ఆకలి చావులు లేకుండా వుండాలంటే అందరూ ఉల్లాసంగా పండుగలు జరుపుకోవాలంటే నిత్యవసర వస్తువుల ధరలను నియంత్రించాలి. బ్లాక్ మార్కెటింగ్‌ను అరికట్టాలి. నిత్యవసర వస్తువుల నియంత్రణ చట్టంను పటిష్టంగా అమలుచేయాలి.

## నిర్వీర్యమైన ప్రజాపంపిణీ వ్యవస్థ:

ప్రజాపంపిణీ వ్యవస్థను బలోపేతం చేస్తామని కనీస ఉమ్మడి ప్రణాళికలో కేంద్ర ప్రభుత్వం పేర్కొంది. కాని దీనికి భిన్నంగా వ్యవహరిస్తుంది. తెల్ల రేషన్ కార్డులు, అంత్యోదయ కార్డుల వారికి నెలకు 5 కిలోల బియ్యం కోతను కేంద్ర మంత్రి మండలి నిర్ణయించింది. దీని ద్వారా 4,500 కోట్ల రూ॥లు సబ్సిడీలను మిగుల్చుకోవాలని ప్రభుత్వం చూస్తోంది. దీని వల్ల తలసరి ధాన్య వినియోగం 476 గ్రాముల నుండి 418 గ్రాములకు పడిపోయింది.

రేషన్ షాపులలో ఇచ్చే సరుకులు 1,2 వస్తువులకే కుదించబడి నాణ్యత చాలా నాసిరకంగా వుంటున్నది. రాష్ట్ర వ్యాప్తంగా కిరోసిన్ కోతతో సామాన్య ప్రజలు ఉక్కిరి బిక్కిరి అవుతున్నారు. పట్టణాలలో తెల్ల రేషన్ కార్డు దారులు 5 లీటర్లు మాత్రమే కిరోసిన్‌తో ఇవ్వడంతో వంట చేసుకునే భాగ్యానికి కూడా దూరమవుతున్నారు. ప్రజా ఉద్యమాల వత్తిడి మేరకు రేషన్ కార్డులు ఇచ్చిన ప్రభుత్వం రేషన్ కోటాను పెంచకపోవడంతోపాటు షాపుల సంఖ్యను కూడా పెంచలేదు. గ్యాస్ సిలిండర్‌కు రేషన్ కార్డుకు లింకు పెట్టడంతో సామాన్య ప్రజలు ఇబ్బంది పడుతున్నారు.

ప్రజాపంపిణీ వ్యవస్థను పటిష్టం చేసి ఇచ్చే సరుకుల సంఖ్య పెంచడంతోపాటు నాణ్యత పెంచాలి. సబ్సిడీలు కొనసాగించాలి.

## మహిళా రిజర్వేషన్ బిల్లు:

శీతాకాల పార్లమెంటు సమావేశాల్లో మహిళా రిజర్వేషన్ బిల్లు పార్లమెంటులో ప్రవేశపెడతామన్న యుపిఎ ప్రభుత్వం "మహిళలకు మళ్ళీ మొండిచెయ్యి" చూపింది. ఈబిల్లును మేం తెస్తాం, మేం తెస్తాం అనడం తప్ప ఎందుకు తేలేకపోయిందో చెప్పుకోలేని స్థితిలో వుంది. ఆర్.జె.డి., ఎస్.పి. పార్టీల ఒత్తిళ్ళే దానికి కారణమని పాత కథను వినిపించింది. మహిళా రిజర్వేషన్ బిల్లు పది సం॥ల నుండి పార్లమెంట్ గోడలకు వేలాడుతూ ఉంది.

ప్రపంచ వ్యాప్తంగా చూసినట్లయితే దాదాపు 20 దేశాల్లో చట్టసభలలో మహిళల శాతం 30% లేదా అంతకు మించి వున్నది. అతి తక్కువ ఆదాయం కలిగిన దక్షిణాఫ్రికా, రువాండా (ఇక్కడ 49% వున్నాయి) వంటి దేశాలతోపాటు యుద్ధాలలో మునిగి వున్న మొజాంబిక్, టాంజానియా, పాలస్తీనా వంటి దేశాలలో సైతం స్త్రీలకు 20% స్థానాలు కేటాయించారు. ఇలాంటి పరిస్థితిలో మనం ఇంకెంత మాత్రం జాప్యం చెయ్యరాదు.

వామపక్షాలు ప్రత్యేకించి మార్క్సిస్టు పార్టీ మహిళా బిల్లుకు అరమరికలు లేని మద్దతునిస్తూ వున్నాయి. వామపక్షాల చొరవవల్లనే ఈ బిల్లును కనీస ఉమ్మడి కార్యక్రమంలో చేర్చారు.

మిగతా రాజకీయ పార్టీలు అనేక ప్రతిపాదనలు తీసుకువస్తూ బిల్లును వెనక్కినెట్టే ప్రయత్నం చేస్తున్నాయి. దీనిని తిప్పి కొట్టాలి. పోరాటాన్ని ఉధృతం చెయ్యడంతోపాటు ఈ బడ్జెట్ సమావేశాల్లోనైనా పార్లమెంటులో బిల్లును ఓటింగ్‌కు పెట్టాలని డిమాండ్ చెయ్యాలి.

## మహిళలపై పెరుగుతున్న హింస:

ప్రపంచీకరణ, ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాల వల్ల మహిళల పరిస్థితి "పెనంమీద నుండి పొయ్యిలోకి పడ్డట్టు" అయ్యింది. మహిళలపై నిత్యం ప్రతి 54 ని॥లకు ఒక అత్యాచారం, 51 ని॥లకు ఒక లైంగిక వేధింపు, 26 ని॥లకు ఒక కిడ్నాప్, ప్రతి దినం 17 వరకు వరకట్న హత్యలు జరుగుతున్నవని ప్రభుత్వ లెక్కలే చెబుతున్నాయి. ఇంటర్నేషనల్ ఆమ్నెస్టి లెక్కల ప్రకారం హత్యకు గురికాబడుతున్న మహిళల్లో నూటికి 70% భర్త లేదా ప్రియుడు,కలిసి జీవించే సహచరుని చేతిలోనే హత్య గావించబడుతున్నారు. దీనికి విజయవాడలో లాడ్జిలో జరిగిన లక్ష్మీ సుజాత హత్య ప్రత్యక్ష సాక్ష్యం.

స్త్రీ పురుష నిష్పత్తి క్రమేపి పడిపోతూ ప్రస్తుతం 1000:933గా వుంది. 6సం॥లోపు బాల బాలికల నిష్పత్తి 920కి పడిపోయింది. మహిళకు జన్మించే హక్కుతోపాటు జీవించే హక్కు కూడా హరించబడుతూ వుంది. మహిళలపై పెరుగుతున్న నేరాలు సామాజిక రుగ్మతగా మారిన వైనాన్ని ప్రభుత్వం తీవ్రంగా పరిగణించి నివారణకు అన్ని రకాల చర్యలు చేపట్టాలి.

## రాష్ట్ర ప్రభుత్వ విధానాలు:

రాష్ట్ర ప్రభుత్వం మద్యం షాపులకు విచ్చల విడిగా అనుమతి ఇవ్వడంతోపాటు మద్యం రేట్లు బాగా తగ్గించింది. నల్లాలకు నీటి మీటర్లు బిగించి గొంతు తడుపుకోవడానికి నీటిని కరువు చేసి మద్యంతో తడుపుకోమంటున్నది. ప్రభుత్వ ప్రధాన ఆదాయ వనరుగా వున్న ఎక్సైజ్ విధానం మహిళల కడగండ్లను పెంచుతున్నది.

రాష్ట్ర వ్యాప్తంగా పట్టణ ప్రాంతాల్లో ఇళ్ళ స్థలాల సమస్య మహిళలకు జీవన్మరణ సమస్యగా మారింది. బడా బాబులు, అధికార, ప్రధాన ప్రతిపక్ష రాజకీయ నాయకులు ప్రభుత్వ భూములను ఆక్రమించుకుంటుంటే, మౌనంగా వున్న ప్రభుత్వం గూడు కోసం జానెడు జాగా అడిగిన మహిళలపై లాఠీలు ఝళిపిస్తుంది. నిర్బంధాన్ని ప్రయోగిస్తుంది.

లక్షలాది పొదుపు గ్రూపుల మహిళలు రివాల్వింగ్ ఫండ్ లేక, పావలా వడ్డీ రుణాలు అమలుకాక నానా ఇబ్బందులు పడుతున్నారు. ఇక మధ్యాహ్న భోజన నిర్వాహకులకు అడుగడుగునా వెతలే. విద్య, వైద్యం, సంక్షేమ పథకాలకు ప్రభుత్వం బడ్జెట్‌లో కోత విధించడం వల్ల ఆట్టడుగు వర్గాలు ముఖ్యంగా మహిళలు బలి అవుతున్నారు.

అందుకే మార్చి 8 సాక్షిగా మహిళలు మౌనాన్ని వీడాలి. సమస్యల పరిష్కారానికి సమైక్యంగా కదలాలి. ప్రభుత్వంపై వత్తిడి తేవాలి. మన హక్కులు పరిరక్షించుకోవాలి.

# ఒంటరి జీవితంలో ఒక్కత్తే సీతమ్మ

శిలాలోలిత

రాత్రి కావడంతో చుట్టూ చీకట్లు అలుముకున్నాయి. హఠాత్తుగా కరెంటు పోయింది. కొద్దిసేపట్లోనే కరెంటు తిరిగి వచ్చింది. గదంతా వెలుగు ఆవరించుకుంది

ఆ వెలుగులో సీతమ్మ దిగులు నిండిన కళ్ళతో... "అమ్మయ్య, ఇయ్యాలెందుకో కరెంటు తొందరగానే వచ్చేసింది. చీకటంటే బుజ్జిగాడి కెంత భయంవెూ! ఆడ్ని నేనెంత అపురూపంగా పెంచుకున్నాను. కాళ్ళు కిందపెడితే కందుతయ్యేమోనని అర చేతుల్లో పెట్టుకొని పెంచాను. బుజ్జిగాడి చిన్నప్పుడు కరంటే లేదు. ఆముదం దీపాలే గందా! చీకట్లో తేళ్ళూ, జెర్రులూ పాకుతయ్యేమోనని, పాములెక్కడొస్తయ్యోనని ఎంత కని పెట్టుకొనుండేదాన్ని? దబ్బపండులా ఉండేవాడు. కంటినిండా నూనుకుం దామన్నా భయమేసేది నాకు. నాదిష్టే ఎక్కడ తగులు తుందోనని, దాలిగుంటలో నీళ్ళు తొరిపి, ఏడేడి నీళ్ళు ఎన్ని బిందెలు పోసేదాన్ని ఎన్నపూసరాసి, నలుగెట్టి, పిడకల మీద సాంబ్రాణి పొగేసేదాన్ని ఒక్కనాడన్నా జలుబొచ్చి ఎరగడు. వస బాగా పట్టించే దాన్నికదా! ఒకటే వాగుడు. చిలకలా మాట్లాదేవాడు. ఆడికేదన్నా ఐతే, చిన్న ముల్లు గుచ్చుకున్నా, ఒళ్ళు ఎచ్చబడ్డా కంటి మీద కునుకే వుండేది కాదు నాకు. ఆచార్లగారి మందేసి, తెల్లవార్లూ సేవచేసేదాన్ని. బిడ్డకు నిమ్మళమైనాకే కూలి పనికి పోయేదాన్ని, ఎన్నెన్ని కష్టాలు పడ్డాను. ఎన్ని రాత్రుళ్ళు ఏడ్చిఏడ్చి గుండె బరువు కాలేదు. బుజ్జిగాడి నాన్న బతికుంటే ఇన్ని బాధలు పడక పోదునేమో, కానీ అలా కూడా అనుకోవడానికి లేదు. తాగి తాగీ............... అన్ని అలవాట్లూ మరిగి ఆస్తంతా ఆరతి కర్పూరం చేసిన మహానుభావుడు గందా! వుంటే, మగదిక్కు అనేగాని, వున్నా రోజూ తన్నుదుగోలా, మాటల ములుకులు తప్పాయి గదా అని సరిపెట్టుకోడమే.



పద్దెనెమిదేళ్ళ వయసులో మొగుడుపోయి, ఒళ్ళో పిల్లాడ్ని పెట్టుకొని గోదారి ఈదినట్టే ఈదానుగా బతుకంతా వ్చ్! ఏంటో... చీకటయిందంటే చాలు బుజ్జిగాడు కళ్ళల్లోనే మెదుల్తాడు. ఆడ్నెలాగయినా పెద్ద చదువులు చదివించాలని, ఎంతకష్టమైనా మొయ్యగల్నన్న గుండె ధైర్యమే నాది. రోజు కూలి దానివి, 'నీవల్లేదైద్దే'! అని ఎద్దేవ "చేసినోళ్ళే అంతా. దాయాదులంతా ఎక్కడేమి సాయమడు గుతానోనని మొహం తిప్పుకున్నోళ్ళే.

రాళ్ళు కొట్టి, పరిగేరి, కోతకెళ్ళి, ఇళ్ళల్లో పనుల కెళ్ళి, ఒకటేమిటి ఎన్నివన్లు చేసానో, ఎండలేదు, వానలేదు. ఈ రోజు ఇంకో రూపాయెుత్తే నా పిల్లాడికి పనికొస్తది. ఎప్పుడు అదే రంధి నాకు. ఆడే లోకంనాకు, గోడమేక్కున్న కుండలో దాస్తున్న రూపాయలన్నీ లెక్కెట్టుకుంటూ, గోడమీద మసిబొగ్గుతో గీతలు గీసుకునేదాన్ని, మా అయ్య నాకు చదువు చెప్పించకపాయె. నేనన్నా నా కొడుకుని చదివించాలి. ఇదే ఆలోచనెప్పుడూ.

(అటు ఇటు నడుస్తూ, కాళ్ళు నొక్కుకుంటూ, కుండలో మంచి నీళ్ళొకసారి తాగుతూ, తల మీద నిస్పృహగా చేతులు పెటు కుంటూ, కన్నీళ్ళు తుడుచు కుంటూ దిగాలుగా గోడకు చారగిలి పడి కూర్చోవడం, ఆకాశం కేసి చూస్తూ నిట్టూర్చడం, దిగులు మేఘం చుట్ట కున్న మొహంలో భావాలు పలికించడం, మధ్య మధ్యలో సీతమ్మ చేస్తున్న పనులు)

బుజ్జిగాడ్ని బళ్ళో ఏసినప్పుడు, మిగతా పిల్లల్తో సమానంగా ఆడుకుంటం చూసి సంతోషంతో ఆ రాత్రంతా నిద్దరోలేదు. ఆడి పుస్తకాల సంచిని, పలకని అదే పనిగా చూస్తుంటే అవి ఆడు పెద్దయ్యి కలకటేరు ఐతాడని చెప్పినట్టనిపించేది. పెద్ద బలపాల డబ్బా, పెన్నూ ఒకటో తరగతి పుస్తకం కూడా కొనేసాను. పంతులు గారు నా ఆత్రం చూసి ఆరోజు ఎట్లా నవ్వారో........

బుజ్జిగాడు చదువులో మా చురుగ్గా వుండేటోడు. తరగతి మీద తరగతి భలే సదువుకుంటా పోయాడు. ఆడు నేలమీద సందమామ. నా ఇంటి సూరీడు. కానీ, సదువంటే ఎంత ఖర్సో, ఎన్ని అవస్థలు పడ్డానో ఆ దేవుడికే తెలుసు. ఆడు సదువుకుంటం కోసం ఆళ్ళ కాళ్ళు, ఈళ్ళ కాళ్ళు పట్టుకొని ఇంటికి కరెంటు పెట్టించుకున్నా. బిల్లు కట్టబోయేసరికి కళ్ళల్ల నీళ్ళు నిండేవి. సదువుకుంటుంటే రకరకాలు ఆడికిష్టమైనవి తినిపిస్త వుండేదాన్ని. ఒకసారిట్లాగే 'ఏసాకాలమప్పుడు' బుజ్జిగాడి ఒళ్ళు ఎచ్చబడింది. కాళ్ళూ సేతులాడలా! ఎన్నపూస తెచ్చి గుండెల మీద ఎడితే కరిగినీరై పోయింది. ఒకటే మొత్తుకుంటూ పంతులుగారి దగ్గరి కెళ్లాను. ఏసాకాలం ఒళ్ళు చల్లగుంటతా అని అరిస్తేగానీ కంగారు తగ్గలేదు.

ఐదో తరగతి వరకే మా వూళ్లో బడుంది. ఆ తర్వాత పక్కూరికే పోవాలి. నాలుగు మైళ్ళు నడవాలి. బిడ్డడు నడిచినడిచీ అలిసిపోయేటోడు. రాత్రి పూట రోజూ అరికాళ్ళకు నూనెరాసి, కాళ్ళు పట్టేదాన్ని. నా కాళ్ళు పగిలి రక్తాలు కారుతున్నా పట్టించుకునేదాన్నే కాదప్పుడు. పక్కూర్లో కూడా పదో తరగతి పస్టున ప్యాసయ్యాడు. ఆ రోజు నా కెంత సంతోషమో, పొగు చేసిన దబ్బుల్తో, ముగ్గుర్ని పిల్చి కడుపునిండా అన్నం పెట్టాను. నా కొడుకుని దీవించమన్నాను. ఆంజనేయసామి గుళ్ళో వంద పొర్లుదండాల మొక్కు తీర్చుకున్నాను. ఏదైనా మంచిపని చేద్దామనిపించి, మంగమ్మ కొడుకుని బళ్ళో ఏత్తానందని గుర్తొచ్చి, ఆడి మొదటి పీజు దబ్బులిచ్చాను. అయినా తృప్తి కలగలేదు. నా కొడుకు చల్లగుండాలంటే, ఇంకేం చెయ్యాలని ఒకటే తల్లాడాను.

అప్పటి వరకూ ఒక తీరు బతుకు, బుజ్జిగాడు పట్నమెల్లి కాలేజీలో చేరాక పద్దకష్టం ఇంకోటి. నా రెండు రెక్కల కష్టం చాల్లేదు. తిన్నానో లేదో నాకే తెల్సేది కాదు. ఎంత సేపూ ఆడికేం పంపాలన్న ధ్యాసే ఎప్పుడూ...

అప్పటి దాకా, రోజూ తెల్లారిలేస్తే కళ్ళముందుండే కొడుకు, సెలవులొస్తే గానీ కనిపించకపాయె. తెల్సినోళ్ళనందర్నీ అడిగేదాన్ని, సెలవు లెప్పుడని, రాత్రంతా ఆడు పడుకునే మంచంచూస్తూ ఆడి చొక్కాలు చేతుల్లో పట్టుకుని పడుకునేదాన్ని, ఆడి పదో తరగతి ఫోటో తడికకు అంటించుకున్నా. ఆడు నన్నే చూస్తున్నట్లనిపించేది.

నా కొడుక్కి మంచి ఉద్యోగమొచ్చాక నాకిక కష్టాలుండవు అనుకునేదాన్ని, కరెంటు పోయినప్పుడల్లా భయపడేదాన్ని. నా గురించి కాదు. వాడు అస్టల్లో ఏం భయపడ్తున్నాడోనని. ఎవరు వాడికి ధైర్యం చెబుతారని, కడుపుల నుంచి దుఃఖం సముద్రంలా తన్నుకొచ్చేది.

ఒకసారి సెలవులకు ఆడి సేయితుడ్ని తీసుకొచ్చాడు. 'ఆ నా సేయితుడి ముందు నువ్వు కూలికెల్తావని చెప్పకు. చిరిగిన చీరలు కట్టుకోకు. మనకు యవసాయముందని చెప్పాను. నువు అదే చెప్పు' అన్నాడు. జీవితంలో ప్రాణం పోయినా, సత్తె పెమాణంగా అబద్ధం ఎప్పుడూ చెప్పలేదు. ఎవరికీ అన్యాయం చెయ్యలేదు. చాతనైన సాయం ఊళ్ళో అందరికీ చేశాను. పెళ్ళొచ్చినా, చావొచ్చినా గొడ్డులా చాకిరీ చేసి సాయపడేదాన్ని. అందరితో మంచి అనిపించుకున్నాను. కానీ, ఆ రోజు నా కొడుకు కూలిదాని కొడుకునని నామోషి పడ్తున్నాడని తెలిసి గుండె పగిలింది. కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుందని వూరుకున్నాను.

నిజానికి ఆ రోజు ఆడట్లా గభాల్ని చెప్పా చెయ్యకుండా ఇంటికొస్తే, ఎంత కంగారు పడ్డాను. ఇంట్లో ఏం లేవు. నేనేమన్నా 'ఎచ్చాలు' (సరుకులు) కొనుక్కుని దాసుకునే దాన్ని కాదు గందా? యిమలమ్మ దగ్గర కెల్లి మజ్జిగ తెచ్చాను. పక్కింటికిపోయి రెండు కోడిగుడ్లు తెచ్చా, సాయంత్రానికి ఆళ్ళ కోడిని బేరమాడాను. బుజ్జిగాడికి ముంజెలిష్టమని కిష్టయ్యకి చెప్పొచ్చాను. కుండలో దాచివుంచిన కందిపప్పుని చెరిగి చెరిగి దాలిముంతలో పోసి వండాను. రెడ్డోరి చెర్లో చేపలు పడ్తన్నారుగందా, ఒక్క చేపన్నా దొరక్కపోద్దా అని అటో అడుగేసాను మాగాయి ముక్కలు రెండు ఎనకింటి కెళ్ళి తెచ్చాను. ఇన్ని మల్లగుల్లాలు పడి, ఏదేడి అన్నం వండి ఆళ్ళకెట్టి, నేను తినడమే మర్చిపోయాను. ఆడన్నా 'అమ్మా అన్నంతినవా' అని గుర్తన్నా చెయ్యలేదు.

ఏంటో... ఈ రోజెందుకో తేనితుట్టె కదిలినట్టే, ఒకటెనకొకటి ముసురు కొస్తున్నాయి. ఇవేమన్న తీరేయా? పెట్టేయా?

'ఆ నా సేయితుడి ముందు నువ్వు కూలికెల్తావని చెప్పకు. చిరిగిన చీరలు కట్టుకోకు. మనకు యవసాయముందని చెప్పాను. నువు అదే చెప్పు' అన్నాడు. జీవితంలో ప్రాణం పోయినా, సత్తె పెమాణంగా అబద్ధం ఎప్పుడూ చెప్పలేదు. ఎవరికీ అన్యాయం చెయ్యలేదు. చాతనైన సాయం ఊళ్ళో అందరికీ చేశాను. పెళ్ళొచ్చినా, చావొచ్చినా గొడ్డులా చాకిరీ చేసి సాయపడేదాన్ని. అందరితో మంచి అనిపించుకున్నాను. కానీ, ఆ రోజు నా కొడుకు కూలిదాని కొడుకునని నామోషి పడ్తున్నాడని తెలిసి గుండె పగిలింది.

సదువు పెరుగుతున్న కొద్దీ, సెలవుల్లేవని పాపం రావటమే మానుకున్నాడు. ఆడి ఉత్తరం చూస్తే, ఆకాయితం చిన్నప్పుడు నా ఒళ్ళో కేరింతలు కొట్టిన ముఖమే గుర్తొచ్చేది. ఎన్నిసార్లు ఉత్తరమొచ్చినా కళ్ళనీళ్ళే నాకు. గుండె గొంతుకలో కొచ్చి అడ్డం పడేది.

పక్కింటి రాములు కొడుకు దగ్గరికో, యీరమ్మ మనవరాలి దగ్గరికో, ఆ వుత్తరాన్ని కొంగున ముడేసుకెళ్ళి చదివించు కునేదాన్ని. ఉత్తరంలో రెండుమూడు మాటలుం డేవి. అమ్మా! ఎట్లున్నావే, అనే మాట కోసం కొన్నేం డ్లు ఎదురు చూశాను. నాకు మాత్రం ఈ ప్రపంచంలో ఎవరున్నారు? ఆడుతప్ప. దబ్బులు ఎప్పటిలోగా పంపాలో యివరా లుండేవి. ఉత్తరం రాలేదన్న నా ఎదురుసూపు, ఆ దబ్బులెట్లా జమ చెయ్యాలన్న బాధలో కలిసిపోయేది. ఎనకటిలాగా కష్టం చెయ్యలేకపోతున్నా. ఒక్కదాన్ని ఆ గుడిసెలో దిగులుపడ్తున్నా. నా కొడుక్కి వుద్యోగం వచ్చేస్తే యింకనాకు యిశ్రాంతే యిశ్రాంతి. అని రోజులు ఎళ్ళదీస్తున్నా.

ఇంత సిన్నదానివి. బతుకంతా ఎట్లీదుతవు? మారుమనువు చేసుకోమన్నారంతా. ఇన్లేదు లేను. నా కొడుకు అన్యాయమై పోతాడని చేసుకోలేదు.

'ఎంకటీరడి'కి చిన్నప్పటినుంచీ నా మీద మనసుందట. పిల్లగాడ్ని మనమే సాకుదాం. పెళ్ళికొప్పుకో అని బతిమాలాడు. ఒక పెళ్ళితో, మొగుడితో మనసిరిగిన నాకు, ఆడిమీద నమ్మకం కుదర్లేదు. అవసరమైనప్పుడొకమాట, ఆనక ఇంకోటిఐతే, ఎనకముందు ఎవరూలేని నాకు, పిల్లడేమైపోతాడని ఒప్పుకోలేదు. ఇంకోపదేళ్ళు నా కోసమే చూసి, చూసి, దేశాలు పట్టిపోయాడు ఎంకటీరడు అప్పటిగానీ ఆడి మాటలు నిజమని ఆలోచించలేదు నేను. ఐనా, ఆడ్ని పెళ్ళాడలేదని దిగుల్లేదు నాకు. మంచోడని తెల్సి, నా పెపంచం, లోకం అంతా నా కొడుకే. ఆడి బాగోగులే.

బుజ్జిగాడు అస్టల్లో ఎట్టుంటున్నాడో సూడాలన్న నా కోరిక కల తీరనే లేదు. నాలాంటి వాళ్ళొస్తే ఆడికి అమర్యాదని అప్పుడు నా కర్థం కాలేదు. 'సానా ఇబ్బంది. అమ్మా! మొగోళ్ళ అస్టల్లో నువ్వెక్కడుంటావ్' అంటే నిజమేకదా అనుకున్నా. నా కళ్ళముందు పుట్టిన పిల్లోడు, ఆడి తోటోళ్ళు నా పిల్లలే గందా అని అనుకున్నా, వాడొప్పుకోలేదు. అట్లా, ఆ కలా తీరలేదు నాకు.

బుజ్జిగాడు సదివిన సదువు నోరు తిరగదునాకు. ఎన్ని మాట్లు అనుకున్నా తప్పేవస్తది. పట్నంలో పెద్దుజ్యోగం వచ్చింది. చేసినప్పులన్నీ తీరుస్తాడని సంతోషపడ్డా. 'మంచి బట్టలు కొనుక్కోవాలి. ఖర్చులున్నాయని, ఐదారునెల్లపాటు గడిపాడు. ఈ అప్పులెట్ల తీరతయ్యా అని ఎంత మనేదపడ్డాను. నమ్మకం మీద తీసుకున్నవి కదా! తీర్చకుంటే ఎట్లా? అని. ఏమనుకున్నడో కొంతకొంత దబ్బు పంపేవాడు. 'అట్లాపైసా అప్పులేకుండా మల్లగుల్లాలుపడి తీర్చేశాను.

మావూర్లో రాములయ్య కూతురు 'చామంతి' చక్కటిపిల్ల. ఎంతమంచి మనసోదాన్ని. నా ఎనకెనకే తిరిగేది. చామనఛాయైనా కళగల మొఖం. రంగుదేముంది. గుణం ముఖ్యంకాని. 'చామంతి'

నా కోడలైతే నన్ను నా కొడుకుని కళ్ళలో పెట్టుకుంటదని తెల్సు నాకు. కానీ, పెద్ద చదువు చదువుకున్న కొడుక్కి పదో తరగతి పిల్ల నచ్చుద్దా అని అనుమానం, నా కొడుకు నా మాట కాదనడు అని ఒకవైపు. కట్నమిచ్చుకోలేరు, పిల్ల ఆగమైపోద్ది. నా ఇంటికోస్తే కూతుర్లెక్కసూసు కోవాలని నా ఆశ. కానీ, అదీనిరాశే ఐంది. పట్నంలో తనతో సదువుకున్న పిల్లని పెల్లి చేసుకున్నదంట. అదీ కాయితాల పెళ్ళి. నీ కర్థం కాదు అని ఉత్తరం రాశాడు. దండల పెళ్ళన్నను, గానీ ఈ కాయితాల పెళ్ళి, తల్లి అవసరం లేని పెళ్ళేందని చాలా బాధపడ్డాను. ఐనా, 'చామంతి' కాకపోయినా, ఆడు మనసుపడ్డ పిల్లకదా! బతుకంతా గడపాల్సినోళ్ళు, వూరిదాన్ని, మొరటుదాన్ని, నాకు పట్నపోళ్ళ మంచి చెడ్డలు, యివరాలు ఏం తెలుస్తయనుకున్న సరి పెట్టుకున్నా.

ఒక నాడొచ్చి నన్ను ఆడింటికి తీసుకెళ్ళాడు. చెట్టుకి పుట్టకి, వాగుకివంకకి, వూరందరికీ చెప్పాను. నా కొడుకు నా కోసం వచ్చాడని. ఊరొదులతుంటే నాకు దు:ఖం ఆగింది కాదు. ఇన్నాళ్ళు నాకావూరి మీద అంత ప్రేముందనీ తెలీదు నాకు. ఆ ఊర్లోనే పుట్టిన నేను ఎన్ని ఎన్ని కష్టాలు పడ్డానో కదా అని గుండె చెరువైంది. 'ఏంటా ఏడుపు అందరూ చూస్తున్నారని' కొడుకు యిసుక్కుంటుండే నా మీద ప్రేమని మురిసిపోయా! ఏడవొద్దంటున్నాడనుకున్నా.

నా కొడుకు ఇల్లు చూడ్డానికి రెండు కళ్ళూ చాల్లేదు. అన్నీ కొత్తసామానే తళతళ్ళాడుతున్నాయి. కొన్నింటినైతే నేనసలు చూడనే లేదెప్పుడు. మెత్తటి కూర్చీలు, పక్కలు, ఇంద్రుడిల్లే నా కొడుకిది. కోడలికి నెలతప్పింది. ఒకటే వేవిళ్ళు. ఎంత బాధపడ్డానో. అదేంటో, కోడలిచూపు, నన్నంత దూరంలో నిలబెట్టేది. కరువు దీరా మాట్లాడేదే కాదు. బుజ్జిగాడేమో ఎప్పుడూ ఆఫీసు పనే. కంటినిండా చూసుకున్నదీ లేదు. పలకరించుకున్నదే లేదు. సిన్నప్పటి కబుర్లు, ఊరికబుర్లు చెప్పబోతే విసుక్కునేటోడు. అవన్నీ వినడానికి టైం లేదమ్మా అనేవాడు. మనవడో, మనవరాలో పుడితే నా ఒంటరి తనంపోతుంది. బుజ్జిగాడ్ని ఆ కష్టాల రోజుల్లో ఎంత ప్రాణంగా చూసుకున్నాను. ఇక్కడ ఇప్పుడన్నీ వున్నాయి. వాడ్ని ఇంకెంత బాగాచూసుకుంటానో అని ఎదురు చూసేదాన్ని.

కానీ అది కూడా నాయింకో తీరనికతే ఐపోయింది. కోడలికి నా పద్ధతులు, మాట, భాష నచ్చలేదంట. వాళ్ళ స్నేహితుల ముందు అమర్యాద గుంటదంట. నా పనులు మురికిపన్లట. ఆ సామాన్లు గ్రాయిందర్లు నాకు సరిగ్గా తెలవక కొన్ని వస్తువులు పాడయిపోయాయి నా చేతిలో, సిన్నప్పుడు ఆవురావురు మంటూ తిన్నకొడుకు కూడా! ఆ గొడ్డుకారం ఏంటమ్మా! అంటున్నాడు. రోజురోజుకీ, నేను వాళ్ళకు బరువులా కన్పించాను. నేనెక్కడికిపోవాలి. అని వెనక్కు చూసుకున్నాను. అంతా ఖాళీ. నా కంటూ ఏమీలేదు. భయంకరమైన నిశ్శబ్దం భయపెట్టింది నన్ను. కొడుకూ, కోడలు ఉద్యోగాల కెళ్ళిపోతారు. పట్నాల్లో పక్కింటోళ్ళతో కబుర్లు చెప్పకూడదట. ఒక్కదాన్ని బయటికి పోకూడదు. మొదట్లో నేనేమన్నా ఐపోతానేమో రోడ్లు రద్దీకదా అని భయపడుతున్నారనుకున్నా. కానీ, నేను వాళ్ళ మనిషినని నలుగురికి తెలియడం ఇష్టంలేదని తర్వాత తెల్సింది. దాలిలో వండిన ముద్దపప్పు ఎంత అపురూపంగా తినేవాడు చిన్నప్పుడు, చందమామను సూపిస్తూ, దొడ్లోనులక  మంచం మీద కూర్చుని, ఏడేడి చేపముక్కల్ని కాల్చి ఉప్పుకారం అద్దిపెడ్తే, ఆవురావురుమంటూ తిని, నువ్వు ఏది చేసినా అమృతం అమ్మా అనే టోడు. అది నిజమా! ఇది నిజమా అని అర్థం కావడం లేదు. చాలా ప్రేమగా వుండే కొడుకూ కోడలు నా గురించే ఘర్షణ పడుతున్నార నిపించింది. ఆ రోజెందుకో ప్రాణమస్సలు బాగోలేదు. చాకిరీచేసి చేసీ బొయికలన్నీ అరిగిపోయినయి కదా, ఒకటే తీపుజేస్తున్నాయి. మంచం మీంచి లేవడానికి చాతకావట్లేదు.

గదిలోంచి మాటలినబడుతున్నయి. 'మా అమ్మకు మాత్రం ఎవరున్నారు. నేనేకదా! ఆ గదిలోనే వుంటోంది కదా! నీ స్నేహితులొచ్చినా బయటికి రావట్లేదు. నువ్వు చెప్పినట్లే చేస్తోంది. నన్నెంతో కష్టపడి పెంచింది. ఒక మనిషి ఖర్చు భరించే స్థితిలోనే మనమున్నాంకదా! సర్దుకుపో! మా అమ్మ మాత్రం ఇంకెన్నాళ్ళు బతుకుతుంది. ఎన్నడన్నా ఎవర్తోన్నా గొడవ పెట్టుకుందా? అంటున్నాడు. దేవుడా! నాకు చెవులెందుకిచ్చావు? అని కుళ్ళికుళ్ళి ఏడ్చానప్పుడు. ఎన్నాళ్ళు సర్దుకుపోవాలి? ఆమెని చూస్తే మీ కులం గుర్తొస్తుంది. ఆ కుడివైపు పైట ఏమిటి అసహ్యంగా నోరు కరిచి పెట్టుకుని నీళ్ళు తాగుతుంది. అబ్బో ఒకటిని మించి ఒకటి వెధవలవాట్లు.దేశంలో వోల్డేజ్ హోమ్స్ బోలుడున్నాయి. జేర్చండి, నెలకి ఎంతన్నా పెట్టండి. నేనేమీ అడగను. అలా చూడ్డం కూడా బాధ్యతే కదా! అనేసింది కోడలు.

తులాభారంలో, తల్లా, పెళ్ళామా అని తూసుకున్న కొడుకు ఓ రోజు ఈ హోమ్‌లో జేర్చేశాడు. నెలకి రెండేలు కడుతున్నాము. రెండేలు మాటలా? మా వూళ్ళో ఐతే సంవత్సరాదాయమది, ఓ కుటుంబానికి కొడుకింట్లో జైలు లాంటి గదిలోంచి ఇక్కడి కొచ్చిపడ్డాను. ఇదో లోకం అందరూ నా వయసువాళ్ళు, నాలాంటి వాళ్ళే. అదొకటే మనసుకు ప్రశాంతి. నడివంగిపోయాక, సౌకర్యాలు, డబ్బులూ కాదు, ప్రేమలు కావాలి. తోడు కావాలి. ఎన్నడు లేంది ఎంకటీరడు గుర్తొచ్చాడు, ఉన్నాడో చచ్చిపోయాడో. చచ్చిపోతే అదృష్టమంతుడే పెళ్ళి చేసుకుంటే బాగుండేదేమో. పెళ్ళి కాకపోయిన అదృష్టమే. బాధ పెట్టడానికి పిల్లలుండరు.

> 'మా అమ్మకు మాత్రం ఎవరున్నారు. నేనేకదా! ఆ గదిలోనే వుంటోంది కదా! నీ స్నేహితులొచ్చినా బయటికి రావట్లేదు. నువ్వు చెప్పినట్లే చేస్తోంది. నన్నెంతో కష్టపడి పెంచింది. ఒక మనిషి ఖర్చు భరించే స్థితిలోనే మనమున్నంకదా! సర్దుకుపో! మా అమ్మా మాత్రం ఇంకెన్నాళ్ళు బతుకుతుంది. ఎన్నడన్నా ఎవర్తోన్నా గొడవ పెట్టుకుందా? అంటున్నాడు.

ఈ పేగు బంధమేందో అర్థం కాదు. ఇంత జరిగినా బుజ్జిగాడి మీద కోపం రావట్లేదు. ఆడు చల్లగుంటే చాలు. చెలమలో నీళ్ళల్లా ఆడ్ని తల్చుకున్నప్పుడు కళ్ళు నిండిపోతున్నాయి. కళ్ళు తుడుచుకుంటుంది. పక్కగదిలోంచి దగ్గు వినపడుతూ వుంది. పాపం లక్ష్మమ్మ ఒకటే దగ్గుతోంది. ఈ చలికాలం వరకు ఆమెకి ఉబ్బసమంట. కొంచెం ఏన్నీళ్ళన్నా పెట్టి ఇచ్చొస్తాను. పాపం లక్ష్మమ్మదీ ఓ కథ. కొడుకులు, కూతురు అమెరికాలో వున్నారంట. అక్కడ వైద్యం చాలా ఖరీదంట. పని చెయ్యలేనోళ్ళు అమెరికాలో ఏస్టంట. అందుకని యిక్కడ చేర్చారు. ఇయ్యాలో రేపో అన్నట్లుంది పాపం! ఎన్నుండి ఏం లాభం? మనుషుల్నేకపోయాక, ఆమజ్జన రెండు మూడు మాట్లు వచ్చారంట. సీరియస్సుగా ఉంటే మొన్నొచ్చినప్పుడు చెప్పారంట. ఇలా మాటిమాటికి రావడానికి కుదరదు. లీవు దొరకదు. ఉద్యోగాలు పోతాయి. చనిపోయాక 'కరెంట్ మిషన్'లో పెట్టెయ్యండి కర్మ కాండలన్నీ ఇక్కడున్న వాళ్ళతో జరిపి వీడియో తీయించండి. మా అమ్మగర్తుగా కాపీలు తీయించుకుంటాం. భారతదేశంలో అంత్యక్రియలెలా జరుపుతారో మా స్నేహితులకు చూపించుకుంటాం. అని ఫోన్ చేసారంట అదిన్న కాడ్నుంచి, కాస్త అటూ ఇటూ తిరిగే లక్ష్మమ్మ ఒకటే మనేదాపడి పోయింది. మంచం దిగితే ఒట్టు. చూపులన్నీ యముడివైపే పాపం! ఎవ్వరికీ ఇటువంటి కష్టం రాకూడదు. నా కొడుకు కొంచెం నయమే పాపం! లక్ష్మమ్మ ఎట్లుందో చూసొస్తా. ఇలా తల్చుకునీ తల్చుకునీ ఇయ్యన్నీ తీరేయా ఏమన్నానా? అమ్మల బతుకంతా ఇంతే... ఏంటో... నా పిచ్చిగానీ... నేను కూడా మనిషినని మర్చిపోయి, నాక్కూడా సొంత జీవితం, మనసు వుండాలని అనుకోక పోవడం, నా గురించి ఆలోచన చెయ్యక పోవడం నేను చేసిన తప్పే... ఈ ఒంటరి బతుకు ఇంకెన్నాళ్ళో...?

# రెక్కలు చాచుకొని - రెక్కల కష్టంలోకి

## జీవన సమరంలో వలస మహిళలు

ఐద్వా సర్వే రిపోర్టు

కూటికోసం కూలికోసం పట్టణంలో బతుకుదామని... బయలుదేరిన బాటసారికి ఎంతకష్టం... ఎంతకష్టం... అన్నారు మహాకవి. పని దొరకపుచ్చుకోవడానికి పడేపాట్ల కన్నా, పనికి తగిన వేతనం లేకపోవడం, పురుషులతో సమానంగా కష్టపడుతున్నా వేతనంలో చూపించే వ్యత్యాసాలు ఇవే ఇప్పుడు వలస వచ్చిన సగటు మహిళా శ్రామికుల పాలిట శాపాల్లా మారాయి. సంవత్సరాల తరబడి శ్రమిస్తున్నా ఏ పూటకాపూట ప్రశ్నార్థకమే. అనుకోకుండా పలకరించే అదనపు ఆర్థిక భారాలు అప్పుల ఊబిలోకి నెట్టేస్తే ఇక శ్రమంతా వడ్డీలపాలే. ప్రపంచీకరణ నేపథ్యంలో పెరిగిన జీవన ప్రమాణాలు మహిళల జీవన విధానాలనే మార్చేశాయి. ఒకప్పుడు ఏమీ లేకపోయినా ఉన్న ఊళ్లోనే కలో, గంజో తాగి కాలం వెళ్లదీసే వారు. కానీ నేటి పరిస్థితులలో ఉన్న ఊర్లోనే గింజలు పుట్టక కడుపు చేతపట్టుకుని పట్టణాలకు వలస రావలిసిన పరిస్థితి ఏర్పడింది. పురుషులతో సమానంగా శ్రమిస్తున్నప్పటికీ పట్టణాలలోనూ వేతనాలలోనూ ఎంతోతేడా. వలస వచ్చిన మహిళలు శ్రమ దోపిడీకి గురవుతున్నారనడానికి బాలమ్మ జీవితమే ఉదాహరణ.

మహబూబ్‌నగర్‌కు చెందిన బాలమ్మ ఉన్న ఊర్లో పూటగడవని పరిస్థితిలో నలుగురు పిల్లలతో ఆరేళ్లక్రితం పట్టణం బాటపట్టి భవన నిర్మాణ కాంట్రాక్టర్ వద్ద పనికి కుదిరింది. తన పిల్లలతో పాటూ శ్రమిస్తూనే ఉంది. రోజుకు 10 గంటలు శ్రమిస్తున్నా ఆమెకు లభించేది 50 రూపాయలు మాత్రమే. పిల్లల శ్రమ వృధాగానే పోతోంది. ఆమె భర్తకు రూ. 100 లభిస్తాయి. బాలమ్మ దంపతులిద్దరూ ఒకే సమయంలో పనిలోకి వెళ్లి వస్తున్నప్పటికీ వేతనాల చెల్లింపులో ఎంతో వ్యత్యాసం. ఇది కేవలం ఒక్క బాలమ్మ పరిస్థితే కాదు. రాష్ట్ర వ్యాప్తంగా ఏ జిల్లా నుంచి వలస వచ్చిన మహిళలకైనా ఇదే అనుభవం ఎదురవుతుంది.



మహిళా కార్మికులు ఏ విధంగా శ్రమదోపిడీకి గురవుతున్నారు? అనే అంశాన్ని వెలుగులోకి తీసుకువచ్చేందుకు అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం (ఐద్వా) గత నెలలో వలస మహిళా కార్మికులపై సర్వే నిర్వహించింది. వివిధ జిల్లాల నుంచి వచ్చిన వంద మంది మహిళలపై చేసిన సర్వేలో 99 శాతం మంది కూలికోసం వలస వచ్చినవారే కావడం గమనార్హం. అయితే వీరిలో 2-5 సం॥లలోపు 70 శాతం మంది సొంత వూరికి వెళ్తుండగా, మిగిలినవారు వచ్చిన చోటే స్థిరపడుతున్నారు. 35 నుంచి 45 సంవత్సరాల వయస్సులోనూ కష్టపడి పని చేస్తున్నవారు 55 శాతం మంది ఉన్నారు. ఇందులో బి.సిలు, ఎస్సీ, ఎస్టీలు 97 శాతం వరకు ఉన్నారని సర్వే నిర్ధారించింది. రాష్ట్రంలో హిందువులు పెద్ద సంఖ్యలో వలసవస్తా ఉండగా ముస్లిమ్, క్రిస్టియన్ మహిళలు 1 శాతం మాత్రమే ఉన్నారు. 5 నుంచి 20 సంవత్సరాలపై వయసు కలిగిన వారి సంఖ్య 20 శాతం, 50 సంవత్సరాలపై వయసు కలిగినవారు 8 శాతం మంది ఉన్నారు.

వలస మహిళల మొత్తం జాబితాను పరిశీలిస్తే 94 శాతం మంది నిరక్షరాస్యులే ఉన్నారు. మిగిలిన వారిలో 10వ తరగతిలోపు చదువుకున్నవారే. వీరిలో వివాహమైన స్త్రీలు 90 శాతం ఉండగా, భర్త చనిపోయిన స్త్రీలు 6 శాతం, ఒంటరి స్త్రీలు 4 శాతం ఉన్నారు. పిల్లలను చదివిస్తున్నవారు 55 శాతం ఉండగా, చదివించనివారు 45 శాతం ఉన్నారు. మొత్తం వలస వచ్చిన మహిళల్లో 80 శాతం మంది అద్దె ఇళ్లలోనే నివసిస్తున్నారు. వీరిలో 90 శాతం మంది ఏజెంట్ల ద్వారా ఉపాధి పొందుతున్నట్లు ఈ సర్వేలో వెల్లడైంది. రోజుకూలీల సంఖ్యే ఎక్కువ.

వలస వచ్చే మహిళల్లో ఎక్కువ మంది రోజువారీ కూలీకే వెళ్తున్నారు. రోజు కూలీలు 36శాతం ఉండగా, తరువాతి స్థానంలో భవన నిర్మాణ కూలీలు 32 శాతం ఉన్నారు. క్యాటరింగ్, కాగితాలు ఏరుకునే వారు 5 శాతం, ఇళ్లల్లో పనిచేసేవారు 4 శాతం ఉన్నారు. వీరు పొందే వేతనాల్లో కూడా స్పష్టమైన తేడాలు కనిపిస్తున్నాయి.

ఐద్వా నిర్వహించిన సర్వేలో తేలిన విషయాలు

## జిల్లాల వారీగా వలస వస్తున్న మహిళల వివరాలు:

| జిల్లా పేరు | వలస శాతం | రాష్ట్రం |
|---|---|---|
| మహబూబ్‌నగర్ | 40 | ఆంధ్రప్రదేశ్ |
| వరంగల్ | 8 | ఆంధ్రప్రదేశ్ |
| అనంతపురం | 17 | ఆంధ్రప్రదేశ్ |
| మెదక్ | 4 | ఆంధ్రప్రదేశ్ |
| గుంటూరు | 3 | ఆంధ్రప్రదేశ్ |
| నల్గొండ | 4 | ఆంధ్రప్రదేశ్ |
| కరీంనగర్ | 1 | ఆంధ్రప్రదేశ్ |
| గుల్బర్గ | 4 | కర్ణాటక |
| విజయనగరం | 2 | ఆంధ్రప్రదేశ్ |
| శ్రీకాకుళం | 5 | ఆంధ్రప్రదేశ్ |

## జీవన పరిస్థితి అంతంత మాత్రమే :

వలస వచ్చిన మహిళల్లో 10 శాతం రోడ్డుపైనే నివసిస్తున్నారు. వాంబే పథకం ద్వారా ఇళ్లు పొందినవారు కేవలం 16శాతం మంది మాత్రమే. అలాగే పెంకుటిళ్లలో 20 శాతం మంది ఉండగా, గుడిసెలలో నివాసముంటున్నవారు 9 శాతం, రేకులు / మట్టి ఇళ్లల్లో ఉంటున్నవారి సంఖ్య 34 శాతం కాగా, దాబా ఇళ్లలో కేవలం 1 శాతం మాత్రమే ఉండడం గమనార్హం. వీరిలో 95 శాతం మంది అప్పులు చేస్తూ జీవనం సాగిస్తున్నారు.



- నస్రీన్ ఖాన్

## బాలల హక్కుల కమీషన్ చైర్‌పర్సన్‌గా శాంతాసిన్హా

రామన్ మెగసెసే అవార్డు గ్రహీత, సామాజికవేత్త శాంతాసిన్హా



జాతీయ బాలల హక్కుల పరిరక్షణ కమిషన్ తొలి చైర్‌పర్సన్‌గా నియమితులైన సందర్భంగా మానవి అభినందనలు తెలియచేస్తుంది. ఇప్పటికే ఎం.వి. ఫౌండేషన్ ద్వారా బాల కార్మిక వ్యవస్థ నిర్మూలనకు కార్యక్రమాలు చేపడుతున్నారు. బాలల హక్కుల పరిరక్షణకు సంబంధించిన చట్టాలు, కార్యక్రమాలు మరింత చైతన్యవంతంగా ఈ కమీషన్ అమలు చేస్తుందని కోరుకుందాం.

## అమర్ రహే సద్దాం

- పి. అంజయ్య

(సద్దాం ఉరితీతకు నిరసనగా)

ఇరాక్ వీరుడా, అలుపెరుగని ధీరుడా
నీత్యాగమే గొప్పది, నీ ధైర్యమే మరువలేనిది

ఇరాక్ పౌరులకు వీరత్వం నేర్పావు
సామ్రాజ్యవాదులకు సింహస్వప్నమైనావు

ఎనలేని పోరుచేసి, ప్రతిఎదలో నిలిచావు
అమర్ రహే సద్దాం, అమర్ రహే సద్దాం

అరబ్బులకోసం ఆరాటపడ్డావు,
పాలస్తీనులకోసం పాట్లుఎన్నో పడ్డావు,
శత్రుమూకలు నిన్ను చేరదీయాలని,
వలలెన్నో వడ్డి వేటాడినారు.

ఉరికి తరిమినందుకు ఉగ్రవాదిని చేసె బుష్
తిరస్కరించావని తీవ్రవాదిని చేసె బుష్

అయినగాని నీఅంతు అయినగాని నీతంతు
వెతికి వేసారిన నీఅంతు దొరకలేదు.
శత్రు మూకలు తోకముడిసి వెనుదిరిగి పోయిరి

జల సాగరం లాగ చమురు ఉత్పత్తి చేసె
ప్రపంచానికి అందించిన ఘనత నీకు దక్కింది సద్దాం.

ఆక్రమించుకుందామని అమెరికా ఆశపడె
తెల్లత్రాసులాగ పడగవిప్పి బుసకొట్టె బుష్
సైన్యాన్ని పంపినాడు ఇరాక్‌పైకి
సైనిక కవాతులతో తల్లిడిల్లిపోయిరి ఇరాక్ ప్రజలు

చమురు బావులను పేల్చి ఎన్నో భవంతులను కూల్చి
వేలకొలది ప్రాణాలను హరించిన అమెరికా సామ్రాజ్యవాదాన్ని
ఈ చరిత్ర క్షమించదు ఈ మారణ హోమంచూస్తూ ఉండదు.

ప్రపంచ ప్రజాన్యాయస్థానంలో నీవే అసలు దోషివి బుష్
ప్రజాస్వామ్య వ్యవస్థలో నీవే అసలు ఉగ్రవాదివి బుష్
ఖబడ్దార్ బుష్ ఖబడ్దార్!
కష్టజీవి కన్నీళ్ళు తుడిచేది ఎవరు?





# భరత నాట్యస్రష్ట శ్రీమతి రుక్మిణీ అరుండేల్



రుక్మిణి అరుండేల్ పేరు స్మరించగానే మనకు రెండు విషయాలు గుర్తొస్తాయి. ఒకటి జగద్విఖ్యాతమైన కళాక్షేత్రం, రెండు ఆమె జీవం పోసిన 'సదీర్' నాట్యం. ఉన్నత కుటుంబాలలో పుట్టిన రుక్మిణి అరుండేల్ స్ఫురద్రూపి. ఆమెలో నాజూకుదనం కొట్టవచ్చినట్లు కన్పించేది. సంగీత సాధనలో, నాట్య ప్రతిభలో అవి ప్రతిఫలించేవి.

సంగీత సాధనతోనే ఆమె జీవితం మొదలైంది. తిరుక్కోవిక్కొవల్, కృష్ణ అయ్యర్ వయొలెన్ వాద్యం, పంచపాకీశ భాగవతార, వీణా వైద్య నాధయ్యర్, కోయంబత్తూరు తాయి, షణ్ముగవాదివు, ధనకోటి ఈ సంగీత సామ్రాటుల ప్రభావం రుక్మిణీ దేవిపై ఉంతో ఉంది. వీరందరూ, ఆమెకు మూర్తీభవించిన త్యాగరాజులా కన్పించారు. దానికి తోడు ఆమె పెరిగిన వాతావరణం, కావేరీనది, అక్కడ మంత్రాల పారాయణం, తేవరంపాడడం మొదలైన పల్లె పట్టుల సంస్కృతి కాంశాలు ఆవిడపై గాఢ ముద్రవేశాయి.

మారుమూల గ్రామమైన అఖిలాంగపురం వాతావరణం ఆమె మనస్సుపై గట్టి ప్రభావాన్ని చూపింది. పాపనాశం శివం, టైగర్ వరదాచారి, కరైకుడి సాంబశివయ్యర్, వాసు దేవచారీ, బుదలూరు కృష్ణమూర్తి శాస్త్రి లాంటి విద్వాంసులను కళాక్షేత్రానికి ఆహ్వానించి వారి సాంగత్యంతో ఆ కళకాణాచిని సంపన్నం చేయటంలో వీరి ప్రభావాలే ముఖ్యమని చెప్పవచ్చు.

డాక్టర్ ఆనిబిసెంట్, డాక్టరు అరుండేల్ యిరువురూ భౌద్ధ, క్రైస్తవ, ఇస్లాం మతాల్లోని సూక్ష్మాంశాలను అవగాహన చేసుకోవటంలో ఆమెకు తోడ్పడ్డారు. ఇది యెంతగానో కళాక్షేత్రాన్ని ఏర్పర్చి, తీర్చిదిద్దటంలో దోహదపడింది. సంగీతం, నాట్యాలకు తోడు సాంప్రదాయ కళలైన చిత్ర లేఖనం, శిల్పం, సాహిత్యం ఆమెను ఎంతో ఆకట్టుకున్నాయి.

ఒకసారి అన్నాపెవలో నృత్యం రుక్మిణి దేవి చూడ్డం తటస్థించింది. ప్రపంచంలోనే ఆమెను మించిన నృత్య కారిణి లేదనటంలో అతిశయోక్తి లేదు. అటువంటి నృత్యాన్ని చూసిన రుక్మిణీదేవి తన్మయత్వంతో డోలలూగింది. అట్లే గౌరి అమ్మాళ్ అభినయం, జీవరత్నం సోదరీమణుల నృత్యం రుక్మిణీ దేవికి భారతీయ నృత్యంలో నిబిడీకృతమై వున్న ఆధ్యాత్మిక సౌందర్యం కన్పించింది. ఆ ఆధ్యాత్మికతే కళాక్షేత్రంలో పెంపొందిన నృత్య రీతులకు ఉపకరించింది. ఆమె నృత్య కళను సజీవకళగా తీర్చి దిద్దకల్గింది.

**1936** జనవరిలో కళాక్షేత్రాన్ని ఏర్పర్చి, ఎన్నో కార్యక్రమాలను రూపొందించటం విశేషం. ఈనాడు కళాక్షేత్రం ఒక ఉన్నత సంస్థగా భారత దేశంలోనే కాదు, ప్రపంచం అంతటా రూపుదిద్దుకొంది. **1948**లో అరుండేల్ కన్నుమూసినా, పట్టు వీడక కళాక్షేత్రాన్ని రుక్మిణి అభివృద్ధిలోకి తెచ్చింది. కళాక్షేత్రంలో ఆమె స్వయంగా ఎన్నో నృత్యనాటకాలకు ప్రాణంపోసింది. అందులో పాల్గొన్న వారంతా ఆమె విద్యార్థులే. గౌతమ బుద్ధుని జీవితాన్ని, భీష్ముని జీవితంలో జరిగిన సంఘటనలనూ, కుమార సంభవాన్నీ, కుద్రాలకు రవంజీనీ, గీతా గోవిందాన్ని, రుక్మిణీ కళ్యాణాన్ని, కళిదాసు శృంగార శాకుంతలాన్నీ, కుచేరిలో పాఖ్యా నాన్ని, మీనాక్షీ విజయాన్నీ, రామాయణాన్ని ప్రదర్శించటంలో ఎన్నో మెళకువలను చూపిన కళాకారిణి ఆమె. అంతేగాక సీతా స్వయంవరం, ఉషా వరిణయం, రుక్మాంగద చరిత్ర, శ్రీరామవనవాసం, పాదుకా పట్టాభిషేకం, అండాళ్ చరితం, శబరి మోక్షం, దమయంతీ స్వయంవరం మొదలైనవన్నీ విశ్వ విఖ్యాతిగాంచిన ప్రదర్శనలే !

కళాక్షేత్ర ఉద్దేశం ప్రాచీన భారతీయ సంస్కృతిని పునరుద్ధరించటమే. కళాక్షేత్రాన్ని ఒక గ్రామంగా నిర్మించాలనీ, అందులో విభిన్న కళలకు అవకాశం కల్పించాలనీ ఆమె పడ్డ తపనే ఈనాటి విశ్వ విఖ్యాతిగాంచిన కళాక్షేత్ర ప్రతిభకు తార్కాణం. కళాక్షేత్ర వైభవాన్ని చూడ్డానికి రెండు కళ్లూ చాలవు. కళాక్షేత్రంలో సాధించిన అభివృద్ధికి, సృజనాత్మక నిదర్శనాలు అక్కడ జరుగుతున్న నృత్య ప్రక్రియలే, సంగీతకచ్చేరీలే. లయబద్ధంగా గాత్రం, ఆహార్యం, అభినయం, పదవిన్యాసం, ఒక క్రమపద్ధతిలో అంకితభావంతో చేసినప్పుడే పరిపూర్ణత సిద్ధిస్తుందని ఆమె భావించారు. తాను ఎంతటి భారతీయ కళాకారిణి అయినా, పాశ్చాత్య కళల ప్రభావాలను ఆమె ఏనాడూ విస్మరించలేదు.

కళాక్షేత్ర అభివృద్ధి ఒక అంశమైతే 'సదీర్', అనే పేరుతో క్షీణ దశకు చేరుకొని, సామాజిక స్థాయికి, గౌరవ ప్రపత్తులకు దూరమైన దేవదాసీ నృత్యాన్ని అభివృద్ధి పర్చాల్సిన అవసరం ఏర్పడింది. పాశ్చాత్య దేశాల సంపర్కం వల్లనూ, ఆర్థిక యిబ్బందుల వల్లా దేవదాసీలు బాధపడాల్సిన పరిస్థితి ఏర్పడింది. దేవాలయ ప్రాంగణంలో నృత్యం చేసిన కళామతల్లుల ప్రతిభకు గుర్తింపు పోయింది. వారికి జీవితం మీద విరక్తి ఏర్పడి, నాట్యాన్నే త్యజించే స్థితికి చేరుకున్నారు. దేవాదాసీలు నృత్యం అంటే వేశ్యల నృత్యంగా భావిస్తున్న తరుణంలో 'సదీర్' అనే పేరుతో ఆ నాట్యాన్ని ఆమె పునరుద్ధరించి, 'భరతనాట్యం' అనే పేరుతో సార్థకత చేకూర్చారు. కొంత మంది దేవదాసీలను కళాక్షేత్రానికి రావించి, వారిచేత నృత్యం విద్యార్థులకు నేర్పించింది. ఈ నాట్యాన్ని తెరమరుగు కాకుండా కంకణం కట్టుకున్న దృఢ సంకల్ప సిద్ధిగా ఉన్నారు రుక్మిణీ అరుండేల్. దేవదాసీ నృత్యం పట్ల చూపిన శ్రద్ధ అనన్య సామాన్యం. "ప్రపంచంలో ప్రతి వ్యక్తి స్వల్పంగానైనా సమున్నత లక్ష్యాన్ని సాధించడానికి పాటుపడాలి". అని చెప్పి, దాన్ని ఆచరణలో సాధ్యం చేసిన కార్యదీక్షాపరురాలు రుక్మిణి. కథాకళి నృత్యాన్ని కూడా పునరుద్ధరించి, దానికొక స్థాయిని చేకూర్చిన ఘనత ఆమెకే దక్కుతుంది.

రుక్మిణీ అరుండేల్‌కు వచ్చినన్ని అవార్డులు ముఖ్యంగా భారత రాష్ట్రపతి 'పద్మభూషణ్' అవార్డు, సంగీత నాటక అకాడమి అత్యున్నత నృత్యకారిణీ అవార్డు, **1980**లో ఇంద్రకళా సంగీత విశ్వవిద్యాలయం యిచ్చిన పట్టా, ఆమె నిరంతర కృషికి, ఆమె తీసుకున్న శ్రద్ధాశక్తులకు మణిపూసలు. ఎంతో నిరాడంబరంగా ఉండి, యింతటి ఖ్యాతిని ఆర్జించిన కళాకారులరుదు. కళాక్షేత్రం ఉన్నంత వరకూ ఆమె కీర్తి ప్రతిష్టలు సజీవంగా నిలుస్తాయి.

# నిజాం పాలనలో మహిళా ఉద్యోగినులు

వేములపల్లి సత్యవతి

హైదరాబాద్ సంస్థానంలో ఉర్దూ రాజభాషగా వుండేది. ఉర్దూ భాష ఉచ్ఛరణ వినటానికి చెవులకింపుగా వుంటుంది. తెలుగుతోపాటు మిగతా భారతీయ భాషలన్నీ ఎడమచేతి వైపు నుంచి మొదలు పెట్టి కుడి చేతి వైపు రాస్తారు. ఉర్దూను లష్కర్ భాష అని కూడ అంటారు. లష్కర్ అంటే మిలటరీ. లష్కర్ భాష అంటే మిలటరీ భాష అని అర్థం. ఉర్దూ భాష పుట్టింది పెరిగింది లక్నోలో. కాని దానికి రాజభాషగా గద్దె నెక్కిన ఘనత దక్కింది. హైదరాబాద్ సంస్థానంలో సంస్థానాన్ని పరిపాలించిన నవాబులు రాజభాషకు కావలసిన అన్ని హంగులు సమకూర్చి ఉర్దూభాష సర్వతోముఖాభివృద్ధికి కృషి చేశారు. అంటే అంతకు పూర్వం ఉర్దూ భాషా సాహిత్యం లేదనికాని, పండితులు, కవులులేరని కాదు. గోలకొండ రాజ్యాన్ని పాలించిన కులీకుతుబ్‌షా దక్కన్ ఉర్దూలోను, తెలుగులోను గొప్పకవి. తర్వాత కాలంలో మత దురహంకారులు అతను రాసిన తెలుగు కవిత్వాన్ని ధ్వంసం చేశారని అంటారు, లక్నో నుండి పారసీక దేశం నుండి ఉద్దండ పండితులు, కవులు నవాబుల దర్బారులో చేరి రాజాదరణతో ఉర్దూభాషను సుసంపన్నం గాను, పటిష్టంగాను చేశారు. విఖ్యాతి చెందిన గాలిబ్ గజల్స్ ఉర్దూలోనే రాశారు. బరోడా, మైసూరు, తిరువాన్కూరు మొదలైన సంస్థానాలు చిన్నవైనప్పటికి, వాటితోపోలిస్తే పెద్దదైన హైదరాబాద్ సంస్థానం విద్యారంగంలో వెనుకబడిన దనే చెప్పవచ్చు. సంస్థానంలో ఒకే ఒక విశ్వవిద్యాలయం (ఉస్మానియా) 1915లో హైదరాబాద్‌లో స్థాపింప బడినది. నిజాంకాలేజీ వున్నప్పటికి బాలురకు మాత్రమే ప్రవేశం వుండేది. బాలికలకు మాత్రం ఒకే ఒక మహబూబియా హైస్కూల్ (ఆబిడ్స్) వుండేది. దానిలో దేశముఖ్‌ల, జాగీర్‌దారుల, పెద్దపెద్ద ఉద్యోగస్తుల పిల్లలు మాత్రమే చదువుకోగలిగేవారు. పాఠశాలకు కారుల్లో వచ్చినా, గుర్రపు బగ్గీలలో వచ్చినా రెండు వైపులా పరదాలు వుండేవి. ఆ స్కూలు చదువుతో బాలికల చదువు ఆఖరయ్యేది. ఉస్మానియా యూనివర్సిటీలో అడుగుపెట్టి చదివిన యువతుల సంఖ్య వ్రేళ్లమీద లెక్కింపటానికి కూడ సరిపడ వుండేది కాదు. విద్యావంతులై, సంపన్నులై అభ్యుదయ భావాలు కలవారెవరైనా ఒకరిద్దరు తమ కూతుళ్ళను యూనివర్సిటిలో చదివించి వుంటారు. అలా యూనివర్సిటీలో అడుగు పెట్టి చదివిన ముస్లిం యువతి 'అమీనానక్వీ' మహిళా విద్యార్థినులకు ప్రత్యేకించి ఒకగది ఏర్పాటు చేసేవారు. గది దరవాజాకు వెదురు పుల్లలతో తయారు చేసిన తెర తగిలించి వుండేది. పుల్లకు పుల్లకు మధ్య కొంచెం ఎడం వుండేది. పొడవు, వెడల్పు కొలతలతో వాటిని తయారు చేసేవారు. ఆ తెరను పైకి లేపటానికి, క్రిందకు దింపటానికి వీలుగా తయారు చేసేవారు. పుల్లల మధ్యవున్న దూరం నుంచి వెలుతురు, గాలి వచ్చేది. గదికి ప్రక్కనే లెక్చరర్ల, ప్రొఫెసర్ల టేబుల్, కుర్చీలు వేసి వుండేవి. గదిలో వున్న విద్యార్థిని వారు బోధించే విషయాలను వినటానికి వీలుగా వుండేది. వెదురు పుల్లలతో తయారు చేసిన తెరలను సినిమా హాల్స్‌లో కూడ ఉపయోగించేవారు. మహిళలకు క్రింద కూర్చునుట నిషేధం. పైన బాల్కనీలోనే మహిళలు కూర్చొని సినిమా చూడాలి. సినిమా మొదలవగానే వెదురు పుల్లల తెరపైకి లాగబడేది. విశ్రాంతి సమయంలో క్రిందకుదించేవారు. ఈ పని చేయటానికి ఒక మహిళను నియమించేవారు. అలాంటి ఆచారాలు, సాంప్రదాయాలు వున్న రోజుల్లో అమీనానక్వీ బురఖా ధరించి యూనివర్సిటీలో అడుగు పెట్టి హైదరాబాద్ స్టేట్ తొలి న్యాయవాది అయింది. ముంబయి తొలి మహిళా పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా, తర్వాత చీఫ్ పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా పని చేసి రిటైర్ ఆయి హైదరాబాద్ వచ్చి వుంటున్నారు. 1954-56లో ఉస్మానియా యూనివర్సిటీ సెనేట్ సభ్యురాలుగా నామినేట్ చేయబడింది. ప్రస్తుతం ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీ, గిల్డ్ ఆఫ్ సొసైటీ వంటి సంస్థలతో కలసి పని చేస్తున్నారు. ఆనాటి మతాచారాలను ధిక్కరించిన యువతి ఆ తర్వాత కాలంలో వున్నత పదవులనధిరోహించి రాణించింది.



ఇక గ్రామాలలో ఎక్కడా బడులుండేవి కావు. తాలూకా కేంద్రంలో బాలురకు ఏడవ తరగతి వరకు, బాలికలకు మూడు లేక నాలుగవ తరగతి వరకు ఒక్కొక్క బడి మాత్రమే వుండేది. జిల్లా కేంద్రాల్లో బాలురకు ఒక హైస్కూల్, బాలికలకు ఒక మాధ్యమిక స్కూలు వుండేది. సర్కారు వారి వుద్యోగానికి చివరి విద్యార్హత ఉర్దూమీడియంలో చదివిన నాల్గవ తరగతి సర్టిఫికేట్. ఉర్దూ మాతృభాష అయినందున ముస్లిం పురుషులకు, స్త్రీలకు ఉద్యోగాలు ఎక్కువగా లభించేవి. మహిళలు ముస్లింలైనా, హిందువులైన, క్రిస్టియన్స్ అయినా నాల్గవ తరగతి ఉర్దూ సర్టిఫికెట్ జతచేస్తూ తాలిమాత్ ఆఫీసుకు (విద్యాశాఖ ఆఫీసుకు) తాను పంతులమ్మ పని చేయదలచుకున్నానని, ఇంటి అడ్రసు తెలియపరుస్తూ ఒక వుత్తరం యింటికే వచ్చేవి. ఇది నేడు నమ్మశక్యంగాని మాటగా తోస్తుంది. కాని నూటికి నూరుపాళ్లు వాస్తవమైన విషయం. ఈ సౌకర్యం కేవలం మహిళలకు మాత్రమే వుండేది. ఆ రోజుల్లో పంతులమ్మ పనిగాక వేరే శాఖలలో పనిచేసే అవకాశాలు మహిళలకు వుండేవి కావు. పంతులమ్మలుగా వుద్యోగంలో

చేరిన మహిళలు ఆఫీసుముఖం చూడకుండానే పదవీ విరమణ చేసేవారు. టీచర్ ట్రైనింగ్ పొందకుండానే స్త్రీ-పురుషులు వుద్యోగాలలో నియమింపబడేవారు. సర్వీస్‌లో వుండగా ఎప్పుడో ఒకప్పుడు సర్కారు వారే ట్రైనింగ్‌కు పంపేవారు. మహిళా వుద్యోగినులకు హైదరాబాద్‌లో ఒకటి, మహబూబ్‌నగర్‌లో ఒకటి టీచర్స్ ట్రైనింగ్ స్కూలు వుండేది. ఆ రోజుల్లో గెజిటెడ్ హెడ్‌మాస్టర్లకు (మహిళలకు కూడ) ట్రైనింగ్‌కు వెళ్లిన వారి స్థానంలో తగిన యోగ్యత గలవారిని నియమించుకునే అధికారాలు వుండేవి. హైదరాబాద్ ట్రైనింగ్‌కు వెళ్లినవారి స్థానంలో నియమింపబడిన వారికి రూ.30/-, మహబూబ్‌నగర్ ట్రైనింగ్‌కు వెళ్లిన వారి స్థానంలో నియమింపబడినవారికి రూ. 20/- యిచ్చేవారు. పాఠశాలల్లోను, గవర్నమెంట్ ఆఫీసుల్లోను పనిచేసే బంట్రోతులు (అటెండర్) మెడలో జానెడంత వెడల్పున మందమైన ఎర్రనిగుడ్డ అరచేయంత వెడల్పున్న యిత్తడి బిళ్లకు రెండు వైపులా కుట్టబడివున్న దానిని జందెం వేసుకున్న విధంగా మెడలో వేసుకోవాలి. ఆ ఎర్రని గుడ్డ, ఇత్తడి బిళ్ల కనపడగానే ప్యూన్ అని తెలిసిపోయేది. అది తప్పని సరిగా ధరించాలి. పాఠశాలకు విద్యాశాఖాధికారులు తనిఖీకి (ఇన్ స్పెక్షన్) వచ్చినపుడు పిల్లలకు పిప్పరమెంట్లు, బిస్కట్లు పంచిపెట్టేవారు. మర్నాడు బడికి తాతిలు (సెలవు) యిచ్చేవారు. బాలికల పాఠశాలలకు తనిఖీకి వచ్చినపుడు ముస్లిం టీచర్స్ తరగతులు వదలి టీచర్స్ స్టాఫ్‌రూమ్‌లోనికి వెళ్లిపోయేవారు. ఘోషా వలన వారికా వెసులుబాటు వుండేది. హిందూ, క్రిస్టియన్ టీచర్స్ మాత్రం తరగతుల్లోనే వుండేవారు. సంస్థానం యూనియన్‌లో విలీనమైన తర్వాత కూడ చాలా కాలం వరకు ఈ పద్ధతి కొనసాగింది.

వేసవి సెలవులు మే ఒకటవ తేది నుంచి జూన్ 15వ తేదీ వరకు వుండేది. వేసవి సెలవుల రెండు నెలల జీతం కూడ ఏప్రియల్ నెల జీతంతోపాటు మే ఒకటి, రెండు తారీఖులలో యిచ్చేవారు. ప్రసూతి సెలవు రెండు సంవత్సరాలకొకసారి రెండుమాసాలు పూర్తి జీతంతో యిచ్చేవారు. ఆ రోజుల్లో పదకొండవ తరగతి పబ్లిక్ పరీక్షగా వుండేది. బాలికలు పబ్లిక్ పరీక్షలు రాయటానికి ప్రత్యేకించి పరీక్షా కేంద్రాలు ఏర్పాటు చేసేవారు. పర్యవేక్షకులుగా మహిళా ఉపాధ్యాయినిలనే నియమించేవారు. జిల్లాలలోని వారు సప్లిమెంటరీ పరీక్ష రాయాలంటే హైదరాబాద్ వచ్చి రాయవలసి వుండేది. పాఠశాల వార్షికోత్సవానికి పిల్లల తల్లితండ్రులు, విద్యాశాఖాధికారి తప్ప పర పురుషులెవరికి ప్రవేశముండేది కాదు. పాఠశాల చుట్టూ ప్రహరీ గోడ వుండేది. సర్కారువారివిగాని, ప్రయివేట్‌విగాని (అద్దెకు తీసుకున్నవి) విశాలమైన భవంతులలో పాఠశాలలు వుండేవి. ఆటస్థలాలు కూడ విశాలంగానే వుండేవి. నీటి వసతి, మూత్రశాలల వసతులకు ఏమాత్రము లోటు వుండేది కాదు. సంస్థానం యూనియన్‌లో విలీనం కాకముందు పిల్లలైనా సరే వీధులలోగాని, బజారుల్లోగాని మలమూత్రాలు చేయటం నిషిద్ధం. ఎవరైనా అతిక్రమిస్తే వెంటనే పోలీసులు పట్టుకుపోయేవారు. పారిశుధ్యంలో ప్రపంచ దేశాలలో హైదరాబాద్ సంస్థానం ఒకటిగా గుర్తింపు పొందింది. పాఠశాలలో చౌకీదారు కుటుంబంతోపాటు వుండటానికి వసతి వుండేది. బడి వదలిన తర్వాత తెల్లవారి బడి తెరిచే వరకు చౌకీదారు బడికి రక్షకునిగా వుండేవాడు. చదువుకొనేవారి సంఖ్య తక్కువగా వుండటం వలన, పాఠశాలల సంఖ్య కూడ తక్కువగా వుండేది.

బాలికల పాఠశాలల్లో పనిచేసే ఉపాధ్యాయినిలకి గేట్‌డ్యూటి వుండేది. రోజుకు ఒకరి చొప్పున ఆ డ్యూటీ చేసేవారు. ముస్లిం బాలికలు ఘోషా వున్నందువలన ఒంటెద్దు బండ్లలో బడికి వచ్చేవారు. ముస్లిం టీచర్స్ కూడ బండ్లలోనే వచ్చేవారు. జిల్లాలలో రిక్షాలు లేవు. ఆ రోజుల్లో దూరం నుంచి వచ్చే హిందు బాలికలు టీచర్స్ కూడ ఒంటెద్దు బండ్లలో వచ్చేవారు. జంటనగరాలలో కూడ ఆ పద్ధతి వుండేది. బడి వదలిన తర్వాత మరల అవే బండ్లలో పిల్లలు యిండ్లకు వెళ్లాలి. ఒక్కొక్క బండిలో ఎనిమిది, పదిమంది పిల్లలు వుండేవారు. ఆఖరిపిల్ల బడిలో లేకుండ వెళ్లేవరకు గేట్‌డ్యూటీ చేసే టీచరు బడిలోనే వుండాలి. సాయం కాలం నాల్గు గంటలకు బడివదిలితే ఆరుగంటల వరకు వుండవలసి వచ్చేది. సంస్థానం యూనియన్‌లో విలీనమయిన తర్వాత కూడ ఈ పద్ధతి చాలా కాలంవరకు (1970) కొనసాగింది. యూనియన్‌లో విలీనమయిన తర్వాత జంట నగరాలలోను జిల్లా, తాలూకా కేంద్రాల్లోనూ కొన్ని కొన్ని గ్రామాల్లోను తెలుగు మాధ్యమములో పాఠశాలలు స్థాపింపబడినవి. పదవ తరగతి పబ్లిక్ పరీక్షగా మార్పు చేయబడింది. ఉన్నత పాఠశాలల వరకు తెలుగు మాధ్యమములోనే విద్యా బోధన జరిగింది. 1990 వరకు తెలుగు బోధనకు ముప్పురాలేదు. అంతకు ముందు వున్న ఉర్దూ మీడియం స్కూల్స్ యథాతథంగానే నడుస్తుండేవి. ప్రతి ఉన్నత పాఠశాలలోను ల్యాబ్ తప్పకుండ వుండేది. సైన్స్ టీచరు ఎనిమిదవ తరగతి నుండి పదకొండవ తరగతి వరకు పిల్లల చేత ల్యాబ్‌లో ప్రాక్టికల్స్ చేయించేవారు. ప్రథమ, ద్వితీయ భాష గ్రంథాలయాలు వుండేవి. ఆయా మాధ్యమముల వార్తా పత్రికలు పాఠశాలలకు తెప్పించేవారు. ప్రతి సంవత్సరం బడ్జెట్ నెల మార్చికి ముందే గ్రంథాలయాలకు పుస్తకాలు కొనటానికి డబ్బు మంజూరు చేసేవారు. పాలకులు మారారు. పద్ధతులు మారినవి. ఇంగ్లీషు మీడియం స్కూళ్ల జోరు అందుకుంది. దానిని అడ్డుకునే ప్రయత్నం చేయకుండ యిష్టమొచ్చినట్లుగా అనుమతులొసంగారు. ప్రభుత్వ పాఠశాలలు వున్న బజారులోనే ప్రయివేట్ ఇంగ్లీషు పాఠశాలలకు అనుమతి మంజూరయ్యేది. అప్పటికే జంటనగరాలలో మిషనరీ స్కూళ్ల సంఖ్యతక్కువేమీ కాదు. విద్యాశాఖాధికారులు తనిఖీలకి వెళితే మిషనరీ పాఠశాలల యాజమాన్యం వారు అధికారులను గేటు బయటనుంచే తిరిగి పంపేవారు. అనుమతి లేని పాఠశాలలు వందలలో నడుస్తున్నవి. మన పాలకులు వీటిని నియంత్రించలేకుండ వున్నారు. మాతృభాష మీద మన పాలకులు సవతితల్లి ప్రేమ ఒలకపోస్తున్నారు. పొరుగు రాష్ట్రాలైన తమిళనాడు, కర్ణాటక రాష్ట్రాలు తమ మాతృ భాషాభివృద్ధికి చేస్తున్న కృషిని చూసైనా మన పాలకులు స్పందించరేమి? కర్ణాటక ప్రభుత్వం కన్నడ భాషను బోధించని 1500 వందల పాఠశాలల గుర్తింపును రద్దు చేస్తూ ఉత్తర్వులు జారీ చేసిందని పత్రికలలో వచ్చినవార్త. వీటన్నిటిని చూచి కనువిప్పు కలుగకపోగా కాన్సెప్ట్ స్కూల్సు ప్రారంభిస్తారట. ఇప్పటికే విద్య వ్యాపారమైంది. మన విద్యా విధానం కలవారి పిల్లలకు, లేనివారి పిల్లలకు మధ్య పెద్ద అగాధాన్ని సృష్టించింది. దానికి తోడు కాన్సెప్ట్ స్కూల్స్ ప్రారంభిస్తే పేదవారికి చదువు చుక్కల్లోకెళుతుంది. కావున తల్లిదండ్రులు, విద్యార్థులు, ఉపాధ్యాయులు, విద్యావంతులు, భాషాభిమానులు, వారు-వీరూ అనే తేడా లేకుండ, ప్రాంతీయ వాదాలకతీతంగా ముక్తకంఠంతో ఈ విధానాన్ని నిరసించాలి. నిలుపుదలచేయాలి. ఈ ఉపద్రవాన్ని ఎదుర్కొనకపోతే భవిష్యత్తులో విద్యారంగం భ్రష్టుపట్టి పాడైపోతుంది. కావున విజ్ఞులంతా ఏకమై కాన్సెప్ట్ స్కూళ్ల విధానాన్ని నివారించాలి.

*

# వారసుడే కావాలా...?

ఎన్.ఎస్. లక్ష్మీదేవమ్మ

**నా** పేరు లక్ష్మి. ఎన్నో పూజలు, నోములు, వ్రతాలు చేస్తే పుట్టానట. అల్లారు ముద్దుగా పెంచారు.

మా నాన్న మంచి సంపాదనపరుడు. ఆయన మనసులో ఏదో వెలితి.

అమ్మకు మాత్రం నాన్నా-నేనే ప్రపంచం. నాన్న మనసులో ఏముందో అమ్మ పసిగట్టలేక పోయింది.

ఒకనాటి రాత్రి నాన్న తన మనసులోని మాట బయట పెట్టారు. మళ్ళీ పెళ్ళి చేసుకుంటానని... వారసుడు కావాలని!

అమ్మ ఏడుపుతో నాకు మెలకువ వచ్చింది. అమ్మ ఏడుస్తూ వుంది... నాన్న బ్రతిమాలుతున్నాడు. నాకేం అర్థం కాలేదు. ఈ సంఘటన జరిగినప్పుడు నా వయసు పదేళ్లు.

నాన్న మంచివాడే! మరి అమ్మ ఎందుకేడుస్తుంది?

అర్థం కాని వయస్సు నాది. మళ్ళీ నిద్రలోకి జారుకున్నాను.

అమ్మ ఎన్నో రాత్రుళ్ళు నిశ్శబ్దంగా రోదిస్తూ వుండేది.

అఖరికి ఒక రోజు నాన్న రెండో పెళ్ళి చేసుకున్నాడు కొడుకు కావాలని.

ఒక స్త్రీ ఏదైనా ఇతరులతో పంచుకుంటుందేమో గానీ భర్తను మాత్రం ఎవరితోనూ పంచుకోలేదు. ఆ ఊహను కూడా భరించలేదు. ఇది పచ్చి నిజం.

కానీ నాన్న రెండో పెళ్ళి చేసుకోవడాన్ని అన్యాయంగా భావించే సమాజం కాదు మనది. కొరివి పెట్టడానికి కొడుకు కావాలి... అంతే!

– అమ్మ భరించలేక ఓ సారి ఆత్మహత్యకు ప్రయత్నించింది. ఆ తరువాత నన్ను అనాథను చెయ్యకూడదనుకుంది. కేవలం నా కోసం నా తల్లి బతకాలని నిర్ణయించుకుంది. బతికింది. జీవితాంతం నాతోనే వుంది. నాకు వెన్నుదన్నుగా నిలబడింది. వామపక్ష భావాలు గల అల్లుడింట్లో ఏ సమస్యా లేకుండా ఆమె జీవితం గడిచిపోయింది.

ప్రజల కోసం పనిచేస్తున్న మమ్మల్ని అమ్మ ప్రోత్సహించేది. "మానవ సేవే మాధవ సేవ" అనేది.

మూఢాచారాలు అవివేకుల పాలిటి శాసనాలని చెప్పేది. అమ్మ చైతన్యం గలది. శాంతమూర్తి. మంచికి మారు పేరు మా అమ్మ!

ఏ దుష్ట సంప్రదాయమైతే కొరివి పెట్టడానికి కొడుకే కావాలని చెప్పిందో, ఆ సంప్రదాయానికి మా అమ్మలాంటి వాళ్ళెందరో బలి అయ్యారు. అది బిగించిన కట్టుబాట్ల సంకెళ్ళ మధ్య నలిగిపోయారు.

అలాంటి అమ్మకు తుది వీడ్కోలు చెబుతూ... ఏ సంప్రదాయమైతే కొరివి పెట్టడానికి కొడుకు కావాలని చెప్పిందో ఆ బూజు పట్టిన సంప్రదాయ సంకెళ్ళను బద్దలు కొట్టాలని నిర్ణయించుకున్నాను. అమ్మకు నేనే కొరివి పెట్టాలనుకున్నాను.

నాన్న రెండో భార్యకు కొడుకు వున్నా వాడితో నేను కొరివి పెట్టనివ్వలేదు. 'ఆడపిల్ల కూడా కొరివి పెట్టొచ్చు' అనే కొత్త సంప్రదాయానికి తెరదీశాను. ఈ విధంగా నా తల్లికి నివాళుల ర్పించాను.

దీనివల్ల నాకు కలిగిన కష్టనష్టాలు ఎన్నో వున్నాయి. నాకు తెలుసు. ఈ వ్యవస్థ అంత త్వరగా విప్లవాత్మకమైన మార్పులను - చైతన్యవంతమైన చర్యలను జీర్ణించుకోదని. అయినా మనకు అవకాశం దొరికిన చోటల్లా ఈ వ్యవస్థలోని కుళ్లును కడిగిపారేయాల్సిందే కదా...

## ఆడపిల్ల

డి. విజయలక్ష్మి

అప్పుడే పుట్టాను అమ్మ కడుపున నేను
నను చూడవచ్చి నలుగురూ నవ్వుకున్నారు
ఆడపిల్లని నన్ను అలుసు చేసారు.

ఆడుకుందుకు నేను ఆ ఇంటికెళితేను
ఇరుగొద్దు పొరుగొద్దు ఇంట్లోనే ఉండమన్నారు
చదువుకొందుకు నేను బడికి పోతానంటే
చదువెందుకే నీకు చట్టమ్మన్నారు.

అంతలోనే నేను ఎంతయితినంటూ
పేరంటమే పెట్టి పెండ్లినే చేసారు
అంపకాలయ్యి నన్ను ఆ ఇంటికంపాక
తాళి కట్టినవాణ్ణి తలెత్తి చూడగా
నా తలపులో అతను తాతలా తోచాడు

కన్నీటి నా బ్రతుకు కడగండ్లపాలైన కారణం ఎవరు?
ఆడదై పుట్టినా ఆ శాపమా!
అక్షరాలే రాని అమ్మ నాన్నల లోపమా!

# మార్చి 8 నేపధ్యం



మొదటి అంతర్జాతీయ సోషలిస్టు మహిళా సదస్సు 1907లో జర్మనీలోని స్టట్‌గార్ట్‌లో జరిగింది. వివిధ దేశాలలోని శ్రామిక మహిళా సంఘాలను సమన్వయ పరచేందుకు 15 దేశాలకు చెందిన 59 మంది మహిళలతో ఒక సమన్వయ సంఘం ఏర్పడింది. కొత్తగా ఏర్పడిన శ్రామిక మహిళా సంఘానికి క్లారా జట్కిన్ సెక్రటరీగా ఎన్నికయింది. రెండవ ఇంటర్నేషనల్‌కు అనుబంధంగా వున్న 'సోషలిస్టు మహిళ'కు 'సమానత్వం' అనే పత్రిక అధికారవాణిగా ప్రకటించబడింది.

రెండవ అంతర్జాతీయ మహిళా సదస్సు 1910లో డెన్మార్క్‌లోని కోపెన్ హేగన్‌లో నిర్వహించారు. అంతర్జాతీయ సోషలిస్టు మహిళా సంస్థకి క్లారాజట్కిన్ సెక్రటరీగా తిరిగి ఎన్నికయ్యారు. ఈ సదస్సులో మహిళల ఓటు హక్కు పునరుద్ఘాటించబడింది. అన్ని దేశాల సోషలిస్టు మహిళలు సంవత్సరంలో ఒక రోజును మహిళా దినంగా పాటించాలని, అలా పాటించడం మహిళలు ఓటు హక్కు సాధించేందుకు దోహదపడాలని సదస్సు ప్రతిపాదించింది.

అంతర్జాతీయ శ్రామిక మహిళా దినంగా మార్చి 8 ఎంపిక చేయబడింది. మార్చి 8కి చారిత్రక ప్రాధాన్యత వున్నది. అమెరికాలోని న్యూయార్క్ నగరానికి చెందిన నీడిల్ ట్రేడ్‌కి చెందిన మహిళా కార్మికులు 1908 మార్చి 8న వారి యితర డిమాండ్లతో పాటు మహిళలకు ఓటు హక్కును డిమాండ్ చేశారు. న్యూయార్క్ నగర మహిళా కార్మికుల వీరోచిత ఉద్యమ సాంప్రదాయాన్ని నిలబెట్టేందుకు అంతర్జాతీయ సోషలిస్టు మహిళా సదస్సు మార్చి 8న అంతర్జాతీయ మహిళా దినంగా ప్రకటించింది. ఆ తరువాత 1911 సంవత్సరంలో మొదటి అంతర్జాతీయ మహిళా దినం చాలా చోట్ల పాటించబడింది.

అప్పటి నుండి అంతర్జాతీయ మహిళా దినమైన మార్చి 8 యొక్క వీరోచిత సాంప్రదాయాన్ని ప్రపంచవ్యాప్తంగా గల లక్షలాది మహిళా కార్మికులు ముందుకు తీసుకొని పోయారు. మహిళల సమాన హక్కులకి, మహిళా విముక్తికి మార్చి 8 సంకేతంగా నిలిచింది. ప్రపంచ వ్యాప్తంగా అన్ని తరగతుల మహిళలు మార్చి 8న మహిళా దినంగా పాటిస్తున్నారు.

మహిళలు చేపట్టిన చాలా ఉద్యమాలు మార్చి 8న జరిగాయి. ఉదాహరణకు 1917 మార్చి 8న రష్యాలోని పెట్రోగ్రాడ్ (లెనిన్ గ్రాడ్)లో జార్ నిరంకుశత్వానికి వ్యతిరేకంగా శ్రామిక మహిళలు సమావేశాలు, ప్రదర్శనలు నిర్వహించారు. 1936 మార్చి 8న ఫాసిస్టు ఫ్రాంకోకి వ్యతిరేకంగా మాడ్రిడ్ నగరాన్ని ఊపివేసే విధంగా 80 వేల మందితో లాపాషనారియా (డొలోరెస్ ఇబారురి) ప్రదర్శన నిర్వహించింది. 1950 మార్చి 8న 3 లక్షల మంది మహిళలు నిరాయుధీకరణ, శాంతిని డిమాండ్ చేస్తూ పశ్చిమ జర్మనీ ఛాన్సలర్ అడెనార్‌కి కార్డులు పోస్టు చేశారు. 50 వేల మంది వస్త్ర పరిశ్రమకి చెందిన ఇరాక్ మహిళా కార్మికులు చమురు పరిశ్రమని జాతీయం చేయమని డిమాండ్ చేస్తూ చారిత్రాత్మకమైన ఉద్యమాన్ని ప్రారంభించారు. 20వ శతాబ్దంలో వివిధ దేశాల శ్రామిక మహిళలు చారిత్రాత్మకమైన అంతర్జాతీయ మహిళా దినాన్ని సమాన హక్కుల దినంగా, మాతా శిశు సంరక్షణ దినంగా, ప్రపంచ శాంతి దినంగా పాటిస్తున్నారు. అంతర్జాతీయ మహిళా దినంగా పాటింపబడే మార్చి 8 ప్రపంచ కార్మిక ఉద్యమంలో భాగంగా పరిగణింపబడుతున్నది. 1917 రష్యా అక్టోబర్ విప్లవం తరువాత కొత్తగా విముక్తి చెందిన మహిళలు మార్చి 8 వారి స్వేచ్ఛా స్వాతంత్రాలకు సంకేతంగా పరిగణిస్తున్నారు. లెనిన్, స్టాలిన్‌లు కూడా ప్రపంచ వ్యాప్తంగా మహిళల విమోచన కొరకు సూచనలిచ్చేందుకు ఈ దినాన్నే ఎంపిక చేసుకొన్నారు.

అంతర్జాతీయ మహిళా దినం యొక్క సత్సాంప్రదాయాలకు ప్రపంచవ్యాప్తంగా గుర్తింపు లభించింది. 1960లో అంతర్జాతీయ మహిళా దినం యొక్క 50వ వార్షికోత్సవ స్వర్ణోత్సవం అంతర్జాతీయ ప్రజాస్వామ్య మహిళా సంస్థ ఆధ్వర్యంలో ఘనంగా ప్రపంచవ్యాప్తంగా జరిగింది. అంతర్జాతీయ మహిళాదినం సోషలిస్టు దేశాలలోనేగాక పెట్టుబడిదారీ దేశాలలో కూడా జరుపుకొనబడుతున్నది. మహిళల హక్కులకు అది విశ్వవ్యాప్త సంకేతంగా గుర్తింపబడుతున్నది.

రష్యా విప్లవానికి మద్దతుగా సార్వత్రిక సమ్మె సాగించమని జర్మనీ అంతటా, ప్రత్యేకించి శ్రామిక మహిళల్లో 1905-1906లో



రోజాలక్జంబర్గ్‌తో కలిసి క్లారాజెట్కిన్ విస్తృతంగా ప్రచారం సాగించారు. జర్మన్ సామ్రాజ్యవాదానికి సోషల్ డెమోక్రాట్లకు వ్యతిరేకంగా వారు పోరాటాన్ని నడిపారు. మొదటి ప్రపంచ యుద్ధం చెలరేగే వరకు మిలటరీ విధానానికి, సామ్రాజ్యవాద యుద్ధానికి వ్యతిరేకంగా మహిళల్ని ఆకట్టుకొనే విధంగా క్లారా జట్కిన్ 'సమానత్వం' అనే పత్రిక నడిపింది. యుద్ధాన్ని కొనితెచ్చే వారికి వ్యతిరేకంగా నిరసన తెలియజేసేందుకు స్విట్జర్లాండులోని బెర్నేలో మహిళా సదస్సుల ఏర్పాటుకు చొరవ తీసుకొన్నది. బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీ, ఇటలీ, పోలండ్, రష్యా, హాలండ్, స్విట్జర్లాండ్ ప్రతినిధులు సదస్సుకు హాజరయ్యారు. శాంతికొరకు, స్వేచ్ఛ కొరకు అంతర్జాతీయ మహిళా సమాఖ్య ఏర్పాటు చేయబడింది. యుద్ధాన్ని వ్యతిరేకిస్తూ ఈ సదస్సు ఒక తీర్మానాన్ని ఆమోదించింది. శ్రామిక మహిళలకు విజ్ఞప్తి చేస్తూ ఒక ప్రణాళిక విడుదల చేసింది.

"మీ భర్తలెక్కడున్నారు? మీ కొడుకులెక్కడన్నారు? లక్షలాది మంది యుద్ధానికి బలయ్యారు. కాళ్ళు పోయి, కళ్ళుపోయి, చేతులుపోయి పలు రకాలుగా వికలాంగులై ఆసుపత్రులలో చావు బ్రతుకుల మధ్య ఊగిసలాడుతున్నారు. ఈ యుద్ధం వలన ఎవరు ప్రయోజనం పొందుతున్నారు? తుపాకులు తూటాలు తయారు చేయించేవారు, యుద్ధ నౌకల యజమాన్యాలు, ఓడరేవుల యజమాన్యాలు, మిలటరీ ఉత్పత్తులు చేయించేవారు... కార్మికులు ఈ యుద్ధం వలన పొందే ప్రయోజనమేమి లేదు. వారు సర్వస్వాన్ని కోల్పోతున్నారు. కాబట్టి యుద్ధాన్ని నిరసించండి. సోషలిజం కొరకు పురోగమించండి"

మొదటి ప్రపంచయుద్ధం కాలంలోనే రష్యా లెనిన్ నాయకత్వంలో 1917 అక్టోబర్ విప్లవాన్ని విజయవంతం చేసుకొన్నది. కార్మికవర్గంతో పాటు అణచివేయబడిన మహిళల విముక్తికి అది సరియైన మార్గాన్ని చూపింది. లెనిన్ యిలా చెప్పాడు. "మహిళలకు పూర్తి స్వేచ్ఛను సాధించకుండా కార్మికవర్గం పూర్తి స్వేచ్ఛను సాధించలేదు." సోవియట్ రష్యాలో చూపబడిన మహిళా విమోచన మార్గం ప్రపంచవ్యాప్తంగా నూతన చైతన్యాన్ని అందజేసింది.

యూరపులోను అమెరికాలోను 19వ శతాబ్దపు పారిశ్రామిక విప్లవం తనతోపాటు గొప్ప చైతన్యాన్ని తీసుకొని వచ్చింది. అమెరికా స్వాతంత్ర్యం (1776, తరువాత 'స్వేచ్ఛ సమానత్వం, సౌభ్రాతృత్వం' నినాదంతో ఫ్రెంచి విప్లవం (1789) వచ్చింది. దానితోపాటు 18వ శతాబ్దం చివరలో చారిత్రాత్మకమైన పారిశ్రామిక విప్లవం వచ్చింది. ఈ పూర్వరంగంలో యూరపులో బూర్జువా పునరుజ్జీవన ఉద్యమాలు, హేతుబద్ధమైన ఆలోచన ప్రారంభమయ్యాయి. గోథే, షిల్లర్, కాంట్, హెగెల్, డార్విన్, మిల్, బెంథామ్, స్పెన్సర్, హాక్స్‌లీ లాంటి ప్రముఖులతో శాస్త్రీయ విజ్ఞానం, నూతన సంస్కృతి వెల్లివిరిశాయి. ఆడమ్‌స్మిత్ జాతుల సంపద 1776లో వెలువడింది. అలాగే జాన్ స్టువర్ట్ మిల్ యొక్క రాజకీయ అర్థశాస్త్రం (1848), స్వేచ్ఛ (1859), మహిళల దాస్యము (1869), ఛార్లెస్ డార్విన్ యొక్క పరిణామవాదం (1859) యుగ చైతన్యాన్ని మేల్కొలిపాయి. పునర్వికాస ఉద్యమం, మానవతా వాదము, హేతుబద్ధమైన ఆలోచన స్ఫూర్తి, బ్లేక్ బరన్స్, కాల్‌రిడ్జ్, వర్డ్స్‌వర్త్, షెల్లీ, కీట్స్, బైరన్ వగైరాల సాహిత్యంలో ప్రతిబింబించాయి. బూర్జువా పునర్వికాసం కన్న ఉన్నతంగా గతితార్కిక చారిత్రక భౌతికవాదం అభివృద్ధి చెందింది. మార్క్స్, ఎంగెల్స్‌ల కమ్యూనిస్టు ప్రణాళిక 1848లో వెలువడింది. పెట్టుబడి మొదటి వాల్యూం 1867లోను ఎంగెల్సు యొక్క 'కుటుంబం, వ్యక్తిగత ఆస్తి, రాజ్యాంగం పుట్టు పూర్వోత్తరాలు' 1884లోను, ఇంగ్లాండులోని శ్రామికవర్గం స్థితిగతులు 1845లోను వెలువడ్డాయి. ఆ విధంగా 19వ శతాబ్దం మధ్యభాగంలో పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చాలా ఉన్నతమైన స్థితికి చేరుకొన్నదశలో సోషలిజం భావన అభివృద్ధి చెందింది.

బూర్జువా పునర్వికాస ఉద్యమంగా వీచిన కొత్తగాలితో యూరప్‌లో మానవ (మొత్తం స్త్రీల, పురుషుల) హక్కుల సమస్య ముందుకు వచ్చింది. స్త్రీ విద్య, మహిళా హక్కులు, స్త్రీలకు సామాజిక స్వేచ్ఛలకు సంబంధించిన ఉద్యమాలలో ఇంగ్లండ్ అగ్రభాగాన వున్నది. 1830 సంవత్సరపు ఛార్టిస్టు ఉద్యమంలో చాలామంది మహిళలు పాల్గొన్నారు. అప్పటి నుండి స్త్రీ విద్య, వారి హక్కుల సమస్యలు సామాజిక సంచలనాన్ని సృష్టించాయి. 1836 సంస్కరణ బిల్లులో స్త్రీ విద్య ఒక ముఖ్యమైన అంశం. బానిసల వ్యాపారాన్ని నిషేధించే బిల్లు 1833లో ఆమోదం పొందింది. ఈ అభివృద్ధి కరమైన చర్యలు సామాజిక చైతన్యాన్ని పెంచాయి. జాన్ స్టువర్ట్‌మిల్ పార్లమెంట్ సభ్యునిగా స్త్రీలకు పురుషులతో సమాన హక్కులు కావాలని వాదించాడు. ఆయన 'దాస్యంలో స్త్రీలు' అనే తన ప్రఖ్యాత గ్రంథంలో చట్టపరంగా పురుషుల అధీనంలో స్త్రీలు వుండాలనడం తప్పని, పురుషులతో సమానస్థాయి స్త్రీకి వుండటం అవసరమని హేతుబద్ధంగా నిరూపించాడు. ఒక శతాబ్ద కాలం పోరాటం సాగించి స్త్రీలు ఓటు హక్కు సాధించుకొనగలిగారు.

అప్పటి వరకు మహిళా ఉద్యమంలో మహిళకు ఓటు హక్కు సమస్య ప్రధానమైనదిగా వుండేది. మొదటిసారిగా ఓటు హక్కును కోరిన షెఫీల్ అసోసియేషన్‌గా పేర్కొనబడిన మహిళల బృందం తన మొదటి సదస్సును 1851లో జరుపుకొన్నది.

కాని వాస్తవంగా మహిళల ఓటుహక్కు సమస్య అంతకు చాలాముందే ప్రస్తావించబడింది. 18వ శతాబ్దంలో మేరీగాడ్విన్ రచనలైన 'కుమార్తె చదువుపై అభిప్రాయాలు, 'మహిళల హక్కులు' అనే గ్రంథాలు ప్రచురింపబడిన తరువాత మహిళల హక్కుల సమస్య ఇంగ్లండ్‌లో సంచలనాన్ని సృష్టించింది. మేరీ గాడ్విన్ తరువాత 3 దశాబ్దాలకు 1825లో విలియం థాంప్సన్ మహిళల ఓటు హక్కు కొరకే గాక యితర హక్కుల కొరకు కూడా మిసెస్ వీలర్‌తో కలిసి విస్తృత ప్రచారం యిచ్చారు.

కాని మహిళల ఓటు హక్కు సమస్య అప్పుడు అంతగా ప్రజాదరణ పొందలేదు. 1857లో ఇంగ్లాండులో 'వివాహం విడాకుల చట్టం' ఆమోదం పొందింది. వివాహిత స్త్రీల ఆస్తి కొరకు బిల్లు 1855లో ప్రవేశపెట్టబడింది. కాని అప్పుడది తిరస్కరింపబడింది. అది 1882లో ఆమోదం పొందింది. 1860 దశాబ్దం చివరలో లిడియాబెకర్, మేరీ కార్పెంటర్ మొదలైన వారు స్త్రీల ఓటు హక్కు కొరకు ఉద్యమాలు నడిపేందుకు చొరవతీసుకొన్నారు. లిడియాబెకర్ 'మాంచెస్టర్ మహిళా ఓటు హక్కు సంఘాన్ని ఏర్పరచింది. స్త్రీల ఓటు హక్కుకి ప్రచారం యిచ్చేందుకు లిడియాబెకర్ సంపాదకత్వాన ఒక పత్రిక నడిపారు. జాతీయ ఓటు హక్కు సంఘం, మహిళా సంఘం, చర్చాసంఘం లాంటి మహిళా సంఘాలు ఏర్పడ్డాయి. వారి ఉద్యమాల ఫలితంగా 1869లో పన్ను చెల్లించే స్త్రీలకు మునిసిపల్ ఎన్నికలలో ఓటుహక్కు కల్పించబడింది. 1875లో పేదలకు చట్టపరమైన న్యాయాన్ని సంరక్షిస్తూ సేవ చేసేందుకు స్త్రీలకు అర్హత లభించింది. మహిళలకు

ఓటు హక్కు సాధించడానికి ఏర్పడిన సంఘం శ్రీమతి హెన్రీ ఫాసెట్ నాయకత్వంలో ప్రారంభమయింది. ఓటు హక్కు కొరకు ఏర్పడిన మహిళా ఉద్యమాలు ప్రజాభిప్రాయాన్ని తమ కనుకూలంగా మలచుకొంటూ క్రమంగా బలపడ్డాయి. 1897లో స్త్రీల ఓటు హక్కు బిల్లు ప్రతిపాదించబడింది. కాని దురదృష్టవశాత్తు విఫలమయింది.

ఇంగ్లాండు మహిళలు పురుషులతో సమానంగా ఓటు చేసే హక్కు 1928 వరకు సాధించలేకపోయారు. 1918లో స్త్రీలకు ఓటు హక్కు సూత్రరీత్యా ఆమోదింపబడింది. 30 సంవత్సరాల వయస్సు గల ఇంటి యజమానులకు, యజమానుల భార్యలకు ఓటు హక్కు కల్పించబడింది. ఇంగ్లాండులో ఈ పరిణామాలతోపాటు ఐరిస్ ఓటు హక్కు ఉద్యమాన్ని కూడా పరిశీలించవచ్చు. అనిబిసెంట్, మార్గరెట్ సోదరీమణులు ఓటు హక్కు ఉద్యమానికి నాయకురాండ్రు. ఆ తరువాత వారు భారతదేశానికి వచ్చి స్వాతంత్ర్య పోరాటంలోను, మహిళా ఉద్యమాల్లోను పాల్గొన్నారు. సుదీర్ఘ పోరాటం తరువాత ఇంగ్లాండ్‌లో మహిళలు 1928లో ఓటుహక్కు సాధించగలిగారు. స్త్రీలు ఐస్‌లాండ్‌లో 1915లోను ఫిన్‌లాండ్‌లో 1906లోను డెన్మార్క్‌లో 1915లోను, న్యూజిలాండ్‌లో 1893లోను, ఆస్ట్రేలియాలో 1902లోను, జర్మనీ పోలండులలో 1919లోను, యు.ఎస్.ఎస్.ఆర్.లో 1917లోను హంగరీ, యు.ఎస్.ఎలలో 1920లోను, ఫ్రాన్స్‌లో 1944లోను, ఇటలీలో 1954లోను ఓటు హక్కు సాధించారు. 20వ శతాబ్దం పూర్వార్థం ముగిసే నాటికి అభివృద్ధి చెందిన చాలా దేశాలలో స్త్రీలకు ఓటు హక్కు కల్పించబడింది. ఇది సాధారణ రాజకీయ హక్కు అయినప్పటికీ దీనిని సాధించడం స్వల్పమైనదేమీ కాదు. వాస్తవంగా సమాజంలో స్త్రీలు పురుషులకంటే చాలా వెనుకబడి వున్నారు.

స్త్రీలకు విద్య, సంక్షేమం, సామాజిక హక్కుల కొరకు యూరపు అంతటా ఉన్నత వర్గాలకు, మధ్య తరగతికి చెందిన స్త్రీలు ఉద్యమాలు ప్రారంభించారు. 1859లో మహిళల ఉపాధి కొరకు ఒక సంఘం స్థాపించబడింది. చాలా మంది చదువుకొన్న స్త్రీలు ధార్మిక విద్యాపరమైన సాంఘిక సంస్కరణల కార్యక్రమాలలో పాల్గొన్నారు. స్త్రీ విద్యకి వసతులు క్రమంగా పెంచబడ్డాయి. సమాజంలోని పై తరగతికి మధ్య తరగతికి చెందిన స్త్రీలు వారి కుటుంబపు హద్దులు దాటి సాంస్కృతికంగా సామాజికంగా అభివృద్ధి చెందేందుకు వసతులు కల్పించబడ్డాయి. ఉపాధ్యాయులు, డాక్టర్లు, లాయర్లు, పత్రికా రచయితలు లాంటి పలు వృత్తులలో చేరారు. సమాజంలో క్రింది స్థాయికి చెందిన స్త్రీలు ఉపాధి కొరకు వివిధ పరిశ్రమలనాశ్రయించారు.

అలాంటి మహిళా ఉద్యమాలే జర్మనీ, ఇటలీ, ఫ్రాన్స్ లాంటి వివిధ యూరప్ దేశాలలో అభివృద్ధి కాముక ఉదారవాద బూర్జువా నాయకత్వంలో అభివృద్ధి చెందాయి. అమెరికాలో ఈ తరహా మహిళా ఉద్యమాలు అంతకుముందే మొదలయ్యాయి. అమెరికాలో 1830-40 దశాబ్దంలో మహిళల ఓటు హక్కు ఉద్యమం అప్పటి సంస్కరణల ఉద్యమంలో మిళితమై వున్నది.

ప్రపంచ వ్యాప్తంగా బూర్జువా చట్టాలు స్త్రీలకు సమాన హక్కులు యిస్తూ వచ్చాయి. వ్యక్తులందరికీ 'సమాన హక్కులు, స్వేచ్ఛ' అనే భావన 1789 ఫ్రెంచి విప్లవంతో ప్రారంభమయింది. బూర్జువా నీతి నియమాలు సంపూర్ణ మానవతావాదం, బూర్జువాలకు కార్మికులకు ఆస్తి సంబంధమైన సమాన హక్కులు అనే వాదాన్ని అంగీకరిస్తాయి. కనుక హేతుబద్ధమైన ఆలోచనలకు గుర్తింపునిస్తాయి. స్త్రీలకు పురుషులతో సమాన హక్కులనంగీకరిస్తాయి. వ్యక్తి స్వేచ్ఛని, వ్యక్తిత్వం స్వేచ్ఛగా అభివృద్ధి చెందడాన్ని బూర్జువా ప్రజాస్వామ్యం సూత్రరీత్యా అంగీకరిస్తుంది. ఫ్యూడలిజంతో పోల్చితే అది అభివృద్ధికరమైన పరిణామం. వర్గ సమాజంలో అభివృద్ధి చెందిన దశ పెట్టుబడిదారీ విధానం కనుక సమాజంలోని పలురంగాలలో స్త్రీలు సాధించిన అభివృద్ధిని గుర్తిస్తుంది. సమాజంలో కొద్దిమంది స్త్రీలనైనా సమాజానికి ఉపయుక్తమైన పనిలోనికి రప్పించడం ద్వారాను యితరులలో ఆశలు కల్పించడం ద్వారాను మహిళా విమోచనను అడ్డుకొంటున్న ద్వారాలను తెరుస్తుంది. ఎన్ని అభివృద్ధికరమైన చట్టాలు చేసినప్పటికి పదాడంబరంతో కూడిన ఎన్ని వాగ్దానాలు చేసినప్పటికీ మహిళల అణచివేతకు, వివక్షతకు మూలకారణమైన వర్గ దోపిడిపై ఆధారపడి వున్న ప్రజాస్వామ్యం అణచివేయబడిన మొత్తం స్త్రీజాతికి ఎలాంటి ఉపశమనాన్ని కలిగించలేదు. బూర్జువా ప్రజాస్వామ్యంలో మహిళలకు సమాన హక్కులు ఆచరణలో సాధ్యపడవు గనుక బూర్జువా నాయకత్వంలోని మహిళా ఉద్యమాలు ఒక దశ తరువాత మహిళలకు సాంఘికంగాను చట్టపరంగాను సమాన హక్కులను ప్రచారం చేసేందుకు పరిమితమై చివరకు నిరాశ నిస్పృహలు మిగులుస్తాయి. అందుకే 1919లో లేనిన్ యిలా చెప్పారు. ".... మాటల్లో బూర్జువా ప్రజాస్వామ్యం సమానత్వాన్ని స్వేచ్ఛనీ వాగ్దానం చేస్తుంది. కాని ఆచరణలో ఏ ఒక్క బూర్జువా ప్రజాస్వామ్యం కూడా మానవ జాతిలో సగభాగంగా వున్న స్త్రీలకు పురుషులతో చట్టపరమైన సమానత్వాన్నిగాని, పురుషుల అణచివేత నుండి స్వేచ్ఛగాని ప్రసాదించలేదు. మహిళా విముక్తి కొరకు, పురుషులతో సమానంగా స్త్రీల స్థాయిని పెంచేందుకు అభివృద్ధి చెందిన ప్రజాస్వామ్య దేశాలు 130 సంవత్సరాలలో సాధించిన దానికంటే యూరప్‌లో బాగా వెనుకబడిన దేశాలలో ఒకటైన సోవియట్ యూనియన్ రెండు సంవత్సరాలలోనే సాధించింది."

(భారతదేశంలో స్త్రీ విముక్తి నుండి)

## హైకూలు

ఒకప్పుడు...
ఊరి నిండా పిచ్చుకలే...
ఇప్పుడు ఇంటి ముందు కిచకిచలు ఏవి?
సెల్ టవర్ల వేడికి కరిగిపోయి,
రింగ్‌టోన్స్‌లో కిచకిచమంటున్నాయి!



పల్లెకి పట్నానికి మధ్య
దూరాలు తరిగిపోతున్నాయి
వేరు తెలంగానం
కట్టిన వంతెనలతో....!

# లక్ష్మి

సుధాకిరణ్.బి

అదో చిన్న పెంకుటిల్లు

ఇంటి ముందు రావి, వేప చెట్లు.

వేపచెట్టు చుట్టూ పేడతో అలికిన అరుగు.

అదిగో ఆ అరుగుమీదే మోకాళ్ళమీద తల ఆనించి కూర్చునిఉంది మన కథా నాయక. చేతిలో చినగడానికి సిద్దంగా ఉన్న కాగితం ముక్క. గాలికి అలా రెపరెపలాడుతోంది.

కథా నాయకి అంటే ఆమేదో అసాధారణ యువతి అనుకోకండి. ఆ మాట కొస్తే పన్నెండేళ్లైన్నా నిండని పసిమొగ్గ. మరేవో ప్రత్యేక లక్షణాలు ఉన్నాయనుకుంటే అటువంటివేమీ లేవు.

ఊరు, పేరు ఏమిటో తెలియకుండా, కాలగమనంలో, చరిత్రలిఖించని పేజిల్లో కలిసిపోయే కోట్లాదిమంది భారతీయ బాలబాలికల్లో ఒకటి. ఇంతకూ మన కథానాయకి పేరేమిటో చెప్పలేదు కదూ! లక్ష్మి.

తమ ఇళ్ళవైపు ఎన్నడూ తొంగిచూడని ధనలక్ష్మిని, అలా పేరులోనైనా పిలుస్తూ తృప్తి పడవచ్చని ఆమె తండ్రి ఆశ. అందుకే కొట్లాడిమరీ ఆ పేరు పెట్టించాడు. పేర్లు మనుషుల ఆర్థిక స్తితిని మార్చవుకదా! లక్ష్మి కుటుంబ పరిస్థితి కూడా అంతే. రెక్కాడితేకాని డొక్కాడదని చెప్పలేం కాని, కాస్త స్థిమితంగా కూర్చుని తినడానికి వీలులేని స్థితి. లక్ష్మి తాతలు సంపాదించిన ఆస్థులు హారతికర్పూరంలా కరిగిపోయాయి. ఒకప్పటి విశాలమైన లోగిలి కుంచించుకుపోయి లక్ష్మికి ఊహ తెలిసేటప్పటకి చిన్న ఇల్లు మిగిలింది. ఉన్న ఎకరం పొలంతో చాలీచాలని బతుకులు ఈడ్చే అందరి రైతుల పరిస్థితిలాంటిదే. పంట పండి చేతికొస్తే పండగ. లేకపోతే పస్తే. ఇదీ లక్ష్మి కుటుంబం స్థితి. వీటన్నింటికి తోడు లక్ష్మి పుట్టిన తరువాత ఒక తమ్ముడు కూడాపుట్టుకువచ్చాడు. ఇక చెప్పే దేముంది. లక్ష్మి ప్రాధాన్యత ఆ కుటుంబంలో తగ్గిపోయింది.

లక్ష్మికి కూడా తమ్ముడంటే ఇష్టమే. వాడితో ఆటలు ఆడుతుంది, పాటలు పాడుతుంది. కాని, మూడేళ్ళ నుండే ఈ పరిస్థితి మారిపోయింది. కారణం ... చాలా చిన్నదే! చిన్నదంటే మరీ చిన్నదని కాదు కాని, లక్ష్మి తల్లితండ్రుల దృష్టిలో మాత్రం చిన్నదే. లక్ష్మికి మాత్రం హిమాలయాలంత పెద్దది. ఆ మాటకొస్తే ఇంకా పె... ద్దది! కారణం చెప్పలేదు కదూ! లక్ష్మి తమ్ముడిని ఆ ఊరిలోనే ఉన్న ఇంగ్లీషు మీడియం స్కూల్లో చేర్పించడానికి ఆ అమ్మాయి నాన్న సిద్ధపడ్డాడు. లక్ష్మి మాత్రం మామూలు బడిలోనే... బల్లలుండవు, ఆడుకోవడానికి స్థలం ఉండదు. ఆ మాటకొస్తే పాఠాలు చెప్పడానికి పంతుళ్ళు ఉండరు. ఉన్న ఒక్క పంతులే ఒకటినుండి ఐదో తరగతిదాకా అలా నెట్టుకొచ్చేస్తుంటాడు.

నాన్న నోటివెంట ఆ మాట వచ్చిన మొదటిరోజే లక్ష్మి గొంతు విప్పింది. అంటే అంతకు ముందు నుండి మాట్లాడటం లేదని అర్థం కాదు. మొదటిసారిగా గట్టిగా, గొంతుచించుకుని, కాళ్లు జాడిస్తూ మరీ అరిచింది "నన్ను కూడా అక్కడే చేర్చండి ... నేను బాగా చదువుకుంటా" అంతపెద్దగా అరవడం అదే మొదటిసారేమో. లక్ష్మి, అమ్మానాన్నలు ఉలిక్కిపడ్డారు. "అలా అంటే ఎలా అమ్మా! ఇప్పుడు తమ్ముడ్ని చేరుస్తాం. వచ్చే ఏడాది నిన్ను కూడా చేరుస్తాం. మా బుజ్జికదూ" అంటూ నచ్చచెప్పడానికి ప్రయత్నించారు. లక్ష్మి వినలే ... ససేమిరా అంది. కానీ, కుదర్లే! తల్లితండ్రులే పంతం నెగ్గించుకున్నారు. అప్పటి నుండి లక్ష్మి పోరాటం ప్రారంభమైంది. "నన్నెప్పుడు ఆ బడికి పంపుతారు" అని. ఎప్పుడైనా, ఎక్కడైనా ఇదే మాట. పగలు ఆటల్లోనూ, రాత్రి కలల్లోనూ 'ఆ బడే'!

ఇది జరిగిన ఆరు నెలల తరువాత కాబోలు. లక్ష్మి మేనమామ ఇంటికి వచ్చాడు. మామయ్యను చూడగానే లక్ష్మి భోరుమని ఏడ్చేసింది. మామ సంకనెక్కి తనకు జరిగిన అన్యాయాన్ని చెప్పింది. మామయ్య అంటే లక్ష్మికెంతో ఇష్టం. మామయ్యకు కూడా అంతే! "నాన్నతో మాట్లాడతా" అని చెప్పాడు. అన్నట్లే చెప్పాడు. చదువుకున్న ఎంతో మంది ఆడవాళ్ళ గురించి చెప్పాడు. "ఆడపిల్లలను చదివించాలి" అని చెప్పాడు. ఇవన్నీ లక్ష్మికి అర్థం కాలేదు కాని, ఒక్కటి మాత్రం అర్థమైంది. నాన్న తనను కూడా 'ఆ బడిలో చేర్పించడానికి ఒప్పుకున్నాడని, అయినా నమ్మకం కుదర్లా ... ఒట్టు పెట్టించుకుంది. "ఒట్టు తీసి గట్టుమీద పెడితే" మళ్ళీ అనుకుంది. ఇలా కాదనుకుని కాగితంమీద రాసిఇయ్యమని పట్టుపట్టింది. మామయ్య కూడా చెప్పడంతో "నిన్ను 'ఆ బడిలో' చేర్పిస్తా" అని నాన్న కాగితం మీద రాసిచ్చాడు. అదిగో ఆ కాగితం అప్పటి నుండి లక్ష్మికి అన్నిటికన్నా విలువైనదిగా మారిపోయింది. ఇది జరిగి రెండన్నరేళ్ళు గడిచిపోయాయి.

కాగితం రాసిచ్చిన తరువాత మొట్టమొదటిసారి వచ్చిన



వర్షాకాలంలో అంటే బడులు తెరిచే సమయంలో లక్ష్మి నాన్నకు ఆ సంగతే గుర్తులేదు. లక్ష్మికి గుర్తుంది కాని "నాన్న చెప్పాడు కదా... అందులోనూ రాసిచ్చాడు కదా, మామయ్యకూడా పక్కనున్నాడు కదా" అని ఆలోచించింది.

కాలం ఇట్టే గడిచిపోయింది. మామూలుగానే పలక, బలపం ఇచ్చి బడికి వెళ్ళమన్నారు. లక్ష్మికి కళ్ళవెంట నీళ్ళు ఉబికివచ్చాయి. వెక్కిళ్ళుబెడుతూ "ఆ బడికి పంపుతానన్నావు కదా" ఏడుస్తూనే అడిగింది. "ఏ బడికి" అంతకన్నా ఆశ్చర్యంగా అడిగాడు నాన్న. "తమ్ముడి బడికి"లక్ష్మి సమాధానం "రాసిచ్చావు కూడా" ఎందుకు పంపవు అన్నట్లు నిలదీసింది. "ఇప్పుడు కాదులే... మళ్ళీ చూద్దాం" నాన్న సమాధానం. లక్ష్మి ఏడుపులు మళ్ళీ పనిచెయ్యాలా. 'మాములు బడికే' లక్ష్మి వెళ్ళింది.

ఆ తరువాత ఏడాది కూడా ఇదే తంతు. ఇదిగో అదుగో అంటూ వాయిదాలు. రెండవ తరగతిలో ప్రారంభమైన ఆమె కోరిక నాల్గవ తరగతికి వచ్చినా నెరవేరలేదు. ఆ కోరిక మాత్రం పెరిగి పెద్దదై, మర్రి చెట్టంతైపోయింది. నాన్న రాసిచ్చిన కాగితం భద్రంగా దగ్గరే ఉంచుకుంది. చేరితే ఈ ఏడాదే "ఆ బడిలో చేరాలి ... లేకుంటే లేదు" ఇది ఇప్పుడు లక్ష్మి మనసులో ఉన్న ఆలోచన. ఎందుకంటే 'ఆ బడి'లో ఐదవ తరగతి దాకే ఉంది మరి! అదే విషయాన్ని నాన్నకు చెప్పింది. మామయ్యతోటి చెప్పించింది. నాన్న రాసిచ్చిన కాగితాన్ని ఊళ్లో అందరికి చూపించింది. అందరూ నాన్నకు చెప్పే వాళ్ళే. "ఎందుకయ్యా ఆ పిల్లను అలా ఏడిపిస్తావు. ఈ ఒక్క ఏడాదైనా అక్కడ చేర్చు" అని. ఆ మాటకొస్తే "ఆ ఆడపిల్లకు చదువెందుకు... అందులోనూ ఇంగిలిపీసు చదువులు" అంటూ ఈసడించిన నానమ్మ కూడా ఇప్పుడు "పోనీలేరా... అదేమన్నా మణులు అడిగిందా, మాణ్యాలు అడిగిందా" అంటూ తనవైపే మాట్లాడింది.

ఇందరు చెప్పేటప్పటికి నాన్న కూడా కాస్త మెత్తబడ్డాడు. "మార్చిలో మిర్చి వసూళ్ళు అవుతాయి కదా, ఆ దబ్బులు తీసుకొచ్చి దానికే ఇస్తా. వాళ్ళ మామయ్యను కూడా తీసుకొస్తా. వాళ్ళేతేల్చుకుంటారు" అని చెప్పాడు. చెప్పినట్లుగానే మిర్చి తీసుకుని మార్కెటు కెళ్ళాడు. వస్తూ, వస్తూ మామయ్యను కూడా తీసుకువస్తానన్నాడు.

అదిగో, అలా వెళ్ళిన నాన్న కోసం ఎదురుచూస్తూ అలా కూర్చుని ఉంది. ఈ సారి కూడా నాన్న మాట తప్పితే ఏం చెయ్యాలా అని ఆలోచిస్తూ. ఎందుకైనా మంచిదని తనదగ్గర భద్రంగా దాచుకున్న కాగితం ముక్కని చేతిలో పట్టుకుని వాకిట్లోని చెట్టుకింద ఎదురుచూస్తూ. అప్పటికి ఆరుగంటలుగా అలా వేపచెట్టుకిందనే కూర్చుని ఉంది. ఇంత తిని వెళ్ళమని అమ్మ పిలిచినా వెళ్ళకుండా! కనుచూపుమేరలో మాత్రం నాన్న వస్తున్న జాడ కనిపించడంలేదు. ఆకాశమూ నల్లబడుతోంది. లక్ష్మి చేతిలో ఉన్న కాగితాన్ని మరింత గట్టిగా పట్టుకుంటూ మెడను పైకెత్తి, మునిగాళ్ళమీద నిలబడి మరీ రోడ్డువైపు ఎదురుచూస్తూఉంది! ఈ సారి తాడోపేడో తేల్చుకోవాలన్న పట్టుదల ఆమెది.

ఈ కథంతా చదివినతరువాత ఏడాదికేడాది వాయిదా పడుతున్న మహిళా రిజర్వేషన్ బిల్లు గుర్తుకొస్తే రచయితది బాధ్యత కాదు.

*

## శ్రీమతి యస్. యాదమ్మ స్మృతికి ఐద్వా శ్రద్ధాంజలి.

**జననం 9.9.1954, మరణం: 21.12.2006**



శ్రీమతి యస్. యాదమ్మ (50సం॥) అఖిల భారత మహిళా సంఘం పాతనగరం శాఖ నాయకురాలు. తేది 21.12.2006 నాడు రోడ్డు ప్రమాదంలో అకాల మరణము చెందారు. అరుంధతినగర్ కాలనీలో ఐద్వా అధ్యక్షురాలిగా వుండటంతోపాటు బస్తీ సమస్యలపై పని చేయుటకు "ప్రగతి మహిళా సంఘం" (ఐద్వాకు అనుబంధం) ఏర్పాటు చేసి అనేక కార్యక్రమాలకు ప్రభుత్వం వైపు నుండి కూడా నిధులు సాధించారు.

పాత బస్తీలో అనునిత్యం జరిగే మత ఘర్షణలు నివారించడంలో, శాంతి సంఘాలు స్థాపించడంలో, భార్య భర్తలకు కౌన్సిలింగ్ ఇవ్వడంలో కాపురాలను నిలబెట్టడంలో తనదైన చొరవ చూపారు. అధిక ధరలకు వ్యతిరేకంగా నిర్వహించిన కార్యక్రమంలో పోలీసుల లాఠీదెబ్బలు తిన్నారు. బస్తీలో ఐద్వా వలంటీర్ పోలీస్ స్టేషన్‌లో మైత్రి సంఘంలో సభ్యురాలిగా వుంటూ తన సేవలు మహిళలకు అందించారు.

తుది శ్వాస విడిచేవరకు మహిళా సమస్యల పరిష్కారానికి శాయశక్తుల కృషి చేసి జీవితాన్ని సార్థకం చేసుకున్న శ్రీమతి యాదమ్మకు ఐద్వా నివాళులర్పిస్తుంది.

## మహిళలకే ముప్పు ఎక్కువ

హెచ్ఐవీ పరిజ్ఞానం విషయంలో పురుషులపై మహిళలదే పైచేయి... జబ్బు బారినపడే విషయంలో మాత్రం వారే అసలు బాధితులంటున్నారు నిపుణులు.

మహిళలకు హెచ్.ఐ.వీపై అవగాహన ఎక్కువున్నా అధికంగా వారే... దీని బారిన పడుతున్నట్లు గుర్తించారు. హెచ్ఐవీ తమ భర్తలకు సరైన అవగాహన లేని కారణంగా భార్యలే ముప్పు ఎదుర్కొంటున్నట్లు యునిసెఫ్ నివేదిక స్పష్టం చేసింది.

యునిసెఫ్ ఇటీవల విడుదల చేసిన నివేదిక ప్రకారం సెక్సు కారణంగా వ్యాపించే హెచ్ఐవి పురుషులతో పోలిస్తే మహిళల్లోనే రెండింతలు అధికంగా ఉన్నట్లు తేలింది. 2005 నాటికి ప్రపంచవ్యాప్తంగా జీవిస్తున్న 3.9 కోట్ల మందికి హెచ్ఐవీపై అవగాహన ఉండగా, పురుషుల్లో 17 శాతం మందికే ఉంటుంది. 59 శాతం మంది భారతీయులు కండోమ్‌లు ఉపయోగిస్తుండగా, 51 శాతం మంది మహిళలు గర్భ నిరోధక మాత్రలు వాడుతున్నారు. నేషనల్ ఎయిడ్స్ కంట్రోల్ ఆర్గనైజేషన్ సమాచారం ప్రకారం ప్రస్తుతం దేశంలో 52 లక్షల మంది హెచ్ఐవీ బాధితులు జీవిస్తున్నారనీ, ఇందులో 39 శాతం మంది మహిళలని స్పష్టం చేసింది.

# స్త్రీల హక్కుల్లో నిజానికి అమలవుతున్నవెన్ని?

టి.కె. రాజ్యలక్ష్మి
స్వేచ్ఛానువాదం : దేవి

జనవరి 15 నుండి ఫిబ్రవరి రెండవ తేదీ వరకు న్యూయార్క్ నగరంలో స్త్రీలపై వివక్షతా వ్యతిరేక కమిటీ 37వ సమావేశం జరిగింది. వివిధ దేశాల స్వంత చట్టాలను పరిశీలించిన ఈ కమిటీకి గతంలో తాను ప్రతిపాదించిన సూత్రాల అమలు ఎంత కష్టసాధ్యమో తెలిసి వచ్చింది. వివిధ దేశాల ప్రభుత్వాల ప్రాతినిధ్య బృందాలు, స్వచ్ఛంద సంస్థలూ కూడా స్త్రీలపై జరుగుతున్న హింసను పదేపదే ప్రస్తావించారు. అలాగే వివిధ దేశాల కుటుంబ, వివాహ చట్టాల్లో సంస్కరణలు జరగటం లేదని కమిటీ దృష్టికి తీసుకు వచ్చారు.

స్త్రీలపై జరిగే అన్ని రకాల వివక్షతకు వ్యతిరేకంగా ఐక్య రాజ్య సమితి వేసిన ఈ కమిటీ "సిడా" (సి.ఇ.డి.ఎ.డబ్ల్యు కమిటీ 'ఆన్ ఎలిమినేట్ ఆఫ్ ఆల్ ఫామ్స్ ఆఫ్ డిస్క్రిమినేషన్ ఎగెనెస్ట్ వుమెన్) ఐరాస సభ్య దేశాలన్నింటి నివేదికలూ, సిడా ప్రతి పాదించిన సూత్రాల కనుగుణంగా ఐరాస సభ్యదేశాలు ఏం చర్యలు చేపట్టాయో ఈ కమిటీ కొన్ని దేశాలు ప్రగతిశీల సంస్థలను స్థాపించి స్త్రీలకు అనుకూల విధానాలు చేపడితే మరి కొన్ని దేశాలు వివక్షతను మరింతగా పెంచి పోషించాయి. ఉదాహరణకు మాల్దీవుల్లో అత్యున్నత రాజకీయ, న్యాయస్థాన పదవులు స్త్రీలకు ఇవ్వకూడదని నిషేధం విధించారని "సిడా"కు తెలిసింది.

23 మంది సభ్యులుగల 'సిడా' భారతదేశంతో సహా పన్నెండు దేశాల నివేదికలను క్షుణ్ణంగా పరిశీలించింది. సిడా ఏర్పడిన తర్వాత మొదటి ఏడాది తర్వాత ప్రతి నాలుగేళ్ళకూ ప్రతిదేశం సిడాకు తాను చేపట్టిన చర్యల నివేదిక అందించాలి. 1993లో భారతదేశం స్త్రీల స్థితిగతులు మొదటి నివేదిక అందించినా ఇప్పటికి మరిరెండు నివేదికలు మాత్రమే సమర్పించింది. సిడా స్వచ్ఛంద సంస్థలతో ప్రత్యేక సమావేశం జరిపి వారి నివేదికలు కూడా విన్నది.

దళిత హక్కుల కార్యకర్త రూత్ మనోరమ నాయకత్వం వహించిన భారత స్వచ్ఛంద సంస్థల ప్రతినిధి బృందం పునరావాసం, 2002 గుజరాత్ ఊచకోత బాధితులకు న్యాయం జరగటం, అంతర్గత వైషమ్యాల వలన స్త్రీలపై పడే ప్రభావం, గ్రామీణ పేదరికం, గిరిజన, దళిత మహిళలకు విద్యా వైద్య సౌకర్యాలు అందుబాటులో లేక పోవటం వంటి అంశాలను ప్రస్తావించింది. ప్రకృతి బీభత్సాలు సంభవించినపుడు సామాజికంగా మంత్రగత్తెల పేరిట చంపడం, అసంఘటిత కార్మిక భద్రతతో చట్టాలు, ఆడపిల్లల అక్రమ రవాణా వంటి అనేక అంశాలు కూడా వీరు లేవనెత్తారు. ఈ అంశాలన్నింటి నేపథ్యంగా ఉదారవాద ఆర్థిక విధానాలు, ప్రపంచీకరణలను వారు వివరించారు.

ఉత్పత్తిదారులుగా ఉండే స్త్రీలు వారి పనికి గుర్తింపు లేని పరిస్థితుల గురించి స్త్రీలను ప్రభావితం చేసే భారత ప్రభుత్వ ఆర్థిక విధానాల



గురించి సిడా వేసిన ప్రశ్నలు అవసరం అయినంత లోతుగాను ప్రాధాన్యతతోనూ చర్చకు రాలేదు. అదే సమయంలో స్వేచ్ఛా వ్యాపార జోనుల్లో స్త్రీల పని పరిస్థితుల గురించి సిడా కమిటీ నికరాగువా ప్రతినిధి బృందాన్ని పదేపదే ప్రశ్నించింది.

భారత ప్రభుత్వం పంపించిన నివేదికల్లో గుజరాత్ మారణకాండ స్త్రీలపై చూపిన ప్రభావం గురించి సిడా కోరిన వివరాలుల్లేవు. అట్లాగే స్త్రీలను వివక్షకు గురిచేసే చట్టాలు, వాటి సవరణలకు కాల నిర్ణయం వ్యూహాలు గాని, మిలటరీ దాడులు జరిగే ప్రదేశాలు, అల్లర్లు జరిగే ప్రాంతాల్లో స్త్రీల విషయంలో తీసుకోవల్సిన జాగ్రత్తల్ని ప్రధాన ప్రాధాన్యతల్లోకి తెచ్చే అంశం గురించి గాని ప్రభుత్వ నివేదికలో ప్రస్తావన లేదు. ఉగ్రవాద నిరోధక చట్టం, మిలటరీ దళాల ప్రత్యేక అధికారాలపై సమీక్ష అవసరం అని సిడా సూచించింది.

ప్రభుత్వం భూ సంస్కరణల చట్టాన్ని ఎలా అమలు జరపబోతున్నది? స్త్రీలకు భూమిపై మరింత హక్కు కల్పించడానికీ ఏం చేయనున్నదీ? అసమాన స్త్రీ పురుష నిష్పత్తి గల జనాభా లెక్కల గురించి, సాంస్కృతికంగా స్త్రీల మూగ పాత్రల గురించీ, విద్యారంగంలో బాలికల నమోదు గురించీ, రాజ్యాంగం కల్పించిన నిర్బంధోచిత ప్రాథమిక విద్యా అవకాశం అమలు గురించీ వీటన్నింటిపై తీసుకునే ఖచ్చితమయిన చర్యల గురించి 'సిడా' భారత ప్రతినిధి బృందాన్ని వివరణ కోరింది. మొత్తం మీద 29 ప్రశ్నలు వేసింది. నివేదికలు అందచేయటంలో భారత ప్రభుత్వం చేసిన జాగుపై సిడా అసంతృప్తి వ్యక్తం చేసింది.

సిడా ప్రతిపాదిత సూత్రాల్లో స్త్రీలను లైంగిక పరం అయిన పాత్రల్లో మూసలుగా చూపడం, వారిపై స్థిరపడిన అభిప్రాయాల గురించీ, వివాహం, దాంపత్య జీవితం గురించీ ఉన్న అంశాలను, ఒక సామాజిక తరగతికి సంబంధించిన వ్యక్తిగత వ్యవహారాల్లో వారి అనుమతి, చొరవ లేకుండా కల్పించుకోమని చేసిన ప్రభుత్వ విధానాలకు లోబడి మాత్రమే అమలు చేయగలమని ప్రభుత్వ ప్రతినిధి బృందం తెలియచేసింది.

వ్యక్తులుగా గాని బృందాలుగా గాని సిడాకు ఆరోపణ ఇవ్వటంపై సిడా వాటిని స్వీకరించడంపై ప్రభుత్వ ప్రతినిధి బృందం అనుమతిని రూఢీపరచలేదు. ఇది ఆయా దేశాల న్యాయ వ్యవస్థను తక్కువ చేయడంగాని దానిపై దాడిచేయటం గాని కాదని ఒక అదనపు సౌకర్యం మాత్రమేనని వివరించినా మన బృందం సంతృప్తి చెందలేదు.

గుజరాత్ ఊచకోత, దాని తర్వాత పరిణామాలపై అనేక ప్రశ్నలు సిడా వేసింది. చనిపోయినవారి అధికారిక లెక్కలు, స్వచ్ఛంద సంస్థలు యిచ్చిన వాటి కంటే తక్కువగా ఉండటాన్ని సిడా ప్రశ్నించింది. బాధితులయిన స్త్రీల గురించిన వివరాలు, ప్రత్యేకంగా లెక్కలు ఇవ్వాలని పదేపదే కోరినా ప్రభుత్వం ఇవ్వకపోవటంపై సిడా అసంతృప్తి వ్యక్తం చేసింది.

**2000** కేసులు గుజరాత్‌కు వెలుపల న్యాయ విచారణకు ఆదేశించిన న్యాయ వ్యవస్థ ప్రత్యేకించి సుప్రీం కోర్టు చొరవను ప్రస్తావించి భారత ప్రతినిధి బృందం జవాబు యిచ్చింది. అయినా సిడా అంగీకరించక పోవటంతో 4 వేల కేసుల్లో 67 కేసులు స్త్రీలపై జరిగిన హింస గురించని జవాబు చెప్పినా అది ఏరకం అయిన హింసో ప్రతినిధి బృందం వివరించలేదు.

విధుల్లో ఉన్నపుడు పోలీసులు, మిలిటరీ స్త్రీల విషయంలో అనుసరించాల్సిన సూత్రాలు చేయదగినవి చేయగూడనివి రూపొందించి తెలియచేసామని బృందం తెలిపింది. భారత మిలటరీ చరిత్ర స్వచ్ఛంగా ఉందని తెలిపింది. జస్టిస్ జీవన్ రెడ్డి కమిటీ సూచనలు బహిర్గత పరచకూడదంటూ వాటిని ప్రస్తావించక పోవటంతో పోలీసు మిలటరీ బలగాలు స్త్రీల విషయంలో ప్రవర్తించాల్సిన తీరులో వైరుధ్యం అనే అంశం పూర్తిగా ప్రక్కదారిపట్టింది. (ఈశాన్య రాష్ట్రాల్లోని గిరిజన ప్రాంతాల్లో మిలటరీ ప్రత్యేక హక్కుల వల్ల, స్త్రీలపై నిరంతరాయంగా హింససాగుతున్నది)

'సర్వశిక్ష అభియాన్'పై వచ్చిన విమర్శను బేఖాతరు చేసిన బృందం అది విజయం సాధించిందనీ, అనేక అదనపు తరగతి గదులు నిర్మించారని పేర్కొంది. బాలికలు చదువులో కొనసాగడంపై, చాలమంది మధ్యలోనే చదువు మానేయటంపై బృందం మౌనం వహించింది.

గిరిజన, దళిత బాలికల చదువుపై అడిగిన ప్రశ్నలకు సమాధానంగా బృందం వీరు ఉన్నత విద్యకు చేరలేక పోతున్నారని ఉన్నత విద్య వల్లనే సామాజిక స్థితిలో కొంతయినా మార్పుంటుందనీ అంగీకరించింది. ప్రాథమిక స్థాయిలో నమోదు శాతంపైనే ఉన్నత విద్యకు చేరే సంఖ్య ఆధారపడి ఉంటుందని ఒప్పుకుంది. నిర్బంధోచిత ప్రాథమిక విద్యను హక్కుగా చేయటంపై వివరణ ఇస్తూ, రాష్ట్ర ప్రభుత్వాలకు ముసాయిదా పంపినట్లు చెబుతూ సార్వత్రిక విద్య హక్కుపై దాట వేసింది మన బృందం.

పాకీపని వారి జీవితంపై సిడా ప్రత్యేక శ్రద్ధ చూసింది. అనేక పథకాల ద్వారా వారికి పునరావాసం, విముక్తి కల్పించాలని ప్రభుత్వం కృషి చేసినా పాకీవారు ఏ మాత్రం పరిశ్రమ చేయడానికి స్ఫూర్తి పొందని బృందం అనీ వారు చేసే పని తప్ప మరొకటి చేయడానికి వారికి ఆసక్తి లేదని మన బృందం చెప్పింది. భారీ ప్రాజెక్టుల వల్ల నిర్వాసితులవుతున్న గిరిజన, దళిత ప్రజల పునరావాసం గురించి వివరిస్తూ గిరిజనులు మైనారిటీలు కొన్ని ప్రాంతాలకు పరిమితం అయి నివసిస్తుండగా, దళితులు ప్రతిచోటా ఉన్నందు వలన వారు ఎక్కువగా బాధితులవుతున్నారని తెలిపింది.

పొదుపు, మహిళా స్వయం సహాయ బృందాల విజయంపై సిడా నిరాశను వ్యక్తీకరించింది. పేదల్లోకెల్లా, నిరుపేద మహిళలు ఈ బృందాల్లో భాగస్వాములుగా లేరని అంగీకరించిన భారత ప్రతినిధి బృందాలు స్త్రీలు ఆలోచించడానికి నిర్ణయాలు తీసుకోవడానికి సహకరిస్తున్నారన్నారు. దారిద్ర్య నిర్మూలన పొదుపు, రెంటినీ విడివిడిగా చూడాలన్నారు. సమావేశాలకు వచ్చి ఒకేచోట కూర్చొని చర్చించే క్రమశిక్షణను ఎస్.హెచ్.జిలు స్త్రీలకు నేర్పాయని చెప్పడంతో స్వచ్ఛంద సంస్థల ప్రతినిధులు ఈ కొత్త నిర్వచనంతో హతాసులయ్యారు.

**93** శాతం శ్రామికశక్తి అసంఘటిత రంగంలో ఉందని అంగీకరిస్తూనే ప్రపంచీకరణ ద్వారా జరిగే ఆర్థికాభివృద్ధి కొనసాగుతుందనీ, ప్రభుత్వరంగ సంస్థలను కుదించడం జరుగుతుందనీ తేల్చి చెప్పారు. దీని వలన మహిళా ఉద్యోగుల పరిస్థితి ఎలా ఉంటుందనేది గాని, ప్రభుత్వ ఉదారవాద ఆర్థిక విధానం స్త్రీలపై ఎలాంటి ప్రభావం చూపుతుందనే దాన్ని గురించి గాని భారత ప్రతినిధి బృందం నోరు విప్పలేరు.

విద్యపై జిడిపిలో 6 శాతం బడ్జెటు కేటాయిస్తామని 1995 బీజింగ్ సదస్సులో ప్రభుత్వం యిచ్చిన హామీ ఇంకా అమలులోకి రాలేదని సిడా ఎత్తి చూసింది. పార్లమెంట్‌లో అసెంబ్లీల్లో స్త్రీలకు 33% రిజర్వేషను ఇవ్వడానికి ప్రభుత్వం కట్టుబడి ఉందని అయితే అది ఎపుడు చట్టం అవుతుందో చెప్పలేమని బృందం అసహాయత వ్యక్తం చేసింది.

మొత్తం మీద సిడాను సంతృప్తి పరచడానికి పడికట్టు జవాబుల్తో కుస్తీలు పట్టిన ప్రభుత్వ ప్రతినిధి బృందం వ్యవహారంతో ప్రభుత్వానికి స్త్రీల విషయంలో నిబద్ధత లోపించిందని తేట తెల్లం అయ్యింది. స్త్రీల జీవితాల్లో గుణాత్మక మార్పు తీసుకురావడానికి ప్రభుత్వం కృషి చేస్తున్నదనే కనీస హామీని కూడా సిడాకు ప్రభుత్వం ఇవ్వలేక పోయింది.

*

# మహిళల హక్కులు - మానవ హక్కులు

మల్లాది సుబ్బమ్మ

ప్రకృతి పరిణామ క్రమంలో మానవజాతి ఉద్భవించింది. మనిషికి ఆలోచించే శక్తి వుంది. వివేచనా శక్తి వుంది. ఊహాశక్తి మనిషి ప్రత్యేకత. భాష, సాధనాల తయారీ వ్యక్తి నైపుణ్యతకు నిదర్శనాలు. ఇలా మానవజాతి తతిమ్మా జాతులకన్న భిన్నమైనది; విలక్షణమైనది. ప్రతి మనిషి జీవించాలని ఆశించడం సహజం. తమ ప్రాణాల్ని ఎవరూ హరించటానికి వీలు లేదు. దీనిని జీవించే హక్కు అంటారు. ఇది మానవులందరికి ఉన్న హక్కు. ఈ హక్కు స్త్రీలకు కూడా వుంది. "నా భార్యను నేను చంపుకుంటాను. నా ఇష్టం" అని ఏ పురుషుడైనా అంటే ఇరుగుపొరుగువారు వూరుకోరు. సమాజం అంగీకరించదు. చట్టం నిర్బంధిస్తుంది. ఏ మనిషిని అక్రమంగా తిట్టరాదు, కొట్టరాదు. ప్రతి మనిషికి హుందాతనం, ఆత్మగౌరవం వుంటాయి. అందువల్ల "ఏ పురుషుడు నా భార్యను నేను తిట్టుకుంటాను, కొట్టుకుంటాను" అనడానికి వీలు లేదు. ఎవరి సంపాదన మీద వారికే హక్కు వుండాలి. భార్య సంపాదన ఆమె సొంతం. భార్యాభర్తలు ఒక యూనిట్. భర్త సంపాదించినా, భార్య సంపాదించినా తమకు, తమ పిల్లలకు ముమ్ముందుగా ఖర్చు పెడతారు. కాబట్టి ఎవరు సంపాదిస్తున్నారని ప్రశ్న కాదు. అనుభవంలో కాస్త అస్తవ్యస్తం జరుగుతోంది. సాధారణంగా భర్త తన సంపాదనను గురించి భార్యకు లెక్క చెప్పడం లేదు. కాని భార్య విధిగా తన సంపాదనను భర్తకు లెక్కచెప్పవలసి వస్తుంది. సంపాదన మొత్తాన్ని భర్త చేతుల్లో పోసి సాదర ఖర్చులకు భర్తను ప్రాధేయపడవలసిన స్థితి కొన్ని కుటుంబాలలో ఇప్పటికీ కొనసాగుతుంది. సంపాదనను గురించి కుటుంబ అవసరాలను దృష్టిలో పెట్టుకుని స్త్రీ సంపాదన మీద ఆమెకున్న హక్కును గుర్తించటం అవసరం. దాని మీద ఆమెకు సర్వహక్కులు వుంటాయని గ్రహించాలి.

కుటుంబం ఏర్పడిన తరువాత పిల్లలు పుట్టుకొస్తారు. ఐతే పిల్లలను నవమాసాలు మోసి కనేది స్త్రీ కనుక ఎప్పుడు పిల్లలను కనాలి? ఎంతమందిని కనాలి? అనే విషయాలు ఆమె పరిధిలోకి రావటం న్యాయం. ఈ విషయంలో సాధారణంగా భార్యాభర్తలిద్దరూ సంప్రదించుకుంటారు. కాని కొన్ని కుటుంబాలలో ఈ సందర్భంగా భార్య ఇష్టా ఇష్టాలకు విలువ లేదు. మగపిల్లవాడి మీద మక్కువ కొద్ది మగబిడ్డను కనేదాకా ఆరుగురు ఆడపిల్లలని అయినా కనవలసిందేనని శాసించే భర్తలు లేకపోలేదు. పైగా ఆడపిల్లల్నే కనడం ఆమె తప్పిదంగా అదొక నేరంగా పరిగణించే భర్తలున్న దేశం మనది. ఆడ శిశువు పుట్టుకకు కారణం క్రోమోజోము అని, దానికి పురుషుడే కారణం అని గ్రహించని పురుషులున్నారు. తెలిసినా స్త్రీనే తిట్టటం సర్వసామాన్యం. కుటుంబంలో జరిగే ముఖ్యమైన నిర్ణయాలలో (డెసిషన్) భార్యను సంప్రదించే ప్రసక్తి లేదు. ఉదాహరణకు పొలం కొనడం, అమ్మడం, ధనాన్ని ఆదాచేయడం, ఇల్లు కట్టటం, పిల్లల పెళ్లి చేయడం మొదలగు విషయాలలో చాలామంది భర్తలు భార్యలతో మనసు విప్పి సంప్రదించరు, చర్చించరు. అందువల్ల కుటుంబంలో



భార్యది ద్వితీయ స్థానం అవుతోంది. వారిరువురు సమాన హోదాతో సంచరించటం లేదు. ఈ పరిస్థితి మారాలి. ఆమె కూడా ఒక వ్యక్తి, కుటుంబంలో ముఖ్య భాగస్వామి అనే భావన రావాలి. ఆమె హక్కులను ఇతరులు గుర్తించాలి.

1950లో భారత రాజ్యాంగంలో జెండర్ డిఫరెన్సు లేదని వ్రాసుకున్నాం. అయినా అన్ని రంగాలలో ఆడది తక్కువ అనే భావం విలయతాండం చేస్తోంది. ఈ చర్య మానవ హక్కుల ఉల్లంఘన అవుతుంది. స్త్రీ పురుషులు సమానులని ప్రకటిస్తే చాలదు. వారు సమానులుగా గుర్తించబడాలి. అనేక కుటుంబాలలో భార్య ఓటును ఎవరికి వెయ్యాలో భర్త నిర్ణయిస్తాడు. భర్తకు రెండు ఓట్లు యివ్వలేదు. వారిద్దరికి చెరొక ఓటును ఇచ్చింది. రాజ్యాంగం. భార్య ఓటు హక్కును భర్త హరించాడనేది జగద్విదితం.

స్త్రీల హక్కులు ప్రపంచమంతటా ఉల్లంఘింబడుతున్నాయనేది పచ్చి నిజం. దేశదేశాల నివేదికలు గమనిస్తే ప్రతి దేశంలో ప్రతి సమాజంలో స్త్రీలమీద పురుషుల హింస ద్యోతకమవుతుంది. అది తిట్టడం, కొట్టటం, అత్యాచారం, మానభంగం, క్రూరహింసల రూపంలో కనిపిస్తున్నది. భార్యలమీద, కుమార్తెలపై సోదరీలయెడ, కుటుంబ సభ్యులయిన స్త్రీలపట్ల ఇది ప్రదర్శితమవుతున్నది. ఈ హింస సర్వే సర్వత్ర ఉనికి కలిగి వున్నది. విస్తృతమయినది. మహిళల, బాలికల జీవితాలను, ఆరోగ్యాన్ని ఈ హింస నాశనం చేస్తున్నది. ఈ నివేదికలు సభ్య ప్రపంచాన్ని కలవరపరుస్తున్నాయి. శతాబ్దాల తరబడి మౌనం వహించిన మహిళలు ఎలుగెత్తి పలుకుతున్నారు. ఈ వాస్తవాలను వెలికితీస్తున్నారు. పురుషుల ప్రవర్తనలో మౌలిక మార్పు రావాలని డిమాండు చేస్తున్నారు. సమాజ భవనానికి కుటుంబం పునర్నిర్మాణం ప్రధానమయిన పునాది. హింసాయుత పితృస్వామ్య సమాజం స్థానంలో సమాన భాగస్వామ్య సమాజం ఉద్భవించాలని స్త్రీలు ఆకాంక్షిస్తున్నారు. కుటుంబంలో, సమాజంలో బాలుర, బాలికల పోషణ యొక్క విలువను, జీవితం యెడ శ్రద్ధా గౌరవాలను, పరస్పర సహాయ విధానాన్ని తెలుసుకోవాలని, తేడాలను గమనించాలని కోరుతున్నారు.

స్త్రీలు కూడా మానవులే కనుక మానవ హక్కుల నుండి మహిళల హక్కులు పుట్టాయి కనుక తమ హక్కుల గురించి మహిళలు ఎంత త్వరగా గుర్తిస్తే తమకు, సమాజానికి, దేశానికి అంత మంచిది. స్త్రీల హక్కులు మానవ హక్కులలో భాగం. మానవ సమాజంలో స్త్రీలు సగభాగం. కనుక మానవ హక్కులు వారికీ వర్తిస్తాయనేది నగ్నసత్యం. అసలు హక్కులు, బాధ్యతలు అనేవి బొమ్మాబొరుసు లాంటివి. బాధ్యతలను అంగీకరించకపోతే హక్కులు లేవు. హక్కులు లేనివారికి బాధ్యతలూ లేవు. 1776లో అమెరికన్ విప్లవంలో ఎలుగెత్తి చాటిన

అంశం ఇంగ్లాండ్ రాజుకు వ్యతిరేకంగా అమెరికన్ ప్రజలు కోరింది ప్రాతినిధ్యం లేనిదే పన్నులు చెల్లించ అవసరం లేదు అని. కాగా ఇన్ని శతాబ్దాల నుండి బాధ్యతలనే పేర్కొన్నారు. కనుక ఇప్పుడు హక్కుల విషయంపై నొక్కి చెప్పాల్సి వచ్చింది.

ప్రసవకాలంలో స్త్రీకి అవసరమైన విశ్రాంతిని అసరాగా తీసుకొని ఉత్పత్తి దూరం చేసి పురుషులు ఇంటి పనికి పరిమితం చేశారు. వేటాడే సమాజంలో, అరణ్యాలలో కాయగూరలను, పండ్లను, ధాన్యాలను ఏరుకునితినే రోజుల్లో స్త్రీ సామాజిక జీవితంలో ముఖ్యపాత్ర వహించింది. కాగా నాగలి వచ్చి పొలాలను దున్ని పైరులను వేసి పెంచే కాలానికి ఆమె స్థితి దిగజారిపోయింది. ఆమెను హీనస్థితికి చేర్చారు. దీనికి కారణాలు అనేకం. సంతానం తనది అని నమ్మటానికి ఆమెను తన స్వంతం చేసుకోవాలి అనే ఆలోచన కలిగింది భర్తకు. అందుకే ఆమెపై ఆంక్షలు అంటే సిగ్గు, లజ్జ, వినయం, అణకువ, భయభక్తులు అనేవి మంచి లక్షణాలుగా ఆమెకు బోధించసాగారు. ధర్మశాస్త్రాల ద్వారా అలా దిగజారిన నాటి మహిళ ఈనాటికీ రెండవ తరగతి పౌరురాలుగానే పరిగణించబడుతోంది. ఎన్నో కష్టాలుపడి, మరెన్నో త్యాగాలుచేసి ఆమె వారసత్వ హక్కులను పొందింది. 19వ శతాబ్దంలో న్యూజిలాండులో స్త్రీలకు ఓటుహక్కువస్తే, స్విట్జర్లాండు స్త్రీలకు 1976లో వచ్చింది. స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం నినాదాలుగా చెలరేగిన ఫ్రెంచి విప్లవంలో పాల్గొన్న ఫ్రెంచి స్త్రీలకు 1944లో ఓటు హక్కు వచ్చింది. బ్రిటిష్ స్త్రీలకు 1921లో ఓటుహక్కు వస్తే వారితోపాటు భారత స్త్రీలకు కూడా ఆ హక్కు వచ్చింది. ఏనాడూ వారు స్వతంత్రించి వారి ఓట్లను స్వేచ్ఛగా వేయలేదు. అసలు స్త్రీలను ఓట్లు అడగరు. "మీ ఇంట్లో వున్న ఓట్లు నాకే వేయించు రామయ్యా" అని అభ్యర్థి కోరతాడు. ఓటు హక్కును రాజ్యాంగం ఇచ్చింది కదా అని ప్రతివాదన చేసి లాభంలేదు. రాజ్యాంగం స్థిరపరచిన ప్రజాస్వామ్య హక్కును సమాజం తన ఆచరణ ద్వారా కాలరాస్తోంది. పురుషులకు 'ఓటుహక్కు, స్త్రీలకు ఓటును వినియోగించుకోలేని స్థితి కల్పించడం అసమానత ప్రదర్శన మాత్రమే.

స్వేచ్ఛ అంటే జంతుస్థాయి జీవితాన్ని గడపటానికి స్త్రీల, వెసులుబాటు అని అర్థం కాదు. ఆహార నిద్రామైథునాలు జంతువులకు, మానవులకూ ఒకటే కాకపోతే మానవుడు బుద్ధిజీవి ఆలోచించగలడు. తన భవిష్యత్తును తను దిద్దుకోగలడు. అసలు ఆనందం ఎలా లభిస్తుంది? ఈ పదాన్ని అమెరికన్ రాజ్యాంగంలో వాడారు. ప్రతి పౌరునికి జీవించడానికి, స్వేచ్ఛను పొందడానికి, ఆనందం అనుభవించటనికి హక్కు వున్నదని వ్రాశారు అమెరికన్లు. మనిషికి మనస్సు వుంది, ఆలోచన వుంది. కోరికలూ వున్నాయి. అంతేకాదు అవసరాలు కూడా వున్నాయి. అవి భౌతిక, శారీరక, మానసికమైన అవసరాలని, మరికొందరు సమైక్య అవసరాలని పేర్కొంటారు. అవి తీరితే కొంతలో కొంత ఆనందప్రాప్తి కలుగుతుంది. ఇవన్నీ ఒకసారి తీరవు. సమాజగతిని అనుసరించి క్రమక్రమంగా తీరుతాయి. స్వేచ్ఛ అన్నాకూడా మానవుని వ్యక్తి వికాసానికి అవరోధాలుగా వున్న వాటిని క్రమక్రమంగా తొలగించుకోవటమే.

స్వేచ్ఛ సమానత్వం, సౌభ్రాతృత్వం అనే నినాదాలపై 1789 ఫ్రెంచి విప్లవం సాగింది. 1917 నాటి రష్యన్ విప్లవం యొక్క ఇతర వైఖరులు లక్షణాలు మనకు అంగీకారమయినా, కాకపోయినా ఆ విప్లవం మానవుల ఆర్థిక అవసరాలను సమాజం దృష్టికి తెచ్చింది. భారతదేశంలో మౌలిక హక్కులుగా కొన్నింటిని పేర్కొని మరికొన్నింటిని ప్రభుత్వానికి ఆదేశిక సూత్రాలుగా వ్రాయడం జరిగింది. మౌలిక హక్కుల అమలుకు పౌరుడు కోర్టుకు వెళ్లవచ్చు. ఆదేశిక సూత్రాల అమలుకు ఆ సౌకర్యం లేదు. కాగా ఆదేశిక సూత్రాలకు భిన్నంగా, వ్యతిరేకంగా ప్రభుత్వాలు (కేంద్రంగాని, రాష్ట్రంగాని) ప్రవర్తిస్తుంటే వాటిని ప్రతి పౌరుడు న్యాయస్థానాల ద్వారా నిరోధించవచ్చును.

ఇంతకూ హక్కుల వరంగా స్త్రీలు కోరింది ఏమిటీ? అని ప్రశ్నిస్తే స్వేచ్ఛ, సమానత్వం, వివక్ష నిర్మూలన, మాతృత్వం విధి నిర్వహణ సందర్భంగా కొన్ని అదనపు సదుపాయాలు, వ్యక్తి వికాసానికి దోహదం చేసే అవకాశాలు అని నిర్దేశించవచ్చును. అసలు హక్కులు యాచించేవి కావు. ఒకరిచ్చేవి అంతకన్నా కావు. హక్కు అనేది జన్మతః వచ్చేది. యాచించేది ధర్మం, హక్కుల్ని అనుభవించగల శక్తి సామర్థ్యాలు స్త్రీలలో రావాలంటే వారి దృక్పథంలో మార్పు రావాలి. "చట్టాలకు కట్నాలు పోతాయా?" అన్నట్లు చట్టాల ద్వారా ఆర్డినెన్సుల ద్వారా స్త్రీల పరిస్థితిలో మార్పుతేవటం కష్టం. చట్టం అనేది కేవలం ఒక పనిముట్టు. అది కొంత రక్షణనిస్తుంది. మరి కొంత భయాన్ని కలిగిస్తుంది అంతే. కానీ మనలో దాస్యవిముక్తి రానంతకాలం, ఆత్మ విశ్వాసం లేనంతకాలం, శాస్త్రీయ ధృక్పథం పుంజుకోనంతకాలం మనల్ని రక్షించేవారూ వుండరు. కనుక స్త్రీలు సామాజిక కార్యక్రమాల విషయంలో ప్రేక్షకులుగా వుండరాదు. స్వేచ్ఛగా, చైతన్యం కల వ్యక్తులుగా, ఆర్థిక, రాజకీయ రంగాలలోకి చురుకుగా దూకాలి. తమ బానిసత్వ సంకెళ్లను తెంచుకోవాలంటే పాత ఆచారాలను, కట్టుబాట్లను అధిగమించాలి. దానికి ముందుగా వారి భావాలలో, ధృక్పథంలో మార్పు రావాలి. ఆనాడే స్త్రీ తనకున్న హక్కుల్నీ అనుభవించ గలుగుతుంది. తద్వారా కుటుంబానికి, సమాజానికి, దేశానికి నిజమైన శాంతి, అభ్యుదయం కలుగుతాయి. అసలు మానవ హక్కులు ఏ ఒక్క వ్యక్తికి, దేశానికి ప్రభుత్వానికి తమ అంతరంగిక అంశం కానేకాదు. దానికి ఎల్లలు లేవు. దేశ, కాల, హద్దుల పరిధిని అధిగమించి విశ్వ మానవులందరికీ సర్వకాలాల్లో చరణయోగ్యమై అమలు పర్చగలవే విశ్వమానవ హక్కులూ, హక్కులను చట్టాలలో పొందుపరచినా, ప్రభుత్వాలు హామీ యిచ్చినా ప్రజల్లో చైతన్యం లేకపోతే ప్రయోజనం శూన్యం. కనుక స్త్రీ పురుషులందరు వీటిని తెలుసుకోవడం, గౌరవించటం, ఆచరించటం ప్రచారం చేయటం తమ కర్తవ్యంగా భావించిననాడే హక్కులు అనుభవంలోకి వస్తాయి. ఆనాడే స్త్రీకి దాస్య విముక్తి లభిస్తుంది.

## హైకూలు

గోదావరి గలగలలు
విందామని పోతే
నదినిండా పరుచుకున్న
ప్లాస్టిక్ గ్లాసులు, ప్లేట్లు
కళ్లనిండా పరుచుకున్నాయి!

# అబ్బురపరిచే పురోభివృద్ధి

## చైనా పర్యటన - అనుభవాలు

చైనా కమ్యూనిస్టు పార్టీ (సిపిసి) ఆహ్వానం మేరకు అయిదుగురితో కూడిన సమియం ప్రతినిధుల బృందం ఇటీవల పది రోజులపాటు (ఆగస్టు 30–సెప్టెంబర్ 8) ఆ దేశంలో పర్యటించింది. ఈ బృందంలో నాతోబాటు పశ్చిమ బెంగాల్ హౌసింగ్ శాఖ మంత్రి గౌతమ్‌దేవ్ (టీమ్ లీడర్), పి.ఎ. అల్‌కుట్టి మహమ్మద్ (కేరళ), కె. బాలకృషన్ (తమిళనాడు), రావత్ విజయ్ (ఉత్తరప్రదేశ్) ఉన్నారు. చైనాలో వున్న పదిరోజులు అక్కడి అన్ని అంశాలను అధ్యయనం చేయడానికి ప్రయత్నించాము.

ఆగస్టు 30వ తేదీ రాత్రి 3 గంటలకు ఢిల్లీ నుండి షాంఘై బయలుదేరాము. షాంఘై చేరేసరికి భారతీయ కాలమానం ప్రకారం ఉదయం 10 గంటలైంది. కాని చైనా కాలమానం ప్రకారం అప్పటికి 12–30 గంటలైంది. అంటే మనకు, వాళ్లకు సమయంలో తేడా దాదాపు రెండున్నరగంటలు ఉందన్నమాట. షాంఘైలోని పూడాంగ్ అంతర్జాతీయ విమానాశ్రయం గురించి ఒక్క మాట చెప్పాలి. ఇది అత్యంత అధునాతన పద్ధతుల్లో సకల సదుపాయాలతో కేవలం రెండేళ్ల వ్యవధిలోనే నిర్మాణం పూర్తి చేసుకుంది. ఇక్కడి నుంచి "మాగ్నవేవ్" (ప్రపంచంలోనే అత్యంత వేగంగా వెళ్ళేరైలు)లో "ఫర్ ఎవర్" అనే సైకిల్స్ కంపెనీకి తీసుకెళ్ళారు. అది గంటకు 400 కి.మీ. వేగంతో దూసుకెళ్లడంతో రైలులో ప్రయాణిస్తున్నంతసేపు గాలిలో తేలియాడుతున్నట్లు అనిపించింది.



షాంఘై దేశంలోనే అతి పెద్ద ఆర్థిక, వ్యాపార, పారిశ్రామిక కేంద్రం. హూమాంగ్ నది ఈ నగరం మధ్య గుండా ప్రవహిస్తోంది. సముద్రం పక్కనే వున్నది. ఒకప్పుడు ఇది వ్యవసాయ భూమిగా వుండి, అనేక చిన్న గ్రామాలు వుండేవి. ఇప్పుడది ఒక మహా నగరం. ఈ నగర నిర్మాణమంతా 12 ఏళ్లలోనే జరిగిపోయింది. ఎటు చూసినా ఆకాశాన్నంటే అత్యంత ఆధునిక భవంతులు, పై వోవర్లు, సబ్‌వేలు, రింగ్ రోడ్లు, వంతెనలు, సొరంగమార్గాలు దర్శనమిస్తుంటాయి. ఇదొక చూడముచ్చటైన నగరం. ఈ నగర మొత్తం జనాభా 90 లక్షలు. నిర్మాణంలో వున్న కట్టడాల నుంచి దుమ్ము, ధూళి లాంటివి ఏవీ బయటకు రాకుండా పూర్తిగా ఆకుపచ్చని నెట్‌తో మూసి వేస్తున్నారు. ఫర్ ఎవ్వర్ సైకిల్ కంపెనీలో 2,500 మంది కార్మికులు పని చేస్తున్నారు. వీరిలో 20 శాతం మంది మహిళలే. చైనాలో సైకిళ్ల తయారీ కంపెనీలలో ఇది నెంబర్ వన్. ప్రతి యేటా తొమ్మిది కోట్ల సైకిళ్ళు ఉత్పత్తి చేస్తుంది. వీటిలో 95 శాతం వరకు చైనాలోనే వినియోగిస్తున్నారు. ఆ తరువాత ఓరియంటల్ పెరల్ టి.వి. టవర్, జియాంగ్స్ ప్రావిన్స్ రాజధాని నాన్‌జింగ్, నానోయిన్ కమ్యూనిటి రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్‌లను సందర్శించాము.

### నానోయిన్ కమ్యూనిటీ సెంటర్ విశిష్టత:

అన్ని వసతులతో ఏర్పాటైన నానోయిన్ కమ్యూనిటి భవనంలో సామాన్య ప్రజలకు అవసరమైన అన్నిరకాల సేవలు అందుతున్నాయి. బస్తీలలో ఎదురయ్యే పౌర సమస్యలతోపాటు ఇతర సమస్యలన్నిటిపైన ఇక్కడ ఫిర్యాదు చేయవచ్చు. కుటుంబ తగాదాలు తీర్చడానికి ఫ్యామిలీ కౌన్సిలింగ్ సెంటర్ ఉంది. పౌరులు ఉపయోగించుకునేందుకు ఈత కొలను, టెన్నిస్, క్యారమ్స్ లాంటి ఆట వస్తువులు, జిమ్.యోగా, వ్యాయామానికి అవసరమైన సదుపాయాలు అన్నీ ఉన్నాయి. ఇక్కడ పనిచేస్తున్న 30 మంది ఉద్యోగులలో 16 మంది మహిళలే. ఈ కమ్యూనిటీ సెంటర్ ఇటు ప్రజలకు, అటు ప్రభుత్వానికి మధ్య వారధిలా పనిచేస్తోంది. ప్రజలు తాము అనుసరిస్తున్న విధానాలపట్ల ఎలా స్పందిస్తున్నారో తెలుసుకోవడానికి ఇది ప్రభుత్వానికి ఎంతగానో ఉపయోగపడుతోంది. ప్రపంచంలో పెద్ద నదులలో ఒకటైన "యాంగ్జీ నది" నాన్‌జింగ్‌లోనే ఉంది. చైనాలో తయారు చేసే బొమ్మలు ప్రపంచ వ్యాప్తంగా ప్రసిద్ధి. ఇక్కడ పనిచేసే 800 మంది కార్మికులలో 90 శాతం మంది మహిళలే కావడం విశేషం. వాళ్ళ జీతం నెలకు 2000 యువాన్లు. మన కరెన్సీని రూపాయి అని పిలిచినట్లుగానే చైనీయులు తమ కరెన్సీని 'యువాన్' అని పిలుస్తారు. ఒక డాలర్‌కు సుమారుగా 7 యువాన్లు వచ్చేవి. మన కరెన్సీలో 6 రూపాయలు అయితే 1 యువాన్‌కు సమానం. వారానికి రెండు రోజులు సెలవులు.

మోటార్ బాడీస్ తయారు చేసే కంపెనీకి కూడా వెళ్ళాము. మోటార్ బాడీస్ కంపెనీలో మహిళలు అన్ని రకాలైన పనులు చేస్తూ కన్పించారు. జపాన్, జర్మనీ, ద.కొరియా లాంటి దేశాల నుండి పరిశ్రమలకు పెట్టుబడులొస్తున్నాయని అధికారులు చెప్పారు. చైనాకు సంబంధించిన కార్మిక చట్టాలు, నియమ నిబంధనలు అమలవుతాయి. ఇంతేకాకుండా కార్మిక సంఘాలు కూడా వున్నాయని అన్నారు. నాన్‌జింగ్ సిటీ ప్లానింగ్ మరియు కన్‌స్ట్రక్షన్ ఎగ్జిబిషన్ హాల్‌కు వెళ్ళాము. నాన్‌జింగ్ గతం, వర్తమానంతోపాటు భవిష్యత్తుకు సంబంధించిన 2020 నాటికి చేరుకోవాల్సిన లక్ష్యాలకు సంబంధించిన ప్లాన్ చూపించారు. పట్టణాభివృద్ధి అంతా ప్రణాళికా బద్ధంగా జరుగుతోంది.

నాన్‌జింగ్ చూశాక చుంకింగ్‌కు బయలుదేరాము. నాన్‌జింగ్ నుండి చుంకింగ్‌కు రెండు గంటలు ప్రయాణం. యంగ్‌జీ జాంగ్జీ నదుల సంగమ ప్రదేశం, జైఫింగ్‌బై కమర్షియల్ మార్కెటింగ్ సెంటర్‌లను చూశాం. ఏవైనా ఇంగ్లీష్ పుస్తకాలు దొరుకుతాయేమోనని పుస్తకాల షాప్‌కు వెళ్లాము. అన్నీ చైనీస్ భాషలోనే వున్నాయి. సాయంకాల వేళ జనసమ్మర్ధం ఎక్కువగా వున్న కొన్ని మార్కెట్లలో పాదచారులకు తప్పితే ఇతర వాహనాలు వేటికీ ప్రవేశం వుండదు. షాపింగ్‌కు వచ్చేవారు. చాలా ఉల్లాసంగా తిరుగుతున్నారు. చుంకింగ్‌లో ఈ సంవత్సరం వర్షాలు లేక పంటలు ఎండిపోయాయి. కరువు వచ్చినప్పుడు ప్రభుత్వం అనేక రాయితీలు, సబ్సిడీలు ప్రజలకు అందిస్తోంది.

గ్రామ పార్టీ ఆఫీసుకు వెళ్లినపుడు గ్రామ పార్టీ కమిటీ సభ్యులతోపాటు గెలిచిన గ్రామ కౌన్సిల్ సభ్యుల ఫోటోలు వున్నవి. చైనాలో ప్రతి రైతు ఇంట్లో 'మావో' ఫోటో వుంటుందని తెలిపారు. దేశం ఆర్థికాభివృద్ధి సాధించడమే ప్రధాన లక్ష్యంగా ముందుకు సాగితే బావుంటుందనే మాట వారితో జరిపే సంభాషణల్లో వ్యక్తమైంది. పట్టణాలకు వలస వెళ్ళేవారి సంఖ్య పెరుగుతోంది. తొమ్మిదో రోజున బీజింగ్‌కు చేరుకున్నాం 16,807 చ.కి.మీ వైశాల్యం కలిగిన బీజింగ్‌లో చిన్న, పెద్ద పరిశ్రమలు దాదాపు 22,000 వరకు వున్నాయి. బీజింగ్ నగర మెయిన్ సెంటర్ల రోడ్లన్నీ నాలుగు లైన్లతో తీర్చిదిద్దబడ్డాయి. రోడ్డుకు ఇరువైపుల నుండి సైకిళ్లకు ప్రత్యేక రహదారి ఏర్పాటు చేశారు. ప్రపంచంలోని ఏడు అద్భుతాలలో ఒకటైన "గ్రేట్‌వాల్ ఆఫ్ చైనా" చూడగలగడం నిజంగా ఒక అద్భుతం. దీనిని క్రీ.పూ. 221లో మొదలెట్టి అనేక సంవత్సరాల పాటు నిర్మించారట. ఈ మహాకుడ్యం మొత్తం పొడవు 600 కిలో మీటర్లు. రెండు సమాంతర గోడల మధ్య నడవడానికి వీలుగా మెట్లు ఉంటాయి. ఆనాటి చక్రవర్తులు తూర్పు వైపు నుండి వస్తున్న దండయాత్రల నుండి రక్షణ కోసం ఈ గోడను నిర్మించుకున్నారట. దారిలో మధ్య మధ్య బురుజులు ఉన్నాయి. ఎప్పుడు చూసినా వేలాది మంది పర్యాటకులతో ఇది కళకళలాడుతుంది.

మా ప్రతినిధి బృందం గౌరవార్థం ఏర్పాటు చేసిన విందులో చైనా ఉప మంత్రి "చెన్ పెన్ క్వియాంగ్" మాట్లాడుతూ "మత దేశ అవసరాలకుగుణంగా అనేక మార్పులు చేసుకుంటున్నామని వాటిని అధిగమిస్తూ ముందుకు వెళ్ళేందుకు ప్రణాళికలు రూపొందించుకుంటు న్నామని తెలిపారు. గ్రామీణ, పట్టణ ప్రాంతాల మధ్య పెరుగుతున్న అంతరాలు, గ్రామీణ ప్రజలకు విద్య, ఆరోగ్య వసతులను మరింతగా అందుబాటులోకి తెచ్చేందుకు గత సంవత్సరం బడ్జెట్‌లో కేటాయింపులు పెంచినట్లు చెప్పారు. 2 లక్షల మంది పట్టభద్రులైన యువకులకు ప్రత్యేకమైన శిక్షణ ఇచ్చి గ్రామాలకు పంపుతున్నామని చెప్పారు.

భారతదేశంలో సిపియం ఎదుగుతున్న పరిస్థితి తమను అబ్బుర పరుస్తోందని, ముఖ్యంగా బెంగాల్‌లో నిరాఘాటంగా 30సం॥లు అధికారంలోకి రావడానికి కారణం, ప్రజలకు అందించే సౌకర్యాలు, సంక్షేమ పథకాల గురించి తెలుసుకోవడానికి చాలా ఉత్సుకత చూపారు. టీమ్ కన్వీనర్‌గా ఉన్న మంత్రి గౌతం దేవ్ బెంగాల్లో అమలు జరిపిన భూ సంస్కరణలు, కౌల్దారి రక్షణ చట్టం, ఉద్యోగుల, కార్మికుల పరిరక్షణ చట్టాలు, అనుసరిస్తున్న ప్రజానుకూల విధానాలతో పాటు కేంద్రంలో వామపక్షాలు నిర్వహిస్తున్న పాత్ర గురించి వారికి వివరించారు. ఈ మధ్య కాలంలో సామాన్య ప్రజలకు కావలసిన విద్య, ఆరోగ్యం, ఇల్లు అందకుండా పోయే పరిస్థితులు తలెత్తుతున్నాయని, అందుకనే రాబోయే కాలంలో వీటిపై కేంద్రీకరిస్తామని చెప్పారు. ఏది ఏమైనా సోషలిస్టు వ్యవస్థ పరిరక్షణనే తమ అంతిమ లక్ష్యమని చెప్పారు. చివరి రోజున చైనా విప్లవ సారథులలో ఒకరైన ''మావో-సే-టుంగ్'' మసోలియంను దర్శించుకున్నాము. ఉదయం 9 గంటలకు సందర్శకుల కోసం తెరిచారు. అప్పటికే వేలాది మంది బారులు తీరి నిల్చొన్నారు.

మనకన్నా రెండేళ్లు ఆలస్యంగా "పీపుల్స్ రిపబ్లిక్ ఆఫ్ చైనా" అవతరించినప్పటికీ అభివృద్ధిలో మనకు అందనంత ఉన్నత స్థితికి చేరుకుంది. జనాభా పరంగా ప్రపంచంలోనే అతి పెద్ద దేశమైన చైనా తన మానవ వనరులను సమర్థవంతంగా వినియోగించుకుని గత కొన్నేళ్లుగా పది శాతానికి పైగా అభివృద్ధి రేటుతో ముందుకు సాగుతోంది. చైనాలో భూమిపై ఆధిపత్యం ప్రభుత్వానిదే. వ్యక్తులకు వ్యక్తిగతంగా భూమి అమ్మడానికి కొనడానికి వీలు లేదు. ప్రభుత్వం దగ్గర నుండి లీజుకు తీసుకునే అవకాశం వుంది. గ్రామంలో ఎన్నికైన గ్రామ కౌన్సిల్ భూమిని లీజు కివ్వడంలో ప్రధాన పాత్ర వహిస్తుంది. కార్మికుడి కనీస వేతనం 700-1000 యువాన్ల వరకు ఉంది. నిత్యావసర వస్తువుల ధరలు పరిశీలిస్తే ఒక భార్య, భర్త ఉన్న కుటుంబానికి నెలకు సరిపోయే నిత్యావసర వస్తువుల కొనుగోలుకు 400 యువాన్లు సరిపోతాయి. మంసాహారం, పండ్లు, బియ్యం ఆకు కూరలు కూడా అందుబాటులోనే వున్నాయి.

## మహిళల స్థితి గతులు:

చైనాలో పర్యటించిన 10 రోజులు వివిధ రంగాలలో మహిళల స్థితి గతులను పరిశీలించాము. సైకిల్ కంపెనీ, ఆటో మొబైల్, మోటారు బాడి, పట్టు పరిశ్రమ, బొమ్మల కంపెనీల్లో ఉద్యోగులుగా, అధికారులుగా, ప్రజాప్రతినిధులుగా అన్ని రంగాల్లోనూ మహిళలు రాణిస్తున్నారు. ఫ్యూడల్ సాంప్రదాయ తిరోగమన బంధాల నుండి మహిళలను బయటకు తీసుకు రావడానికి, వివక్ష, హింస రూపుమాపడానికి, అన్ని రంగాలలోను వారిని ప్రోత్సహించడానికి చైనా ప్రభుత్వం చాలా కృషి చేసింది. వరకట్న సమస్య లేదని, కుటుంబాలలో జరిగే బారసాల, పెళ్లిళ్లు లాంటి వేడుకలు చాలా నిరాడంబరంగా జరుగుతాయని చెప్పారు. బారసాలకు పదిమంది వరకు హాజరయితే పెళ్ళిళ్ళకు 100 మంది లోపునే హాజరవుతున్నారని చెప్పారు. నేడు మహిళలు అన్ని రంగాలలో సమాన అవకాశాలు పొందుతున్నారు. అయితే ఫ్యూడల్ ఆటంకాలు, లోపాలు వున్నా మొత్తం మీద చూసినప్పుడు చైనా సోషలిస్టు ప్రభుత్వం మహిళల అభివృద్ధికి బాసటగా నిలిచిందని చెప్పవచ్చు.

## జనాభా నియంత్రణా విధానం:

చైనాలో జనాభా నియంత్రణా విధానం పటిష్ఠంగానే అమలు జరగుతోంది. గ్రామాలకు వెళ్ళినప్పుడు ఈ విధానాన్ని ఉల్లంఘించినవారు చెల్లించవలసిన పెనాల్టీ వివరాలతో కూడిన బోర్డులు కన్పించాయి. కాని ఇప్పుడు జనాభా వృద్ధి రేటులో నిలకడ వచ్చిందని, మైనార్టీల మత సంబంధమైన సెంటిమెంట్లు వున్న వారికి కొంత సడలింపు మరియు తల్లిదండ్రులు ఒక్కరే సంతానమై, వధువరులు కూడా ఒక్కరే సంతానమైతే వారికి కొంత సడలింపు కల్పిస్తున్నామని చైనా అధికారి ఒకరు చెప్పారు. 2008లో ఒలంపిక్స్‌కు ఆతిధ్యం ఇవ్వనున్న చైనా అందుకవసరమైన సన్నాహాలను శరవేగంతో సాగిస్తోంది. బీజింగ్‌ను సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దుతోంది.

ప్రజల అవసరాలను దృష్టిలో ఉంచుకొని అనేక మార్పులు చేర్పులతో ముందుకు సాగుతున్న చైనా, దేశంలో అత్యధిక ప్రజానీకానికి అభివృద్ధి ఫలాలను అందజేస్తూ సోషలిజం నిర్మాణ దిశగా ముందుకు సాగడం ముదావహం. ❋



# మాత సావిత్రిబాయి ఫూలే జీవితం-ఆదర్శం-ఆచరణీయం



- సందెవేని తిరుపతి (రిసేర్చ్ స్కాలర్, కె.యు)

సలవాది సోమలింగం (రిసేర్చ్ స్కాలర్, కె.యు)



భారత ఇతిహాసాలలోని ఎవరి పేరు చెప్పగానే మనలో ఒకరకమైన గౌరవభావం కలుగుతుందో, అలాగే కేవలం ఒక్క స్త్రీకే కాకుండా మొత్తం "స్త్రీ జాతికే వన్నెతెచ్చిన రత్నం". భార్యభర్తల అనుబంధానికి చావైనా భయపడాల్సిందే అని నిరూపించిన "సావిత్రి" పేరుతో, ఆధునిక భారతదేశం అన్ని రంగాలలోను వెనుకబడి నిద్రాణమై భారతజాతి యావత్తు మూడనమ్మకాలతో, అంధవిశ్వాసాలతో, అజ్ఞానంతో, అంటరానితనంతో, అమానుష లింగవర్గ భేదాలతో కుళ్ళు కంపుకొడుతున్న తరుణంలో, వాటి నుండి జాతిని మేల్కొలిపి విముక్తి చేయడానికి పురుషులు సయితం వెనకడుగువేసే రోజులలో, సంస్కరణోద్యమ పోరాటంలో తన జీవితాన్ని సయితం సమిధగా అర్పించిన గొప్ప వ్యక్తి "సావిత్రిబాయి ఫూలే".

**బాల్యం:** ఈమె మహరాష్ట్రలోని సతారజిల్లా నైగావ్ అనే గ్రామంలో 1831లో జన్మించింది. నాటి సమాజ ఆచారాల ప్రకారం తొమ్మిది సంవత్సరాల వయస్సులోనే 1840లో జ్యోతిరావుబాఫూలేతో వివాహం జరిగింది. అయితే బాల్య వివాహమే అయినప్పటికిని అది ఆమె జీవిత గమనాన్నే మార్చివేసింది. అప్పటికే సమాజంలో కులవ్యవస్థపై, సాంఘిక దురాచారాలపై పోరుసాగిస్తున్న ఫూలేగారికి కుటుంబ వ్యవస్థలో మార్పువస్తేగాని, సమాజంలో మార్పురాదనే ఉద్దేశంతో, మొదలు కుటుంబాన్ని నడిపే వ్యక్తి అయిన స్త్రీ విద్యావంతురాలైతే ఆ కుటుంబం, తద్వారా సమాజంలో మార్పు వస్తుందని తలంచాడు. దీని కోసం ముందుగా నిరక్షరాస్యురాలైన సావిత్రి బాఫూలేను అక్షరాస్యురాలిగా తీర్చిదిద్దాడు.

**దేశంలో తొలి మహిళ పాఠశాల:** ఫూలే నవభారత సామాజిక సంస్కరణోద్యమ పితామహుడు. ఆయన లక్ష్యాలతో ఆశయాలతో రూపుదిద్దుకున్న తొలి పరిపూర్ణ కమలం సావిత్రి బాఫూలే. దేశంలో ముఖ్యంగా వెనుకబడిన కులాల్లోని అజ్ఞానాన్ని, అంధకారాన్ని పారద్రోలుటకు స్త్రీ విద్యకోసం కార్వే మహాశయుని కంటే ముందే ఆగస్టు 1848లో తొలి మహిళా పాఠశాలను స్థాపించారు. ఈ స్త్రీల పాఠశాలలో తన భార్యనే ఉపాధ్యాయురాలిగా నియమించారు. ఈమె భారతదేశంలోని తొలి మహిళా ఉపాధ్యాయురాలు. కాని సమాజంలోని కుల పెద్దరికం అయితేనేమి, సంప్రదాయకట్టుబాట్లు అయితేనేమి, ఆమె ముందరి కాళ్ళకు బంధం వేయాలని చూసాయి. అయినా వెరవక ఆమె మొక్కవోని ధైర్యంతో ముందుకుసాగింది. కొన్ని సార్లు పాఠశాల నుండి బయటికి వస్తుంటే ఆమెపై "పేడనీళ్ళు" చల్లి కుహన సంప్రదాయ స్త్రీలు తమకసిని తీర్చుకునేవారు. ఎన్నో సందర్భాలలో ఆమె మొహం పైనే ఛీ! కొట్టడం, ఛీత్కారాలు చేయడం జరిగేవి. వీటికి తోడు సమాజ కట్టుబాట్లకు భయపడిన ఫూలే తండ్రి వీరిద్దరిని ఇంటి నుండి బయటకు పంపించి వేయడం జరిగింది. అయినా వీరిద్దరు వెనుకడుగు వేయకుండా సంస్కరణోద్యమంలోనే ముందుకు సాగారు.

**తొలి దళిత మహిళా పాఠశాల:** వీరిద్దరు సమానంగా సామాజిక ఉద్యమాలలో పాలుపంచుకుంటూ, జూలై 3, 1851న తొలి దళిత స్త్రీ పాఠశాలను ఏర్పరిచారు. నాటికి సమాజంలో విద్యపై అంతగా సదవగాహనే లేదు, అలాంటిది స్త్రీ విద్య గురించి అందులో దళిత స్త్రీ విద్య గురించి అడిగితే ఎలాగుంటుందో వేరుగ చెప్పనవసరమేలేదు. స్త్రీలను పాఠశాలకు రప్పించుటకై ఇంటింటా తిరిగి తల్లిదండ్రులను ఒప్పించి పిలల్ని బడిలో చేర్పించేవారు. దానిలో చదువుకున్నవారు మిగతా స్త్రీలకంటే కొంత సామాజిక స్పృహతో ముందుండేవారు. అలాంటి పాఠశాలలో నుండి బయటకు వచ్చి గొప్ప విద్యావేత్తలుగా, రచయితలుగా మారిన తొలితరం విద్యార్థులు ముక్తాబాయి, తారాబాయి షిండేలు మహారాష్ట్రలో గొప్ప పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్నారు.

**తొలి అనాథ శరణాలయం:** తరువాత కొంత కాలానికి 1851-52లలో ఇతర అంటరాని కులాలు అయిన శూద్ర కులాల కోసం ప్రత్యేక పాఠశాలలను ప్రారంభించారు. అనంతరం అనాథ పిల్లల కోసం అనాథ శరణాలయాన్ని కూడా ఏర్పాటు చేయడం జరిగింది. వీరింట్లో వారానికి ఒక్కసారి విద్యార్థులందరికి సహపంక్తి భోజనాలు ఏర్పాటు చేసేవారు. తరువాత వీరు తమకుటుంబ అవసరాలకు వాడుకునే మంచీనీటి బావిని సయితం 1866వ సంవత్సరంలో అంటరానివారు వాడుకునేట్లుగా ఏర్పాటు చేశారు. దీనితో ఈ దంపతులు సమాజ బహిష్కరణకు కూడా గురైనారు.

**ఇతర ఉద్యమాలు:** ఏ ఉద్యమాన్ని నడిపినా భర్తకు తోడుగా నిలిచే భార్యగా, ఆదర్శగృహిణిగా నిలిచింది. ముఖ్యంగా బాఫూలే నడిపిన సత్యశోధక్ సమాజ ఉద్యమంలో, కార్మిక ఉద్యమాలలో, మూఢనమ్మకాల నిర్మూలన ఉద్యమంలో, సాంఘిక దురాచారాల వ్యతిరేక ఉద్యమాలలోనైన తనవంతు బాధ్యత నిర్వహించింది. నిజానికి

ఏ ఉద్యమంలోనైనా వీరు ఇరువురిని విడదీసి చూడడం సాధ్యం కాదనేది వాస్తవం.

**కుటుంబ జీవితం:** ఎప్పుడు ఉద్యమాల, సంస్కరణోద్యమాల పేరుతో జాతి యావత్తును తమ సంతానంగా భావించే వీరికి నిజంగా భగవంతుడు సంతానం ప్రసాదించలేకపోయాడు. 1873లో వీరు ఒక అనాథ శిశువును దత్తత తీసుకొని తమ కుమారునిగా పెంచి పెద్ద చేశారు. ప్రతి స్త్రీ జీవితంలోనే గొప్పగా భావించే అమ్మతనం గురించి ఏ రోజు కూడా బాధపడకుండా ఆమె సమాజ సేవలో మమేకమయ్యారు.

**రచయితగా:** సావిత్రీబాయి ఫూలే విద్యావేత్తగానే గాక కవయిత్రి మరియు రచయిత్రి, ఈమె 1854వ సంవత్సరంలో తన 41 కవితల సంకలనాన్ని "కావ్యఫూల్" అనే పేరుతో పుస్తకరూపంలో ముద్రింపజేసింది. "భావన్‌కాషి సుబోధ రత్నాకర్" (రత్నసాగర్) అనే పేరుతో జ్యోతిరావు బాఫూలే జీవిత చరిత్రను రచించి ప్రచురింపచేసింది. అలాగే జ్యోతి బాఫూలే ప్రసంగాలను తన సంపాదకత్వంలో ముద్రింపచేసింది. తాను చేసిన ప్రసంగాల సంపుటిని పుస్తకరూపంలో 1892లో విడుదల చేసింది.

సావిత్రిబాయి, ఫూలేగారి మరణానంతరం "సత్యశోధక్" సమాజాన్ని నిర్వహిస్తూ సమాజ సేవ చేసింది. అతని తర్వాత అతని వారసురాలిగా సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా, సామాజిక ఉద్యమంలో భాగంగా ఫూలే ఆశయాల్ని కొనసాగించింది. సమాజ సేవలోనే చివరి వరకు జీవితాన్ని గడిపి తన 66వ యేట 1897లో ఈ ప్రపంచాన్ని విడిచివెళ్ళారు.

ముఖ్యంగా మనదేశంలో 150 సంవత్సరాల క్రింద సమాజ సాంప్రదాయ కట్టుబాట్లను ఛేదించి భర్తతో సహా ప్రతి ఉద్యమంలో భాగస్వామ్యం అవుతూ, తొలి మహిళా ఉపాధ్యాయురాలిగా, ఆధునిక భారత తొలి సంఘ సంస్కర్తగా పనిచేసి, నేటితరం మహిళలకు ఆదర్శ ప్రాయురాలిగా నిలిచింది. ఏది ఏమైనప్పటికి ఆనాడు ఏ విషయాల కోసం సావిత్రిబాయి ఫూలే పోరాటం గావించిందో అవే విషయాలు మారిన సమాజంలో తన రూపురేఖలు మార్చుకొని ఇంకా కొనసాగుతూనే ఉన్నాయి. మరి సావిత్రిబాయి ఫూలే ఆశయాల్ని నిలబెట్టే మహిళ కోసం మనం వేచి చూడాల్సిందేనా? ఒక్కసారి మహిళా లోకం ఆలోచించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

## హైకూ ..........

పొలిమేర్లకి
ఎప్పుడో రెక్కలొచ్చాయి...
ఇప్పుడక్కడ
డబ్బువాసనే తప్ప
పైరుగాలి లేదు!

## డియర్ మానవి.

మహిళా చట్టాలను పటిష్ఠంగా అమలు చేయటానికి ఎటువంటి చర్యలు తీసుకోదుకాని మహిళలపై హింసను పెంచటానికి హింసా రాముళ్ళకు బహు చక్కని నిర్వచనాలను ఇచ్చి మహిళలపై హింసను ప్రేరేపించే విధంగా తీర్పునిచ్చింది సుప్రీం కోర్టు. వరకట్న నిషేధ చట్టం వచ్చి 45 సంవత్సరాలు గడుస్తున్నా వరకట్న వేధింపులు, హత్యల కేసులు నమోదవుతున్నాయి. నమోదయిన వాటికి దిక్కు దివాణం లేకుండా సంవత్సరాల తరబడి జాప్యం చేస్తున్నాయి కోర్టులు. ఈ పెట్టుబడిదారీ వ్యవస్థలో కోర్టులు కూడా భ్రష్టు పడుతున్నాయనటానికి అప్పా సాహెబ్ కేసు తీర్పు చూస్తేనే తేటతెల్లమవుతుంది. వరకట్న వేధింపులు, మరణం కేసులో అప్పా సాహెబ్‌కు ఏడు సంవత్సరాలు కఠిన కారాగార శిక్ష విధిస్తే హైకోర్టు ఈ తీర్పును సమర్థించింది. సుప్రీం కోర్టు మాత్రం వివాహానంతరం డబ్బు కోసం గృహ, ఆర్థిక ఇబ్బందులు తీర్చుకోవటానికి డబ్బు అడగవచ్చు. అది వరకట్నం కిందకు రాదు అని భాష్యం వల్లించి తీర్పునిచ్చింది. దిగువ కోర్టు ఇచ్చిన తీర్పును ఎగువ కోర్టులు తోసిపుచ్చే అధికారం వుంది కదా అని హింసను పెంచే తీర్పులు ఇవ్వటం సబబా? పురుషాధిపత్యంతో నిండిన ఈ సమాజంలో స్త్రీలపై హింస పెరిగిపోతుందని ప్రభుత్వ గణాంకాలే లెక్కలతో సహా చూపిస్తుంటే సుప్రీం కోర్టు ఇటువంటి నిర్వచనాలతో తీర్పునివ్వటం విచారించవలసిన విషయం. కట్న పిశాచులకు ఈ తీర్పు కొత్త రెక్కలిచ్చినట్లే!

గృహ హింస నిరోధక చట్టం వచ్చిందని మహిళలు కాస్త ఊపిరి పీల్చుకున్నారో లేదో సుప్రీం కోర్టు పిడుగుపాటి తీర్పుతో మహిళల్లో ఆందోళన రేకెత్తించింది. పెళ్ళి తరువాత అత్తమామల నుండి వస్తు, ధన రూపంలో కోరవచ్చు అని తీర్పునిచ్చింది సుప్రీం కోర్టు. వివాహమాడిన భార్యను పోషించలేని, తన సుఖ సౌఖ్యాలకు అత్త మామలను అర్థించే వాడికి పెళ్ళి ఎందుకు? పెటాకులెందుకనే విషయం సుప్రీం కోర్టుకు జ్ఞప్తికి రాలేదా? హింసను పెంచే నిర్వచనంతో కోర్టు తీర్పునిచ్చిందని అప్పా సాహెబ్ కేసు తీర్పుకు వ్యతిరేకంగా అఖిల బారత ప్రజాతంత్ర మహిళా సంఘం (ఐద్వా) పిటిషన్ దాఖలు చేసింది. ఇటువంటి తీర్పులు పునరావృతం కాకుండా తక్షణమే ఈ తీర్పుపై సమీక్ష జరిపి తీర్పును రద్దు చేయాలని మహిళలంతా ఐక్యంగా ఆందోళనలు చేస్తే తప్ప దీనిపై కదలికరాదు. "చూస్తూ పోతే, మేస్తూ పోయిందనే" సామెతలా ఈ తీర్పు విషయంలో ఏ మాత్రం అలసత్వం వహించినా ఇటువంటి తీర్పులే పునరావృతమవుతాయి. మహిళలంతా ఏకధాటిగా పోరాటం సాగించాలి. లేదంటే కట్న పిశాచి కోరల్లో అనేక మంది అమాయక మహిళలు బలయ్యే అవకాశం వుంది.

- బి. వేణు కుమారి

# అందరికీ ఆరోగ్యం - అందని చందమామేనా!

డా॥ వి. ప్రభావతి

1978లో ప్రపంచ ఆరోగ్య సంస్థ ఆధ్వర్యంలో అల్మా ఆటలో జరిగిన సభలో తమ దేశాల ప్రజలందరికి 2000 సం॥ల కల్లా సంపూర్ణ ఆరోగ్యాన్ని అందజేస్తామని ప్రపంచ దేశాలు ప్రకటించాయి. అందులో మన భారత దేశం కూడా వుంది. ఆ దిశగా కార్యక్రమాలు చేపట్టాయి కూడా. తత్ఫలితంగా మలేరియా, క్షయ, న్యుమోనియా, టైఫాయిడ్, కలరా, ఫైలేరియా లాంటి జబ్బులు తగ్గాయి. సగటు ఆయుర్దాయం పెరిగింది. శిశు మరణాలు రేటు, బాలింత మరణాల రేటు కొంత తగ్గింది. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల సెంటరుగా ఆరోగ్య పరిరక్షణ వుండటంతో పైవన్నీ సాధ్యపడినాయి. 1980 వరకూ ఆ రకంగా సాధ్యపడిన ఆరోగ్య రంగ అభివృద్ధి ఎనభయవ దశకం తర్వాత అంతర్జాతీయంగా సంభవించిన పెనుమార్పులకు లోనై కుంటుపడసాగింది. వరల్డ్ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్య నిధి సంస్థలు పరోక్షంగా, ప్రత్యక్షంగా రూపొందించిన విధానాలకు లోబడి భారత ప్రభుత్వం కూడా మన దేశంలో అనేక రంగాల్లో మార్పు చేసింది. ముఖ్యంగా ఆరోగ్య రంగ పాలసీ ప్రజారోగ్యం మీద పెద్ద ఎత్తున దుష్ప్రభావాన్ని కలుగచేసింది. పెరిగిన పేదరికం, ఉపాధి, కరువు ముఖ్యంగా గ్రామీణ మహిళల మీద భారాన్ని మోపాయి. అంతకు ముందు గంటలోపల సంపాదించుకోగలిగే ఆహారాన్ని ఇప్పుడు 3 గం॥లు కష్టపడితేనే గానీ సంపాదించుకోలేని పరిస్థితి వుందని ఒక అధ్యయనం తెలిపింది. తలసరి ఆహార వినియోగం 1991లో 178 కిలోలుండగా 2004 కల్లా 154 కిలోలలకు తగ్గింది. వింతల్లో వింత - భారత దేశం విదేశాల్లో జంతువుల ఆహారంగా మన ఆహార ధాన్యల్ని ఎగుమతి చేస్తోంది. 1983లో రూపొందిన జాతీయ ఆరోగ్య విధానంలో శిశు మరణాల రేటును వెయ్యికి 60 కన్నా తగ్గించాలని నిర్దేశించుకున్నారు. 2006 వసం॥ నాటికి కూడా శిశు మరణాల రేటు వెయ్యికి 67 వుంది. ప్రపంచీకరణ, సరళీకృత ఆర్థిక విధానాల మూలంగా ప్రభుత్వ రంగంలో ఆరోగ్యం అనారోగ్యం పాలయ్యింది. ఒకప్పుడు అన్ని అంటువ్యాధుల్ని మట్టికరిపించిన ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు నేడు వసతుల, సిబ్బంది కొరతతో విలవిల్లాడుతూ కేవలం ట్యూబెక్టమీ, వ్యాసెక్టమీ కోతల కేంద్రాలుగా మారిపోయినాయి. ప్రజారోగ్యం భావననే మరిచిపోయినాయి. దీంతో ఎన్నడూ లేనంతగా అంటువ్యాధులు తిరిగి విజృంభించాయి. డెంగ్యు, చికున్ గున్యాలు ప్రజల్ని వణికిస్తుంటే మట్టికరిచిన మలేరియా మళ్ళీ విశ్వరూపం చూపిస్తోంది. హెచ్ఐవి, ఎయిడ్స్ ప్రపంచీకరణలో భాగంగా దిగుమతి చేయబడ్డాయి. హెచ్ఐవి మహమ్మారి మళ్ళీ క్షయవ్యాధికి వూపిరిపోసి ప్రాణాల్ని బలిగొంటోంది. ఫ్లోరోసిస్ వ్యాధి యవ్వన వంతుల్ని కూడా పసిపిల్లల్లా పారాడిస్తోంది. ప్రజారోగ్యం గాలిలో దీపమైంది. 1986-87లో ప్రైవేటు ఆసుపత్రులనాశ్రయించినవారు 40% వుంటే 1995-96 55% నుండి 57% వున్నారు. ప్రభుత్వాసుపత్రులను నమ్మలేక ప్రైవేటు ఆసుపత్రుల్లో వైద్యాన్ని భరించలేక గ్రామీణ ప్రజలు అప్పులపాలై ఆత్మహత్యలు చేసుకుంటున్న పరిస్థితి. బిపిఎల్ క్రిందకు నెట్టబడదానికి ఉపాధి, కరువు ఒకప్పటి కారణమైతే నేడు వైద్య ఖర్చులు కారణం కావడం ప్రభుత్వాలు సిగ్గుబడాల్సిన విషయం. "మహాన్ మేరా భారత్"లో మకాన్ లేని పేదవర్గం బ్రతుకుల్ని ఛిద్రం చేసే పాలసీల మూలాల్ని మార్చి వారి బ్రతుకుల్ని వెలిగించాల్సిన రాజకీయాలు కావల్సిన తరుణమిది. విస్తు పోవాల్సిన అంశాలేమిటంటే ఎటువంటి వైద్య సౌకర్యాన్ని పొందలేని ప్రజల శాతం యింకా 15 నుండి 24% వుంది.

1983 నేషనల్ హెల్త్ పాలసీ ప్రసూతి మరణాల రేటును లక్షకు 200 కన్నా తక్కువ వుండాలని నిర్దేశించింది. కానీ యిప్పటికీ లక్షకు 407 ప్రసూతి మరణాలు నమోదవుతున్నాయి. మన ప్రక్కనే ఉన్న శ్రీలంక లాంటి చిన్న దేశం కూడా ప్రసూతి మరణాల రేటు లక్షకు 77కు తగ్గించుకోగలిగింది. అతి పెద్ద జనాభా కలిగిన దేశమైన చైనా కూడా ప్రసూతి మరణాల రేటు లక్షకు 80 వుంది. నేషనల్ ఫ్యామిలీ హెల్త్ సర్వే ప్రకారం మన దేశంలోని కొన్ని ప్రాంతాల్లో ఈ ప్రసూతి మరణాలు ఇంకా పెరిగి లక్షకు 540 దాకా నమోదవుతున్నాయి. కేవలం కొన్ని మౌలిక సదుపాయాలు కల్పించటం (ఉదా: ఎమర్జెన్సీ ప్రసూతి సేవలు, నిపుణులతో ప్రసూతి సేవలు చేయించటం, ఆసుపత్రుల్లోనే డెలివరీ కావడం, రవాణా సౌకర్యాలు మెరుగుపరచటం, బ్లడ్ బ్యాంకుల్ని ఏర్పాటు చేయడం వంటివి) ద్వారా సంవత్సరానికి అన్యాయంగా మరణిస్తున్న దాదాపు లక్షా ముప్పైవేలమంది తల్లుల్ని మాతృత్వపు మధురిమలో ఓలలాడించవచ్చు. స్థూల జాతీయోత్పత్తిలో ఆరోగ్యానికి కేటాయించిన



నిధులు ప్రస్తుతమున్న 0.9%. (ప్రపంచదేశాలన్నింటికన్నా తక్కువ) గనుక 2% కైనా పెంచగలిగితే అందరికీ ఆరోగ్యం నినాదం దరిదాపుల్లో వుండగలం అనేది కొంత మేరకైనా సాధ్యమే అంటున్నారు. నిపుణులు. అలాగే మొత్తం ఆరోగ్య వ్యయంలో ప్రభుత్వాలు ఖర్చు చేస్తున్న శాతం ఈ క్రింది పట్టికలో చూడవచ్చు.

| | |
|---|---|
| అమెరికా | 44% |
| ఫ్రాన్స్ | 76% |
| యునైటెడ్ కింగ్‌డమ్ | 96% |
| జపాన్ | 80% |
| ఇతియోపియా | 36% |
| నైజీరియా | 28% |
| పాకిస్తాన్ | 23% |
| వియత్నాం | 20% |
| కామరూన్ | 20% |
| ఇండియా | 16% |
| కాంబోడియా | 14% |
| జార్జియా | 13% |

ప్రభుత్వ ఆరోగ్య వ్యయం తగ్గిన నేపథ్యంలో ప్రైవేటు వైద్య రంగం ముందుకొచ్చి వైద్యం భావననే ఒక "సరుకు"గా మార్చివేసింది. అందులో భాగమే ప్రైవేటు వైద్య కళాశాలలు, కార్పొరేట్ వైద్య సంస్థలు. ప్రపంచీకరణ అసమానంగా వుండటం వల్ల బలహీనపడిన 'అందరికీ ఆరోగ్యం' నినాదం ప్రభుత్వ రంగంలో ప్రజారోగ్య సంస్థలుంటేనే సాధ్యవదుతుంది. ఆ ఆశయాన్ని పునరుజ్జీవింపచేయడానికై అంతర్జాతీయంగా 2000 సం॥ నుండి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

మన దేశంలో కూడా 19 రాష్ట్రాల నుండి వచ్చిన 2000 మంది ప్రతినిధులతో నవంబరు 30, డిశంబరు 1 2000లో కలకత్తాలో నేషనల్ హెల్త్ అసెంబ్లీ జరిగింది. అక్కడే "జనస్వాస్థ్య అభియాన్" ప్రజారోగ్య ఉద్యమానికి శ్రీకారం చుట్టారు. డిశంబరు మొదటి వారంలో 2000సం॥లో బంగ్లాదేశ్‌లో జరిగిన వరల్డ్ హెల్త్ అసెంబ్లీ లో ప్రపంచ వ్యాప్తంగా ప్రజారోగ్య ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోవాల్సిన ఆవశ్యకతను గురించి చర్చించి ఒక డిమాండు పత్రాన్ని విడుదల చేశారు. మన దేశంలో కూడా ప్రజారోగ్యానికి సంబంధించి దాదాపు ఇరవై డిమాండ్లతో ఒక పత్రాన్ని విడుదల చేయడం జరిగింది.

**ముఖ్యమైనవి:**

1. ప్రజల ఆరోగ్యంపై గ్లోబలైజేషన్ దుష్ప్రభావాలను ప్రజలకు వివరించడం.
2. ఆరోగ్యాన్ని ఒక ప్రాథమిక హక్కుగా గుర్తించాలని కోరడం
3. కాంప్రహెన్సివ్ ప్రైమరీ హెల్త్ కేర్ అప్రోచ్ కోసం ప్రభుత్వాన్ని వొత్తిడి చేయడం.
4. వైద్యంలో అమానవీయ, అనైతిక, అశాస్త్రీయ పద్ధతులను నిరసించడం.

పై అంశాలతో ఏకీభవించేవారికి ఒక వేదికగా ఉండటం. ఆ ప్రకారం జనస్వాస్థ అభియాన్ నేషనల్ కో ఆర్డినేషన్ కమిటీలో దాదాపు 17 సంస్థలు వున్నాయి. ప్రజలందరి ఆరోగ్యం కోసం జరిగే ఈ కృషిలో మనందరి భాగస్వామ్యం వుండాలి. అందుకే మనందరిదీ జనస్వాస్థ్య అభియాన్.

*

# నోయిడా ఉదంతం

దేశ రాజధానికి కూతవేటు దూరంలో నోయిడాలోని నిథారి గ్రామంలో జరిగిన ఉదంతం బయటపడుతున్న పసిపిల్లలు, మహిళల ఎముకల గుట్టలు సభ్య సమాజాన్ని నివ్వెరపరిచింది. ఇటీవల దేశ చరిత్రలోనే కనీవినీ ఎరుగని పైశాచిక కాండ ఇది.

నేపాల్, బంగ్లాదేశ్, బీహార్ తదితర రాష్ట్రాల నుండి పొట్టకూటి కోసం వలసలు వచ్చి జీవిస్తున్నవారు పెద్ద సంఖ్యలో ఇక్కడ వున్నారు. తల్లిదండ్రులు ఇద్దరు కూలికెళితే గుడిసెలో వున్న పసిపిల్లలకు స్వీట్లు, చాక్‌లెట్లు ఎరచూపి తీసుకెళ్ళి అత్యాచారం చేసి చంపి వారి శవాలను కూడా పీక్కుతిన్నామని నిందితులు చెబుతున్న (యజమాని మొహిందర్ సింగ్, నౌకరు సురేందర్) కథనం వింటుంటే ఒళ్ళు గగుర్పాటు చెందుతుంది.

నోయిడా ఘటన జరిగిన మరునాడే జనవరి 4, 2007 తేదిన సుధా సుందరరామన్ (ఐద్వా జాతీయ కార్యదర్శి)తో సహా 7గురితో ఐద్వా ప్రతినిధిబృందం ఘటనా స్థలానికి వెళ్ళింది. బాధితులకు న్యాయం చెయ్యమని, దోషులను కఠినంగా శిక్షించాలని ఐద్వా ధర్నా నిర్వహించింది.

నిథారిలోని సంఘటనా స్థలానికి వెళ్ళిన ఐద్వా బృందానికి కన్పించకుండా పోయిన పిల్లల తల్లిదండ్రులు తాము ఇచ్చిన ఫిర్యాదుల పట్ల పోలీసులు స్పందించలేదని, ఎటువంటి చర్యలు చేపట్టలేదని, తమకు న్యాయం చెయ్యమని కనీళ్ళతో వేడుకున్నారు. పిల్లలను కోల్పోయిన తల్లిదండ్రులకు సంఘీభావం తెలియజేస్తూ ఈ క్రింది చర్యలు వెంటనే చేపట్టమని ఐద్వా డిమాండ్ చేసింది.

1. దోషులను కఠినంగా శిక్షించాలి. బాధితులకు రక్షణ కల్పించాలి.
2. పిల్లలను కోల్పోయిన కుటుంబాలకు ఎటువంటి వివక్షా లేకుండా నష్ట పరిహారం చెల్లించడంతోపాటు సహాయ చర్యలన్నీ బహిరంగంగా ప్రకటించాలి.
3. నిథారి కేసు విచారణను సి.బి.ఐ.కి అప్పగించడంతోపాటు నిర్ణీత కాల వ్యవధిలో విచారణను పూర్తి చెయ్యాలి. అన్ని కోణాల నుండి సమగ్రమైన దర్యాప్తు చెయ్యాలి.
4. నిథారి ఘటనలో అలసత్వాన్ని ప్రదర్శించిన పోలీసులపై సంబంధిత అధికారులపై వెంటనే చర్యలు చేపట్టాలి.
5. ఇళ్ళు కోల్పోయిన కుటుంబాలకు మళ్ళీ ఇళ్ళు నిర్మించి ఇవ్వాలి.
6. వలస కార్మికుల సమస్యల పరిష్కారానికి దీర్ఘకాలిక చర్యలు చేపట్టడంతోపాటు అంగన్‌వాడి సెంటర్లు, పిల్లల సంరక్షణ కేంద్రాలు ఏర్పాటు చేయాలి. వలసలు వస్తున్న వారిలో యువతులు కూడా పెద్ద సంఖ్యలో వున్నారు. వారి రక్షణ కోసం ప్రభుత్వం చర్యలు తీసుకోవాలి.

# గృహహింస నుండి రక్షించే చట్టం

గృహ హింస నుండి రక్షించే చట్టం 2005ను విడుదల చేసినందుకు వివిధ మహిళా సంఘాలకు చెందిన మేము సంతోషించుచున్నాము. అనేక సంవత్సరాలుగా కృషి చేసిన ఫలితంగా యిది వచ్చింది. ఈ చట్టాన్ని సమర్థవంతంగా, ఆలస్యం కాకుండా మనరాష్ట్రంలో అమలు చేయాలంటే, రాష్ట్ర ప్రభుత్వం సమర్థవంతమైన యంత్రాంగాన్ని ఏర్పాటు చేయాలి.

ఈ చట్టాన్ని సమర్ధవంతంగా అమలు చేసే బాధ్యత మహిళా, శిశు సంక్షేమ శాఖకు అప్ప చెప్పడమైనది. మేము యీ దిగువన పేర్కొన అంశాలను అమలు చేయాలని ఐద్వా రాష్ట్ర కమిటీ ప్రభుత్వాన్ని కోరుచున్నది.

**1. రక్షణాధికార్లు, వారి దిగువ స్థాయి అధికార్ల నియామకం (రెఫర్ సెక్షను 2 (యన్) సెక్షను 8)**

- ఆలస్యం చేయకుండ వెంటనే రక్షణాధికార్ల నియామకం చేయాలి.
- రక్షణాధికార్లను ఎంపిక చేయడానికి 9 మందితో కూడిన రాష్ట్ర కమిటీని నియామకం చేయాలి. రక్షణాధికార్లకు ట్రైనింగ్ ఇవ్వడం, వారిపనిని సమీక్ష చేయటం, వారిని పర్యవేక్షించే బాధ్యత రాష్ట్ర కమిటీకి అప్ప చెప్పాలి.
- ఈ కమిటీ యీ క్రిందివాటిని పొందుపరచాలి.

  ఎ) ప్రభుత్వ అధికార్లు -3

  బి) వృత్తి పరంగా సామాజిక సేవ చేసే రంగాల నుండి -2

  సి) న్యాయవాద వృత్తి చేస్తున్న వారి నుండి -2

  డి) మహిళా ఉద్యమ ప్రతినిధులు -2
- అనేకమైన బాధ్యతలు వీరికి అప్ప చెప్పాలి. అత్యవసరమైన జోక్యం చేసుకోవడానికి 24 గం॥ కూడ పని చేయవలసి యుంటుంది. అందువలన, ప్రత్యేకమైన నియామకాలు చేయాలి. ఎటువంటి పరిస్థితులలో, ప్రస్తుతమున్న ప్రభుత్వ అధికార్లకు, రక్షణాధికార్ల బాధ్యత అప్ప చెప్పకూడదు.
- రక్షణాధికార్లకు స్వతంత్రమైన ప్రతిపత్తితో పాటు వారికి సంపూర్ణమైన సదుపాయాలు ఏర్పాటు చేయాలి.
- మొదటి విడతగా, రక్షణాధికార్లు, వారికి సహాయంగా జె.యమ్.యస్.పి పరిధి క్రింద లెక్క కట్టి కనీసంగా నియామకం చేయాలి. 1 జె.యమ్.యస్.సి.2 రక్షణాధికార్లు (24 గంటలు పని చేయవలసి యున్నది). 4 రక్షణాధికార్లకు క్రింది స్థాయి అధికార్లు (8(3) సెక్షను, చట్టం) 2 గుమస్తాలు.
- రక్షణాధికారి తప్పనిసరిగ ఎమ్.ఏ సోషియాలజీ / సైకాలజీ లేక మాస్టరు - సోషల్ వర్కుగాని లేక యల్.యల్.బి విద్యార్హతలు కల్గియుండాలి.




- క్లాసు 1 ఆఫీసర్లను కేటాయించాలి. అదేవిధంగా జీత బత్యాలను కూడా చెల్లించాలి.
- దీనికి అవసరమైన బడ్జెట్‌ను (జీతాలు, ఆఫీసు, టెలిఫోను, కంప్యూటర్, సహాయకుల ఆఫీసులు, గుమస్తా అసిస్టెంట్లు, రవాణా సదుపాయాలు, ఆర్థికములు) వచ్చే బడ్జెటులో పొందు పరచాలి.
- రక్షణాధికారి ఆఫీసు అందరికి అందుబాటులో ఉండే సెంటర్ పెట్టాలి.
- రక్షణాధికారి ఆఫీసు టెలిఫోను నెంబరును విస్తృతంగా ప్రచారం చేయాలి. బహిరంగ ప్రదేశాలలో ఫోను నెంబరును వ్రాసి ప్రచారం చేయాలి. ఆవిధంగా ఆఫీసులో 24 గం॥లు అమె సేవలు ఉపయోగించుకోవాలి.

సేవలందించే వారిని రిజిష్టరు చేసుకోవటం, నియామకం చేసుకోవటం, చట్టం నాలుగు రకాలైన సేవలను అందించాలి. సలహాలు, సంప్రదింపులు, ఆశ్రయం కల్గించే గృహాలు, వైద్య సదుపాయాలు మరియు న్యాయ సహాయం, అవగాహన కల్గించటం కూడా

- మహిళా శిశు అభివృద్ధి శాఖ రాష్ట్ర వ్యాప్తంగా గ్రామీణ, పట్టణ ప్రాంతాలలో ఏ ఏ ప్రాంతాలలో ప్రభుత్వం మద్దతుతో ఏర్పాటు చేసే సేవా కేంద్రాలను సలహా సంప్రదింపులు, ఆశ్రయం కల్గించే గృహాలు, వైద్య సహకారం, న్యాయ సహాయం (అవగాహన కల్గించటం) ప్రకటించాలి.
- అటువంటి సేవలందించాలని (ప్రభుత్వం, ప్రభుత్వ సహకారంతో) చట్టం క్రింద విడుదల చేయాలి.
- ఏదైన నిర్దిష్టమైన ప్రాంతాలలో సేవలు అందించకపోయిన అటువంటి ప్రాంతాలను గుర్తించి అక్కడ కూడ సేవలను అందించడానికి గానీ విస్తృత పరచడానికి గాని మహిళా శిశు అభివృద్ధి శాఖ ద్వారా ఆర్థిక సహాయాన్ని అందించాలి.
- ఇప్పటికే సేవలు అందించే చోట్ల సహకారం పొందే సంస్థలకు, పొందని సంస్థలకు సమీక్ష చేసి అవసరమైతే ఆర్థిక సహకారాన్ని పెంచాలి.
- గుర్తించిన సేవలందించే సంస్థలకు ప్రభుత్వ సేవా సంస్థలకు ప్రాంతీయ సమావేశాలు ఏర్పాటు చేసి చట్టం యొక్క ఆశయాలను అర్థమయ్యేటట్లు చెప్పాలి.
- మహిళా శిశు అభివృద్ధి శాఖ రాష్ట్రంలో అన్ని ప్రాంతాలకూ ఆ సేవలందించే వారిని సమీకరించాలి. అన్ని ప్రాంతీయ పత్రికల్లో యితర పత్రికలలో ప్రకటనలు ఇచ్చి విస్తృతంగా ప్రచారం చేయాలి. రక్షణాధికార్ల కోసం రాష్ట్ర స్థాయి కమిటీని ఏర్పాటు చేయాలి. ఈ కమిటీకి సేవలందించే సంస్థల ఎంపిక చేసే బాధ్యతలను కూడా అప్పచెప్పాలి. (ముఖ్యంగా సలహాలు, సంప్రదింపులు, ఆశ్రమ గృహాలు, వైద్య సదుపాయం, న్యాయ సహాయం(అవగాహన పెంచటంతోపాటు) వీటి ప్రమాణాలు పెంచడానికి ట్రైనింగ్ యివ్వడం, పర్యవేక్షించటం మరియు సమీక్ష చేయటం వారికి అప్ప చెప్పాలి.
- కమిటి నిర్ణయించిన కనీస ప్రమాణాలు పాటించని సేవా సంస్థల రిజిస్ట్రేషన్‌ను రద్దు చేసే అధికారం కూడా రాష్ట్ర కమిటికీ కల్గించాలి.
- కమిటి సమస్యలపైన గృహహింసపైన మూడు సంవత్సరాలు కంటే ముందుగా పనిచేస్తున్న సేవా సంస్థలు ఈ మధ్యకాలంలో సొసైటీ రిజిస్ట్రేషన్ చట్టం /కంపెనీ చట్టం/ లేక ఏదైనా యితర చట్టం క్రింద రిజిష్టరు చేసుకొని ఉంటే వాటిని ఈ చట్టం క్రింద రిజిష్టరు చేసుకోవడానికి పరిశీలించాలి. (చట్టం 11 (3ఎ) క్రింద పరిగణించాలి.
- వృత్తి పరంగా అర్హత పొందిన వారినే సలహాదారులుగా చట్టం ప్రకారం నియామకం చేయాలి. (సేవలందించే సంస్థను రిజిష్టరు చేసుకున్న నాటి నుండి) సలహాదారులకు, గృహ హింసను ఆపడానికి తిరిగి జరుగకుండా చూసుకోవడానికి ఆదేశిస్తూ శిక్షణ ఈ చట్టంలో 14వ చట్టం క్రింద పేర్కొన్నట్లు యివ్వబడింది.
- సేవలందించే సంస్థలకు స్త్రీలకు చట్టంలో పేర్కొన్న సేవలలో ఏ సేవ అందించగలరో వారినే వారి శక్తికి తగ్గట్లు నిర్ణయించు కోవడానికి అవకాశం యివ్వాలి.
- సేవలందించే సంస్థలు రిజిష్టరు చేసుకునే దరఖాస్తులో నెం:6 ఇందులో నిబంధనలు పొందుపరచబడినవి. మరికొన్ని ప్రశ్నలు/ అంశాలు ఉండవలసినవి ఈ దిగువున పేర్కొనబడినవి.

ఎ. అంశం నెం. 4లో నియామకం చేసిన వారితోపాటు యితర వ్యక్తులను కూడా చేర్చాలి. అంటే ఈవిధంగా పరిగణించాలి. "నియామకం చేసిన వ్యక్తుల సంఖ్య/ వారితోపాటు ఉన్న వాలంటీర్లు, సేవా సంస్థలు, సలహాదార్లు లేక రిసోర్సు పర్సన్, సేవలందించేవారు.

బి. అంశం నెం.6 వృత్తిపరమైన అర్హతలు, యితర అర్హతలు అనుభవకాలం తదితర వాటిని చేర్చాలి.

సి. 10వ అంశము నుండి ధరఖాస్తులో ఉన్న తక్కిన భాగాన్నంతా సేవలందించే సంస్థలు నింపాలి. దీనికి సంబంధించిన అధికార యంత్రాంగం పరిశీలించి ఆమోదించాలి.

డి. అన్ని సేవలను ఎంత మేరకు చేయగలరో నిర్దిష్టంగా పేర్కొనాలి. ఉదాహరణకు ఆశ్రయ గృహాల గురించి అనుకున్నపుడు సేవా సంస్థ ఎంత మంది స్త్రీలను, వారి పిల్లలను తీసుకోవడానికి అవకాశం ఉందో తెలియజేయాలి. సలహాలు, సంప్రదించే కేంద్రాల విషయాలకి వస్తే సరాసరి ఎంత మందికి ఒక నిర్ణీతమైన సమయంలో సాయపడగలరో తెలియజేయాలి

ఇ. ఆశ్రయ గృహాలు, సలహా సంప్రదింపుల సేవలే కాకుండా యితర సేవల గురించి కూడ సేవా సంస్థలు, సేవలందించే వ్యక్తుల అర్హతలను వారికి సంబంధించిన ముఖ్యమైన సమాచారం కూడా సమర్పించాలి.

### 3. వైద్య సదుపాయంగురించి ప్రకటనను విడుదల చేయటం (యు/సెక్షను2(జె)

- ప్రభుత్వ సహకారం పొందుతున్నవి, ప్రభుత్వం నిర్వహించుచున్న ప్రజా ఆరోగ్య సంరక్షణ కేంద్రాలన్ని ఖచ్చితంగా ఈ చట్టం క్రిందకి తీసుకొని రావాలి. ఇవి "వైద్య సదుపాయం కల్గించడానికి."
- ఈ విధమైన వైద్య సదుపాయం కల్గించే సంస్థలు, నిబంధన 17లో "వైద్య సదుపాయం" క్రింద ప్రత్యేకంగా కొన్ని నిబంధనలు పేర్కొనబడినవి. ఈ నిబంధనలను పై సంస్థలు ఖచ్చితంగా అనుసరించాలి.

### 4. ఆశ్రయ గృహాలను ఏర్పాటు గురించి ప్రకటన విడుదల(యు/సెక్షను/2)

- ఈచట్టం క్రింద ప్రభుత్వం, ప్రభుత్వేతర సంస్థలు నిర్వహించే ఆశ్రయ గృహాలను గురించి ప్రకటన విడుదల చేయాలి.
- సేవా సంస్థలు లాగానే వీరు కూడా నిబంధనలు పాటించాలని వీరికి ఆదేశాలు జారీ చేయాలి. చట్టంలో 6వ సెక్షన్ లేదా 16వనిబంధనలో పేర్కొన్న విధంగా ఈ సంస్థలు కట్టుబడియుండాలని ప్రకటనలో పేర్కొన్నారు.

## 5. రాష్ట్ర ప్రభుత్వ విధులు(యు/సెక్షన్11)

- ఈ చట్టాన్ని అమలు పరిచే బాధ్యత మహిళా శిశు అభివృద్ధి శాఖకు అప్పచెప్పబడింది. అందువలన ఈ శాఖ పూర్తి బాధ్యత తీసుకొని ఈచట్టాన్ని సెక్షన్ 11తో సహా అమలు పరచాలి.

## ప్రచారం (సెక్షన్ 11ఎ)

- మహిళా శిశు అభివృద్ధి శాఖ ఈ చట్టానికి పత్రికల ద్వారా ప్రజలలో విస్తృతమైన ప్రచారం చేయాలి. అందుకు అవసరమైన నిధులను బడ్జెట్‌లో కేటాయించాలి.

హింసా రహిత ఆరోగ్యకరమైన సమాజము ఏర్పడడానికి చట్టాన్ని సానుకూలంగా పెద్ద ఎత్తున ప్రచారం చేయడానికి అవసరమైన జాగ్రత్తలు తీసుకోవాలి. ప్రస్తుతం యీ చట్టాన్ని గురించి వార్తా సంస్థలు వక్రీకరించటం గాని లేక వ్యతిరేక ప్రభావం కల్గించవచ్చు. కావున ప్రచారం చేయటంలో జాగ్రత్తలు పాటించాలి.



## శిక్షణ:

- మహిళల సమస్యలపైన స్పందించడానికి అవసరమైన అవగాహన విజ్ఞానం పెంచి యీ చట్టం క్రింద ఏర్పాటైన యంత్రాంగం యొక్క శక్తి సామర్ధ్యాలను పెంచాలి. చట్టం (సెక్షన్11బి)
- ఈ క్రింది సంస్థలకు, అధికారులకు సానుకూలత కల్గించటానికి పరిపూర్ణత కల్గించడానికి తదేక దీక్షతో పనిచేయడానికి అవసరమైన శిక్షణ కార్యకలాపాలను నిర్వహించాలి.

న్యాయ సంస్థలు, పోలీసుల, రక్షణాధికారులు, సేవా సంస్థలు, ఆశ్రయ గృహాల నిర్వాహకులు, సలహాలు-సంప్రదించడానికి సహకరించే సంస్థలు, ఆరోగ్య సహకారం అందించే సంస్థలు (ప్రభుత్వ, ప్రైవేటు సంస్థలు) న్యాయ సహకారం అందించే సంస్థలు

- న్యాయ విద్యను అందించే సంస్థలు లేక సామాజిక సేవలను గురించి విద్యనందించే సంస్థలు లేక మహిళా హక్కుల గురించి శిక్షణనిచ్చే సంస్థలకు మాత్రమే యీ శిక్షణ బాధ్యతలను అప్పచెప్పాలి. ఈ శిక్షణలకు అయ్యే ఖర్చునంత ప్రభుత్వమే సమకూర్చాలి.

మంత్రిత్వాలు మరియు శాఖల మధ్య సమన్వయం (సెక్షను 1:ఇ.సి.) ఈ పనిని నిర్వహించడానికి రాష్ట్ర స్థాయి సమన్వయ కమిటీని ఏర్పాటు చేయాలి.

చట్టంతో సంబంధమున్న అన్ని శాఖలు, మంత్రిత్వ ప్రతినిధులతోపాటు వృత్తి నైపుణ్యం కల్గిన వారిని ముఖ్యంగా లాయర్లు, ఆర్థిక అంశాలలో అనుభవం కల్గిన వారు, సామాజిక కార్యకర్తలు, మహిళా ఉద్యమ కార్యకర్తలను కూడ సమన్వయ కమిటీలో నియామకం చేసుకోవాలి.

వివిధ శాఖలు, మంత్రిత్వాలు నిర్వహించవలసిన బాధ్యతలను సమన్వయ కమటీ రూపొందించాలి. (ఉదా: న్యాయశాఖ, హోమ్, ఆరోగ్య, సాంఘిక సంక్షేమము) మంత్రిత్వాలు, శాఖలుచేపట్టే సేవా కార్యక్రమాలకు యితర పనులకు అయ్యే ఖర్చులకు బడ్జెట్ కేటాయింపులు జరిగేటట్లు సమన్వయ కమిటి కృషి చేయాలి.

మొదటి తరగతి జ్యుడిషియల్ మేజిస్ట్రేట్ కోర్టుల్లోను, యితర కోర్టుల్లోను చట్టానికి సంబంధించి వేసిన కేసులను విచారణకు సంబంధించిన సమాచారం సేకరించి ఒక క్రమ పద్ధతిలో భద్రపరుచుకోవాలి. ఈ సమాచారాన్ని ఉపయోగించుకొని చట్టం సక్రమంగా అమలవుచున్నదీ లేదా అనేది కూడ నిర్ధారించుకోవడానికి ఉపయోగపడుతుంది.

## 6. ఆర్థిక కేటాయింపులు చేయటం:

అవసరమైన సరిపడ ఆర్థిక కేటాయింపులు చేస్తేనే చట్టాన్ని సమర్ధవంతంగా శ్రద్ధగా అమలు చేయగలరు. బడ్జెట్‌లో సరిపడ ఆర్థిక నిధులను కేటాయిస్తేనే ప్రభుత్వానికి చట్టం అమలు చేయాలనే పట్టుదలున్నట్లు భావించాలి.

స్వతంత్రంగా ఖర్చు పెట్టడానికి వివిధ శాఖలకు, మంత్రిత్వాలకు వేరు వేరుగా నిధులను కేటాయించాలి. కేంద్రము కేటాయించే నిధులను మహిళా శిశు అభివృద్ధి శాఖ ఆధ్వర్యంలో ఉంచాలి.

ఈ దిగువ తెలియపరచిన ముఖ్యమైన కార్యక్రమాలను చేపట్టడానికి అవసరమైన బడ్జెట్లు కేటాయింపులు చేయాలి.

1. ప్రచారం- అవగాహన కల్పించటం.
2. వివిధ శాఖలకు చెందిన సిబ్బందికి శిక్షణ యివ్వటం.
3. రాష్ట్ర స్థాయి సమన్వయ, పర్యవేక్షణ కమిటీని పనిచేయించటం.
4. రక్షణాధికారులను, సేవలందించే సంస్థలను ఎంపిక చేయడానికి రాష్ట్ర కమిటిని ఏర్పాటుచేయటం.
5. రక్షణాధికార్లు, వారి సిబ్బంది యితర సౌకర్యాలకు అయ్యే ఖర్చులు భరించటం.
6. సేవలందించే సంస్థలకు ఆర్థిక సహకారం అందించటం, అవి ముందుకు రానపుడు క్రొత్త సేవాసంస్థలను ఏర్పాటు చేయటం.
7. వైద్య సౌకర్యాలు కల్పించటం.
8. చట్టం అమలయ్యే సందర్భంగా వచ్చిన సమాచారాన్ని వినియోగించుకొని చట్టం సక్రమంగా అమలవుచున్నదీ లేదా అనేది సమీక్ష చేసుకోవటం.

7. ప్రత్యేకమైన కోర్టులను ఏర్పాటు చేసి చట్టం అమలు జరిగేటట్లు ప్రభుత్వం చర్యలు తీసుకోవాలి. దీని మూలంగా కేసులను త్వరగా విచారించవచ్చును. (మొదటి విచారణ మొదటి మూడు రోజులలో జరపాలి. 60 రోజులలో కేసులను పరిష్కరించాలి. (చట్టం సెక్షను 12 ప్రకారం)

మా కోర్కెలను ఆమోదించి చట్టాన్ని త్వరితంగా అమలు పరచాలని మిమ్ములను కోరుచున్నాము.

*



# ఆటవికతకు పరాకాష్ఠ ఖైర్లాంజి దురాగతం



కాళింది దేశ్‌పాండే

మహారాష్ట్రలోని భండార జిల్లాలోని ఖైర్లాంజి గ్రామంలో సెప్టెంబరు 27న అగ్రకుల భూస్వాముల దాష్టీకానికి ఒక దళిత కుటుంబం బలైంది. కుటుంబ పెద్ద అయిన బయ్యాలాల్ భోత్‌మాంగే, అతని బావమరిది సిద్ధార్థ గజాభయ్యాలు ఎలానో బతికి బయటపడ్డారు. భోత్‌మాంగే భార్య సురేఖ (45), కుమార్తె ప్రియాంక (17), కుమారులు సుధీర్ (23), రోషన్ (21)లను గ్రామ పెత్తందార్లు అత్యంత ఆటవికంగా హత్య చేశారు. హత్య చేయటానికి ముందు సురేఖ, ప్రియాంకలను భూస్వామ్య మూకలు సామూహికంగా మానభంగం చేశాయి. అంతేకాక వారినందరినీ వివస్త్రలుగా మార్చి ఊరంతా మెరవణి తిప్పారు. సభ్య సమాజానికి తలవంపులు తెచ్చే ఈ హేయమైన ఘటనను వలువురు ఖండించారు. మార్క్సిస్టు పార్టీ అగ్ర నాయకురాలు బృందా కరత్‌తో పాటు పలువురు ఐద్వా నాయకులు ఈ నెల 9వ తేదీన ఖైర్లాంజి గ్రామాన్ని సందర్శించారు. తొలుత ఈ ప్రతినిది బృందం నాగపూర్‌లో ఆగి జీవచ్ఛవంలా మిగిలివున్న భోత్‌మాంగే, సిద్ధార్థలను కలుసుకుని తమ సానుభూతిని వ్యక్తం చేసింది. భోత్‌మాంగే ఈ ప్రతినిధి బృందానికి భూస్వాముల ఆగడాలను వివరించాడు.

ఈ ఉదంతంలో మొత్తం 44 మందిపై కేసులు పెట్టినప్పటికీ వారిపై ఎస్.సి. ఎస్.టి అత్యాచార చట్టం క్రింద మాత్రం కేసు పెట్టలేదు. రాష్ట్ర మానవ హక్కుల కమిషన్ జోక్యం చేసుకున్న తరువాతనే ఈ చట్టం క్రింద కేసు పెట్టారు. మార్క్సిస్టు పార్టీ నాయకురాలు ఈ విషయంలో జోక్యం చేసుకుని భోత్‌మాంగే, సిద్ధార్థలు కేంద్ర హోంమంత్రిని కలుసుకొనే ఏర్పాటు చేశారు.



పోలీసు అధికారులు సకాలంలో జోక్యం చేసుకున్నట్లయితే ఈ దుర్ఘటన జరిగేది కాదని ప్రతినిధి బృందం అభిప్రాయ పడింది. అయితే బాధ్యతగలిగిన అధికారులందరూ అగ్రకులాల వారి తరపున దళితులకు వ్యతిరేకంగా నిలిచారు. మూకుమ్మడి హత్యలకు పాల్పడిన భూస్వాములకు వ్యతిరేకంగా పోలీసులు పెట్టిన కేసులు చూస్తే ఈ విషయం అర్థం కాగలదు. కీలకమైన సాక్ష్యాలు కూడా తారుమారవుతున్నాయి. ఎస్.సి, ఎస్.టి అత్యాచారాల చట్టం కింద కేసును నమోదు చేయలేదు. శవపరీక్ష నివేదిక కూడా తప్పులతడకగా ఉంది. పైగా హతులపై అపనిందలు వేసేదిగా ఉన్నది. ప్రియాంకను చిత్రహింసలు పెట్టిన చిహ్నాలు ఫోటోలో స్పష్టంగా కన్పిస్తున్నప్పటికీ శవపరీక్ష నివేదికలో మాత్రం ఆ వూసేలేదు.

ఈ అమానుష ఘటనలో రాజకీయాలు కూడా తమ వంతు పాత్ర నిర్వహించాయి. స్థానిక శాసన సభ్యుడితోపాటు భండార జిల్లా పార్లమెంటు సభ్యుడుకూడా బిజెపీకి చెందినవారు. ఖైర్లాంజి గ్రామంలో మూడు దళిత కుటుంబాలు, కొన్ని ఆదివాసి కుటుంబాలు ఉన్నాయి. మిగిలినవన్నీ అగ్రకులాలకు చెందిన కుటుంబాలు. ఇవన్నీ బిజెపీకి మద్దతుగా నిలిచాయి. ఈ పరిస్థితిలో దళిత కుటుంబాలు బిక్కుబిక్కుమంటూ బతుకులీడుస్తున్నాయి. బిజెపీకి చెందిన శాసనసభ్యుడు ఇప్పటి వరకు బాధిత కుటుంబాలను పరామర్శించలేదంటే అందులో ఆశ్చర్యపడవలసిన దేముంది? ఆయన భూస్వాముల కొమ్ము కాసినవాడు. అందుకే బాధితులను పరామర్శించలేకపోయాడు. రాష్ట్ర ప్రభుత్వం కూడా బాధితులకు ఒరగబెట్టిందేమీ లేదు. భూస్వాముల ఆగడాలను ఖండిస్తూ ఆందోళనలు జరగటంతో పాటు, ప్రసారమాధ్యమంలో ఈ దుర్ఘటన గురించి విస్తృత ప్రచారం జరిగిన తరువాత గానీ రాష్ట్ర ముఖ్యమంత్రి విలాసరావు దేశముఖ్‌కు దీనిగురించి తెలియలేదు. మహాత్మా ఫూలే, డాక్టర్ అంబేద్కర్‌ల జన్మభూమిలో ఇలాంటి హేయమైన ఘటనలు జరగడం శోచనీయం. ఈ కేసులో పోలీసులు పూర్తి సమాచారాన్ని ఇవ్వకుండా తొక్కి పడుతున్నారు. మృతదేహాలు అక్టోబరు ఒకటో తేదీన దొరికాయి. 2వ తేదీన ప్రభుత్వం చర్యలు తీసుకోవటం ప్రారంభించింది. ప్రజల నుంచి ఆందోళన వెల్లువెత్తడంతోపాటు ప్రసారమాధ్యమంలో ఈ ఘటన గురించి ప్రచారం జరగటంతో ప్రభుత్వంలో ఈమాత్రమైనా

కదలిక వచ్చింది. అయితే ఈ సమయంలో కూడా ప్రభుత్వం సరైన వైఖరిని తీసుకోలేదు. హంతకులను వదలిపెట్టి ఆందోళనాకారులపై విరుచుకుపడింది. వాళ్ళను నక్సలైట్లుగా చిత్రించి అణచివేసే చర్యలను చేపట్టింది. ప్రభుత్వం చేపట్టిన ఈ వైఖరి పుండుమీద కారం చల్లినట్లయింది. దళితులలో ఆగ్రహం పెల్లుబికింది.

## ఆగని వేధింపులు

దాదాపు 18 ఏళ్ళుగా భోత్‌మాంగే కుటుంబాన్ని గ్రామంలోని అగ్రకులాల వారు వేధిస్తున్నారు. పంచాయతీ పెత్తందారుల చేతిలో ఉండటంతో భోత్‌మాంగే పేరు రెవిన్యూ రికార్డుల్లోకి ఎక్కలేదు. దీనితో పక్కా ఇంటిని కట్టుకునే అవకాశం అతనికి లేకుండా పోయింది. ఇల్లు కట్టుకోవటానికి అతను రెండుసార్లు ప్రయత్నించాడు. కాని మొదలుపెట్టిన ఇంటిని పెత్తందారులు కూలదోశారు. ఇప్పటికీ అక్కడ ఇటుక రాళ్ళు చెల్లాచెదరుగా పడివున్నాయి.

భయ్యాలాల్‌కు ఐదెకరాల పంటభూమి ఉన్నది. దీనిచుట్టూ భూస్వాముల భూములు ఉన్నాయి. ఇతని కుటుంబాన్ని వేధించటానికి 2002లో మరో సాకు దొరికింది. భయ్యాలాల్ పొలంలో నుంచి అప్రోచ్ రోడ్డు వేయాలని భూస్వాములు భావించారు. భయ్యాలాల్ బావమరదియైన సిద్ధార్థ సమీప గ్రామంలో పోలీసు పటేలుగా చాలాకాలంగా పనిచేస్తున్నాడు. రోడ్డు విషయమై జరిగే చర్చల్లో సహాయ పడేందుకై అతను కూడా వచ్చాడు. మొత్తం మీద 10 అడుగుల రోడ్డును వేయటానికిగాను భయ్యాలాల్ అరెకరం భూమిని వదులు కోవలసి వచ్చింది. కాని ఇంతటితో సమస్య సద్దుమణగలేదు. పగటి వేళల్లో సాగునీటి కాలవనుంచి నీరు తీసుకు రాగూడదంటూ పెత్తందారులు ఆంక్షలు విధించారు. ఒకనాడు అగ్రకులానికి చెందిన ఒక మహిళ సురేఖ తలపై కొడవలితో కొట్టింది. ఈ విషయమై ఫిర్యాదు ఇవ్వటానికి వెళ్ళిన సురేఖను పోలీసులు పట్టించుకోలేదు.

భోత్‌మాంగే కుటుంబంతో పాటు సిద్ధార్థ కుటుంబాన్ని కూడా భూస్వాములు వేధించ సాగారు. భోత్‌మాంగే కుటుంబానికి అండగా నిలబడుతున్నాడన్న కక్షతో అతనిపై కూడా పగబట్టారు. ఈ రెండు దళిత కుటుంబాలు తమ కాళ్ళపై తాము నిలబడగలగటం భూస్వాములకు మరింత ఆగ్రహాన్ని కలిగించింది. అగ్రకుల భూస్వాముల కాళ్ళ క్రిందపడి బతకటానికి వారు నిరాకరించారు. భోత్‌మాంగే కుమార్తె ప్రియాంక ప్రతిభ గలిగిన విద్యార్థినిగా పేరు తెచ్చుకున్నది. పదవ తరగతి పరీక్షల్లో ప్రథమ స్థాయిలో ఉత్తీర్ణురాలయింది. సైన్యంలో చేరాలని ప్రియాంక కలలు కనేది. కుమారుడు రోషన్ డిగ్రీ పూర్తిచేసి కంప్యూటర్‌లో శిక్షణ పొందాడు. మంచి ఉద్యోగం కోసం ఎదురు చూస్తున్నాడు. మూడవ కుమారునికి దృష్టి మాంద్యం ఉండటంతో చదువును మధ్యలోనే నిలిపి వేశాడు.

సెప్టెంబరు 3వ తేదీన సిద్ధార్థ మోటారు సైకిలుపై తిరిగి వస్తుండగా కొంతమంది ఆయనపై దాడి చేశారు. ఈ ఘటనకు సురేఖ, ప్రియాంకలు ప్రత్యక్ష సాక్షులు. సిద్ధార్థ తనపై జరిగిన దాడిని పోలీసులకు ఫిర్యాదు ఇవ్వటంతో విచారణ కోసం ఒక పోలీసు ఆ ఊరికి వచ్చాడు. దాడి చేసిన వారి పేర్లను సురేఖ వెల్లడించింది. నేరస్తులపై పోలీసులు చర్య చేపట్టగలరనే ఆమె విశ్వాసం. అయితే వచ్చిన పోలీసు ఆమె సాక్ష్యమిచ్చిన సంగతిని భూస్వాములకు చేరవేశాడు. దీనితో ఆ కుటుంబంపై గ్రామ పెత్తందారులు పగబట్టారు. పదేపదే వేధింపులకు దిగారు. ఈ వేధింపులు భరించలేక సురేఖ పోలీసులకు ఫిర్యాదు చేసింది. సెప్టెంబరు 29న కోర్టుకు రావలసిందిగా వారికి సమన్లు అందాయి. అక్కడ వారికి బెయిల్ వచ్చింది. వారు సరాసరి సురేఖ ఇంటికి వచ్చి ఆమెను, ఆమె పిల్లలను బయటకు లాగి వివస్త్రలను చేశారు. ఆ సమయంలో భోత్‌మాంగె పొలంలో పని చేసుకుంటున్నాడు. తమ వారి కేకలు విని అతను పరుగెత్తుకు వచ్చాడు. అప్పటికే భూస్వాములు వారందరినీ నగ్నంగా ఊరిలో తిప్పటం మొదలు పెట్టారు. దీనితో అతను సిద్ధార్థ ఇంటికి పరుగెత్తికెళ్ళి అక్కడనుంచి పోలీసులకు ఫోను చేశాడు. అయినప్పటికీ పోలీసు కానిస్టేబులు ఆ రాత్రికిగానీ రాలేదు. సురేఖ ఆమె పిల్లలు కనిపించనందున వారిని వెతకాల్సిందిగా ఆ పోలీసును కోరాడు. అతగాడు రూ.500లు తీసుకుని అలానే అని చెప్పి వెళ్ళాడు. భోత్‌మాంగె ఆ రాత్రంతా తనవారి కోసం వెదుకుతూనే ఉన్నాడు. కాని వారి జాడ తెలియలేదు. ఈ విషయాన్ని ఉన్నతాధికారుల దృష్టికి తీసుకు వెళ్ళినా ఉపయోగం లేకపోయింది.

కాలవ ఒడ్డున ఒక యువతి శవం పడివున్నది రమ్మంటూ సెప్టెంబరు 30వ తేదీన భోత్‌మాంగేను పోలీసులు పిలుచుకు వెళ్ళారు. అయితే ఆ శవాన్ని అతనికి వెంటనే చూపకుండా శవపరీక్ష అయిన తరువాత మాత్రమే అతనికి చూపారు. నిజానికది ప్రియాంక శవం. ఆ మరుసటి రోజున మిగిలిన వారి మృతదేహాలు లభ్యమయ్యాయి. ఇంత దారుణం జరిగినప్పటికీ భోత్‌మాంగేను, అతని బావమరదిని నేరస్తులంటూ పోలీసులు చెప్పుకొచ్చారు. అంతటితో ఆగకుండా వారిని అవమాన పరిచారు, బెదిరించారు. ఈ ఉదంతంలో మొత్తం 44 మందిపై కేసులు పెట్టినప్పటికీ వారిపై ఎస్.సి, ఎస్.టి అత్యాచార చట్టం క్రింద మాత్రం కేసు పెట్టలేదు. రాష్ట్ర మానవ హక్కుల కమిషన్ జోక్యం చేసుకున్న తరువాతనే ఈ చట్టం క్రింద కేసు పెట్టారు. భోత్‌మాంగే వాంగ్మూలాన్ని కూడా నమోదు చేశారు. మార్క్సిస్టు పార్టీ మరియు ఐద్వా నాయకురాలు ఈ విషయంలో జోక్యం చేసుకుని భోత్‌మాంగే, సిద్ధార్థలు కేంద్ర హోంమంత్రిని కలుసుకొనే ఏర్పాటు చేశారు. భోత్‌మాంగే ఇప్పుడు జీవచ్ఛవంలా మిగిలాడు. అతనేమీ నష్ట పరిహారం అడగటం లేదు, ఇల్లూ, పొలము అడగటం లేదు. తన వారిని దారుణంగా వధించటమే కాక దళితుల ఔన్నత్యానికి భంగం కలిగించిన వారిని శిక్షించమనే అతను కోరుతున్నాడు.

### వివిధ దేశాల్లో చట్ట సభల్లో మహిళా ప్రాతినిధ్యం

మన పొరుగు దేశాలైన పాకిస్తాన్ 22%, ఆఫ్ఘనిస్తాన్ 27% ప్రాతినిధ్యం వుండగా, వచ్చే పార్లమెంట్ ఎన్నికల్లో మహిళలకు 33% రిజర్వేషన్లు కల్పించాలని నేపాల్ ప్రభుత్వం నిర్ణయం. అతి తక్కువ ఆదాయం కలిగిన దక్షిణాఫ్రికా, రువాండాలో 49% మహిళల ప్రాతినిధ్యం వుండగా మన పార్లమెంటులో 8.2% మాత్రమే ఉంది. వివిధ రాష్ట్రాల అసెంబ్లీల్లో సగటున 6.6% మాత్రమే మహిళా ప్రాతినిధ్యం వుంది.

# పరీక్షలంటే భయమేల!

**హ**లో నేస్తాలూ...బావున్నారా! అరే...మేం ఓ పక్క పలకరిస్తుంటే మీరేంటి ఏదో హడావిడిగా కనిపిస్తున్నారు? ఓ.. పరీక్షలు దగ్గరకొస్తున్నాయనా ఈ కంగారంతా. డోన్ట్ వర్రీ చిన్నారులూ. సంవత్సరం చివర్లో పుస్తకాల దుమ్ముదులిపే వాళ్లకుగాని మీలాంటి పిడుగులకు కంగారెందుకు చెప్పండి. అయినా పరీక్షల సీజన్ కాబట్టి లోలోన కాస్త గాబరాగానే వుంటుంది. అదిసరేగాని మీకు మంచి మార్కులు తెచ్చుకోవాలనుందికదూ. అందుకోసం మా దగ్గర కొన్ని ట్రిక్కులున్నాయి. చెప్పమంటారా!

ప్లాన్ చేసుకోండి

కనీసం ఇప్పటినుంచి బాగా చదివినా పరీక్షలు చక్కగా రాయొచ్చు. మరి అందుకోసం ముందే ప్లాన్ చేసుకోండి. ఆ ప్రకారం చదువుకోండి. పరీక్షలకు ఇంకా ఎన్ని రోజులున్నాయి? మనం చదవాల్సిన పాఠాలు ఎన్ని వున్నాయి? రోజుకి ఎంత చదవాలి? ఎన్ని గంటలు చదవాలి? అనే టైమ్ టేబుల్ వేసుకోండి. దాని ప్రకారం అనుకున్న రోజున అనుకున్నంత చదువుకున్నారనుకోండి. మీకు మంచి మార్కులు రావడం ఖాయం.

చక్కగా విశ్రాంతి తీసుకోండి

టైమ్ టేబుల్, సిలబస్... అంటున్నామని కంగారు పడకండి. క్షణం కూడా వృథా చెయ్యకుండా చదవమని చెప్పట్లేదు. ఆ టైమ్‌టేబుల్‌లోనే విశ్రాంతి తీసుకోవడానికి కూడా కొంత సమయం కేటాయించండి. ఆ సమయంలో హాయిగా రిలాక్స్ అవ్వండి. ఎంచక్కా తమ్ముళ్లు, చెల్లాయిలు, అమ్మానాన్నలతో సరదాగా గడపండి.



అర్థం చేసుకుంటూ చదవండి

చక్కగా అర్థంచేసుకుంటూ చదవండి. కంగారు కంగారుగా... హడావిడిగా చదవొద్దు. దానివల్ల నష్టమే ఎక్కువ. మీరు వచ్చిందనుకుంటారు. తీరా పరీక్ష హాల్లో రాయబోతే రాదు. భయంతో చెమటలు పోసేస్తాయి. ఆ టెన్షన్‌లో బాగా వచ్చిన ప్రశ్నలకు కూడా సరిగ్గా జవాబులు రాయలేరు. అందుకే మొదట మేం చెప్పినట్టు అర్థంచేసుకుంటూ చదవండే. ఇందుకు కాస్త సమయం పడుతుంది. అయినాసరే. ఇదే మంచి పద్ధతి.

చక్కటి ఆహారం తీసుకోండి . మీకు ఈ సమయంలో చదువే కాదు. మీ ఆరోగ్యం కూడా ముఖ్యమే. అందుకు మీరు కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలర్రా! అవేంటంటే ఆహారం విషయంలోను, శుభ్రత విషయంలోనూ కూసింత శ్రద్ధ పెట్టాలి. బయటి ఆహారపదార్థాలను తినకండి. బయటి నీళ్లు తాగకండి. ఇంట్లో వండిన వేడివేడి పదార్థాలనే తినండి. ఇంట్లో నీళ్లే తాగండి. ఎక్కడపడితే అక్కడ అంటే... రోడ్లమీద అమ్మే పదార్థాలను తినకండి. అంతేకాదర్రా! మీ ఆహారంలో ఎక్కువగా పాలు, పండ్లు, ఆకు కూరలు వుండేలా చూసుకోండి. అలాగే పరీక్ష రోజు కూడా చక్కగా టిఫిన్ చేసి, నీళ్లు తాగి వెళ్లండి. ఖాళీ కడుపుతో పరీక్షహాలుకి అస్సలు వెళ్లకూడదు. మర్చిపోరుగా.

భయంకరమైన సినిమాలు చూడొద్దు. పరీక్షల సమయం కాబట్టి... టీవీకి కాస్త దూరంగా వుండాలి. అసలు ఈ రెండు నెలలు దాని జోలికి వెళ్లకుండా వుంటేనే నయం. ఒకవేళ వెళ్లినా...భయం పుట్టించే, దెయ్యాలు-భూతాలు వుండే సీరియళ్లు, సినిమాలు చూడకండి. హాయిగా నవ్వించే ప్రోగ్రామ్స్ చూడండి. దీనివల్ల మీ మనసు ప్రశాంతంగా వుంటుంది. దీనివల్ల లేనిపోని ఆలోచనలు, భయానక ఊహలు రావు.

ఇంక పరీక్షకు వెళ్లబోయేటప్పుడు ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలో చెప్పేసుకుందామే. అవసరమైన వస్తువులను సిద్ధం చేసుకోండి

పరీక్షకవసరమైన సరంజామానంతా సిద్ధం చేసుకోండి. పరీక్ష హాల్లో ఏవైతే అవసరమవుతాయో ఒక లిస్టు రాసుకోండి. అవన్నీ రెడీ చేసుకోండి. పెన్నులు, పెన్సిళ్లు, ఎరేజర్, జామెంట్రీ బాక్స్, ప్యాడ్, వాటర్ బాటిల్ ఇంకా అతి ముఖ్యమైన హాల్‌టిక్కెట్ మర్చిపోకుండా మీ బ్యాగ్‌లో సర్దుకోండి. ఇదంతా చూడ్డానికి చాలా చిన్న విషయంగా కనిపిస్తుందికానీ...ఇవన్నీ రెడీగా వుంటే మీలో ఎటువంటి టెన్షన్ వుండదు.

వాచ్ తీసుకెళ్లడం మరవొద్దు పరీక్ష హాల్లో సమయం చాలా విలువైనది. ప్రతి ఒక్క నిముషాన్ని మనం ఎంతో జాగ్రత్తగా ఉపయోగించుకోవాలి. వాచ్ తీసుకెళితేనే అదంతా సాధ్యమౌతుంది. మల్టిపుల్ ప్రశ్నలకు సమాధానం రాయబోయేముందు అన్ని ప్రశ్నలను బాగా చదవండి. మీకు అన్నిట్లోకి చక్కగా వచ్చనుకున్న ప్రశ్నలు ఎంచుకొని జవాబులు రాయండి. అయితే ప్రశ్నాపత్రం లో వాటికి సున్నా చుట్టండి. ముందు మీకు బాగా వచ్చిన ప్రశ్నలను మాత్రమే రాయండి. ఆ తర్వాత కొంచెం కష్టంగా వున్న వాటిని రాయండి.

సూచనలను బాగా చదవండి

ప్రశ్నాపత్రంలో ఇచ్చిన సూచనలను పూర్తిగా చదవండి.అందుకోసం మొదట్లో కొద్ది సమయం కేటాయించుకోండి. దీనివల్ల మీ టెన్షన్ కొంత తగ్గుతుంది. అంతేకాదు ఏ సెక్షన్‌లో ఏమేం రాయాలో ప్లాన్ చేసుకోవడానికి ఉపకరిస్తుంది.

మీకు జవాబు తెల్సనే అనుకోండి. ఎక్కువమంది చిన్నారులకు ప్రశ్నాపత్రంలో వున్న ప్రశ్నలకు జవాబులు తెలిసేవుంటుంది. కానీ టెన్షన్లో కాస్త తికమక పడిపోయి వదిలేస్తారు. 'ఆ ప్రశ్నకు జవాబు తెలుసు' అన్న విషయాన్ని ఎప్పటికప్పుడు మీ మనసులో అనుకోండి. 'అస్సలు తెలియనిదానికంటే ఎంతోకొంత తెలియడం నయం కదా' అన్న సామెతను గుర్తుచేసుకోండి. దాంతో మీకు మీ మీద కొంత నమ్మకం ఏర్పడుతుంది. అన్ని ప్రశ్నలను చక్కగా రాయడానికి మీ మనసులో మంచి పునాది ఏర్పడుతుంది.

అవసరాన్ని మించి రాయకండి

ఏ ప్రశ్నకు ఎంత రాయాలో ప్రశ్నాపత్రంలో ఇచ్చిన మార్కులను బట్టి మీకు తెలిసిపోతుంది. బాగా వచ్చిన వ్యాసరూప ప్రశ్న రెండు మార్కుల జాబితాలో వచ్చిందనుకోండి. మొత్తం రాసెయ్యకండి. అవసరమైనంతే రాయండి. దీనివల్ల మీకు సమయం ఆదా అవుతుంది.

బాగా రాయలేకపోతే కృంగిపోకండి

ఒకవేళ ఏదైనా పరీక్ష బాగా రాయలేకపోతే అదే మనసులో పెట్టుకుని బాధపడిపోకండి. అంతటితో దాని గురించి ఆలోచించడం మానేయండి. తర్వాతి పరీక్ష గురించే ఆలోచించండి. మొదట జరిగిన పొరపాటు ఈ పరీక్షలో జరగకుండా జాగ్రత్త పడండి.

ఓకేనా! బెస్టాఫ్ లక్ ఫ్రెండ్స్.

*

## అభినందనలు

"మన్నులో పుట్టి మన్నులో పెరిగి మన్ననే తిని మన్ను రాతలు రాసిన మట్టి మనిషిని నేను ఒట్టి మనిషిని నేను" అంటూ జనం భాష (తెలంగాణా యాస)లో పలు కథలు రాస్తున్న వర్తమాన రచయితల్లో జాజుల గౌరి (మునింగం సుశీలా నాగరాజు) ఒకరు. మన్ను బువ్వ కథల సంపుటిలో ఒక్కొక్క కథను చదువుతుంటే మన చుట్టూ ఉన్న జీవన స్థితి గతులు కళ్ళకు కట్టినట్లు ఉంటాయి. ఎన్నో కవితలు, కథలు వ్రాసిన జాజుల గౌరి కలం నుండి మరెన్నో ఆలోచనలు రేకెత్తించే రచనలు వెలువడాలని మానవి ఆశిస్తుంది.

చాసో నమ్మిన విలువలను, ఉత్తమ ఆదర్శాలను ముందుకు తీసుకువెళ్ళే లక్ష్యంతో 1995 నుండి చాసో స్ఫూర్తి ప్రతిష్టాత్మకమైన పురస్కారాన్ని ప్రతి సంవత్సరం చాసో పుట్టిన రోజు జనవరి 17న ఆయన ఆశయాలను, ఆభ్యుదయ భావాలను ప్రతిబింబిస్తూ నిబద్ధతతో ఆయన వారసత్వాన్ని, చైతన్యాన్ని అందిస్తున్న అభ్యుదయ రచయితలకు ఇస్తున్నారు. ఈ సంవత్సరం జాజుల గౌరి చాసో పురస్కారాన్ని అందుకున్న సందర్భంగా మానవి హృదయ పూర్వక అభినందనలు తెలియజేస్తుంది.

## నీళ్ళబాయి



నిండుకుండ లెక్కున్న నీళ్ళబాయిని చూస్తే గండ్లకు నీల్లెట్లొస్తయో సిన్నప్పుడు సమాజ్‌గాలే. పొద్దుగాల్లనుంచి పొద్దిమింకేదాకా మిషినేసి సేండ్లకు నీళ్ళు పారించినా మళ్ళా తెల్లారేతాలకల్లా నిండుకుండ లెక్క నిండుగైతుండే.

నేను శానా బుడ్డగున్నప్పుడు మొదట్లో మా బాయిమీద మోటుంటుండే. మా మోటకు ఎడ్లను కట్టి పెద్దబొక్కెన తోటి మా నాయినోళ్ళు ఎడ్లను ముందుకు, ఎనకకు అదిలిస్తుంటే బొక్కెన బాయిలకి పోయి నీళ్లుముంచుకుని సిల్లులు పడ్డ కుండలెక్క మీదికొచ్చి కాల్వల, నీళ్ళు పొయ్యంగనే గవి జరజర పారుకుంట, పారుకుంట సేండ్లల్లకు పోతుండె గాని ఎండకాలమప్పుడు ఎంతసేపు మోటకొట్టినా సేండ్లకు నీళ్ళు పారకుంటుండే. మీది మడ్లకే నీళ్ళు నరిపోతుండే కింది మడ్లకు పారాలంటే గగనమైతుండె.

గప్పుడు కింది సేండ్ల ఎన్మున్న సెలిమెలకెని నీళ్ళు "గూడ"తోటి అమ్మ నాయిన ఏతమేస్తుంటే నేను సెల్లె సేండ్లున్న బురదమన్ను తీస్కపోయి పక్కనున్న రాయిమీద బొమ్మలు గురుగులు సేసి ఆరబెట్టి వస్తుంటిమి.

మల్ల దినం, యిడిసి దినం నాయినోళ్ళు సెలిమెకాడికి పోతుంటే అళ్లతోటి మేము గూడ ఓరాలపొంటి గిద్ద గిద్ద ఉర్కి బండమీద మా బొమ్మలు గురుగులు మురిసెంగ నూసుకుంట ఆటితోటి ఆడుకున్నంతసేపు ఆడుకుని అవి ఇరుగంగనే మల్ల బురదమన్ను తీస్కపోయి మల్ల బొమ్మలు గురుగులు సేస్తుంటే సమటగారే ఎండలో అమ్మ నాయిన సెలిమెల కెని గూడతోటి తోడి తోడి సేండ్లకు నీళ్ళు పోస్తనే వుంటుండ్రి.

అమ్మ నాయిన సేండ్లకు నీళ్ళు పారాలని యెంత జెల్ది జెల్ది యేతమేస్తుంటే బండకాడ మన్నుతోటి మా ఆటలు గంతజోర్గనే వుంటుండె.

ఆనకాల మొచ్చినప్పుడు మా సేండ్ల ఒరాలపొంటి, సేనుసుట్టు పచ్చగా నిగనిగలాడ్త పొన్నగంటి కూర, గోరిమిటి కూర నువ్వా నేనా అన్నట్లు పెర్గుతుంటుండె.

అమ్మ అప్పుడప్పుడు గా కూరనే తెంపుకొచ్చి కూరొండితే ఎంత కమ్మగుంటుండెనో.

గంత కంటే కమ్మగా గోరిమిటి కూరుంటుండె. గండ్ల గింత సమురేసి, రెండు ఉల్లిగడ్డలు, గిన్ని పచ్చినిరపకాయలు, రెండు టమాటలేసి ఒక్క తానికిసేస్తె మస్తు కమ్మగుంటుండె. గదిగాక గోరిమిటి కూర పెయ్యికి మంచిదని అమ్మంటుండె.

యింకో దిక్కు నాయిన నీసు మంచిగ తింటడని వరి కోతలైనంక ఎండ్రికాయలను పట్కరమ్మని అన్నతోటి అనంగనే సుదన్న నరేందరుగాడితోటి కల్సి వరాల పొంటి ఎండ్రకాయలు పట్కరానికిపోతుంటే మేము గూడ వస్తమని నేను సెల్లె రడీ అయ్యేతాల్లకు అన్నకు తిక్కరేగి పెండతోటి నిండివున్న తమిలేర్లు (ఇన్పడబ్బాలు) నాకొకటి సెల్లెకొకటి ఇచ్చి సుదన్న, నరేందరుగాడు దొరలలెక్క ముందు నడుస్తుంటే పనోల్లలెక్క మేము యెన్కెన్క పోతుంటిమి. వరి మడ్లల్లకు దిగి ఒరంపొంటున్న పొక్కలల్లకు తిరిగి తిరిగి సూస్తా ఏడైతే ఎండ్రకాయుందోనని దొటొచ్చిందో ఇగ మమ్మల్ని ఉర్కులాడిస్తా

'అర్రేయ్... అర్రేయ్... పెండాదేసి ఉర్కిపోయి నీళ్ళు తీస్కరండ్రి" అనంగనే నేను సెల్లె సటుక్కున పెండ ఒరం గట్టుమీద పడేసి తమిలేర్లు తీసుకుని గుంతకాడికి ఉరికి నీళ్ళు తీసుకొచ్చి ఇయ్యంగనే అండ్ల యింత పెండేసి బిరబిర కలిపి ఒక దిక్కు నరేందరుగాడు ఇంకో దిక్కు సుదన్న ఎండ్రకాయలున్న పొక్కలల్ల పెండనీళ్లు పోస్తే జెరసేపటికే ఎండ్రకాయ ఊపిరాడక బయటకొచ్చేటాల్లకు నరేందర్‌గాడు దాని ముందరికాళ్ళని గట్టిగా పట్టుకుని ఒనరుగా వాటిని ఇరిసేస్తుండె.

పెండమోసుడు మాలెవలైతే, పెండకలిపి పొక్కలల్ల పోసుడు సుదన్న లెవలు. అసలైన ఈరో ఆడ నరేందరుగాడే. ఎందుకంటే ఎండ్రకాయలు పట్టుడంటే మాకు వుచ్చబడినంత పనౌతుండె. అనొక్కడే అంత యిమ్మతుగా ఆటిని పడ్తుండే. గంద్కనే ఎండ్రకాయలకు పోతున్నమంటె అన్నతోటి నరేందరుగాడు వుండాల్సిందే.

ఒరం పొంటున్న పొక్కలన్ని అయిపోయేత్లాకు సంచిల యిరవై ముప్పయి ఎండ్రికాయలైతుండె, యింగ పంచుకునుడే తరువాయి. గుంతకాడికి అందరం దబదబ ఉరికి అత్తరబుత్తర కాళ్ళు సేతులు కడుగుకునంగనే సుదన్న నరేందరుగాడు దబుక్కున ఎండ్రకాయల సంచి మాకాడ నుంచి గుంజుకుని రాజులలెక్క తుమ్మ సెట్టుకాడికి పోయి సగం సగం పంచుకుని సంచులల్ల యేసుకుని యింటికి పోయేటప్పుడు కూడా ఆ సంచులు అల్ల దగ్గిరనే, తమిలేరు డబ్బులు మాదగ్గరనే. తోవల ఏడనన్నా ఆ సంచులు ఇచ్చేసందే ఇయ్యకుండ్రి. ఎందుకంటే వేంవేం పట్టుకొచ్చినమని అమ్మ మమ్మల్ని ఏడ మెచ్చుకుంటదోనని, ఆ సొన్సు నేనే కొట్టాలని సుదన్న మస్తు-శకలాలు సేస్తుండె.

మల్ల యింటికాడ ఆటిన ఇసాపు సేసుదు కత అమ్మెన్క మాదే. ఎంద్రకాయలచారు పెట్టినంక మర్సటి దినం బోకెలు తోముదు పని మాదే.

గిట్లనే కొన్ని దినాలైనంక యింగ రాను రాను మా బాయి దిక్కు సర్కారోల్ల కరెంటు తంబాలు రావట్టినయి. మా సుట్టుముట్టున్న సింతబాయి, గాడిబాయి, మందబాదబాయి, సుద్దబాయిలకు కరెంటు మోటర్లు వొచ్చేతాల్లకు మా నాయినోల్లు గూడ మా బాయికీ కరెంటు మోటరు తీసుకుని పైపులు ఏసింద్రు.

గప్పటి నుంచి నాయినోళ్ళు యిగ మోటగొట్టుదు బంద్. నీళ్ళు తోడిపోసుదు బంద్.

కరెంటు మెషినొచ్చినంక యిగ బగ్గడిగా గీ మోటగొట్టుదేంది యిగ రాజులెక్క కూకోక అనవట్టింద్రు.

ఒక్క రోజంతా మోటగొట్టినా ఒద్వని నీళ్ళని మోటరు పంపు ఒక్క గంటలనే తోడి పోసేతల్లకు మొత్తం పొలాలకి తడికాకొచ్చింది.

సుఖమొస్తే మొఖం కద్గ తీరదంట గీ మోటరుని సూసుకుని సెలిమెల యేతమేసుదు గూడ మానుకుంద్రి, మల్ల కింది పొలాలకి నీల్లెట్ల అంత తాతగుల్గుదు సురువు సేసేతాల్లకు

సేసే కర్సంతా సేసుకుంట గీ ముసలోల్ల సోది ఏడయిందునని బాయిలకెని సేండ్ల కయ్యెన్ని నీళ్ళు బాయిలకెనే తేవాలె అని బాయి యింకింత లోతుగ తవ్వాలని ఎండకాలమప్పుడు కొంతమంది కూలోళ్ళను పెట్టి బాయి తొవ్వుదు సుర్వు జేసింద్రు.

కొన్ని దినాల నుంచి మూలకు వద్దట్టున్న మోటబొక్కెనకు మల్లా పనొచ్చింది.

ఒక దిక్కు మెషినేసి నీళ్ళన్నీ తీసిపోస్తుంటే బాయిలకి దిగిన పనోళ్ళు బాయిల నుంచి వొచ్చిన ఒండ్రుమన్ను నంత బొక్కెనతోటి తీస్తుంటే మోటకొడ్తున్న నాయిన తాత బాయిగడ్డమీద ఆ మన్నేసేతాల్లకు అమ్మోల్లు తట్టలల్ల దాన్ని ఎత్కపోయి పొలాలల్ల ఏసివొస్తుంటె బాయిని యింకింత ఎడల్పుగా, యింకింత లోతుగా, తవ్వుతుండగా ఒండ్రంతా పోయి మోరం మన్ను రావట్టింది.

అడికెని గూడ యింక ఇరవై గజాల లోతు తవ్వాలని నాయిన సెప్తుంటే పని యింకింత జోర్గ సురువై జోరందుకంటే పోరగాళ్ళ మందరం బాయిసుట్టు నిలవడి లోపలికి తొంగిసూడవట్టినం.

"ఓపోరగాండ్లు ఏం సూస్తుంద్రురా ఇండ్లకు పోండ్రి కాలుజారి బాయిల పడ్డరంటె గాతంటెవడు పెట్టుకోవాలి అని తాతన్నా ఒక్కరం ఒన్కలే జన్కలే.

మా పోరగాండ్లందరికి బాయిలకి నీళ్ళెట్లస్తయో తెల్సుకోవాలని మస్తు ఆంత్రంగున్నది యింగ ముసలోడి మాటెట్లింటం.

గప్పటికి "గీ బాయిల నీళ్ళను ఆనదేవుడొచ్చి రాత్రిపూట పోసి పోతడంట" అని శామ్‌రావ్ అన్న అంటుంటె

"ఆ సాలు తియ్యి, మోటరేస్తనే గంత జోర్గ సప్పుదైత నీళ్ళొస్తయి. మరి ఆనదేవుడు ఒక్కసారే గిన్ని నీళ్ళను మన బాయిల గుమ్మరిస్తే రాత్రిపూట సీమ సిట్టుక్కుమన్నంత సప్పుదన్నా కావాలి గదా" అంట యాదిగిరన్న తిర్కాసు పెట్టైతాల్లకు

"ఔ గదినిజమే మల్ల సప్పుదన్నా కావాలి గదా" అన్నడు అన్నతో జత గలుస్త.

ఆరం దినాల నుంచి కూలోళ్ళు బయి తవ్వుతనే వుంద్రు. నాయినోళ్ళు మన్ను ఎత్తి పోస్తనేవుంద్రు. మేము బాయిల నీళ్ళెట్లస్తయోనని గడ్డమీదికేని తొంగిసూస్తనే ఉన్నం, తాత పెట్టే సోది పెడ్తనే వుందు.

దినదినానికి బాయిలకి నీళ్ళు ఎక్వ రావట్టినయి. సీకటి పడేటాల్లకు ఒట్టిపోయినట్లున్న బాయి తెల్లారేతాలకల్లా సగం కల్లా నిండుకొచ్చి నీళ్ళన్ని చాయినీళ్ళ లెక్కుంటుండె. పనోళ్ళు పన్లకు వొచ్చేతాల్లకి నాయిన మెషినేసి నీళ్ళన్ని పొలంలకి ఇడ్సివెడ్తుండె.

ఆరం దినాలు పూరగ అయ్యేతాల్లకు బాయి తవ్వుదు పూరకావచ్చింది. నాయినోల్లు మెషినేసి ఎంత దూరందాకా పొలంలకి నీళ్ళు పారుతున్నయని రోజూ సూస్తెనే వుంద్రు. రోజురోజుకీ మీద మడికేని కింది మడ్లదాకా నీళ్ళు పారేతాల్లకు మాకందరికి మస్తు కుషిగైంది.

బాయి తవ్విన లాస్టు దినం నాయినను పిల్సి "నీ యవ్వ పోరగాండ్లకీ బాయిల నీళ్ళెట్లస్తయా సూదాలని మస్తు పరేషాన్ గుందిరా మల్లయ్య ఈల్లను బాయిలకు దింపి గదిసూపియ్యరా" అని తాతంటుంటె

నాయిన మా సేతులు పట్టుకొని మా దిగుదు బాయిలకి తీస్కపోయి దరికాడికెని మమ్మల్ని లోపలికి దింపగనే, నెత్తి ఎత్తి మీదికి సూసిన నాకు కండ్లు గిర్రున తిర్గినట్లయి నాయినను గట్టిగా పట్టుకున్నా.

లోపల మన్ను తవ్వేటోళ్ళు తవ్వుతునే వుంద్రు ఇంకొకపక్క బాయిగడ్డ మీద మోటరు నీళ్ళను తోడిపోస్తనే వుంది.

బాయిల సుట్టుపక్కల సొరికెలకేని నీళ్ళు దారగొస్తుంటే గవి ఎట్లొస్తున్నయో సమజ్‌గాక ఎర్రిసూపులు సూస్తా ఆటు ఇటు సూస్తుంటే నాయిన మమ్ముల్ని ఆడ్కితోల్కపోయి

"యింగో బిడ్డా గీ ఊటలల్లకెనే మన బాయిలకి నీళ్ళొస్తయి. ఇంగో గిది సుద్దబాయి ఊట, గిది గాడిబాయి ఊట, గిది సింతబాయి ఊట మల్ల గిదేమో తోటబాయి ఊట" అని సూపేతాల్లకు - ఇంకో దగ్గర భూమిలనుంచే "బుదుంగ్ బుదుంగ్‌న" నీళ్ళస్తుంటే మల్ల "గిదేడికెని వస్తుందే" అని సెల్లె అడిగేతాల్లకు, నాయిన కిందకి వంగి ఆ ఊటమీద రెండు సేతలు పెట్టి కండ్లకద్దుకుని మొక్కుతా "ఇది భూతల్లి ఊట బిడ్డా ఆ తల్లే మనకు కావాల్సిన నీళ్ళు ఇస్తది, ఆమెనే మనకు అన్ని దిక్కులకెని కావలసిన నీళ్ళు తెస్తది" అని అంటుంటే నాయిన కండ్లు మెరుపుతో మెర్సినయి. యింగ పోరగాండ్ల మందరం ఊటల కాడికి ఉరికి ఆ నీళ్ళను దోసళ్ళలో తీసుకుని తాగితే మస్తు తియ్యగున్నయ్.

బాయిల సుట్టుముట్టు వున్న సొరికెలను, దరిలను సూస్తుంటే యిసిత్రంగ అన్పియ్యవట్టింది.

అమ్మో, మా బాయి ఎంత లోతైంది. ఒకేళ ఒకళ్ళ మీద నిలవడ్తే దగ్గర దగ్గర ఇరవైమంది కావాలేమో మోటందుకోదానికి అన్కుంట నోరెళ్ళబెట్టి కండ్లను పొద్దుతిరుగుదు పువ్వులెక్క సేసిసూస్తుంటే బాయిలకి వొంగివున్న సింతసెట్టు కొమ్మలకున్న గూడ్లల్లకెని పిచ్చుకపిల్లలు కిసకిసమన్నయి.

మా బాయి తవ్విన కాడ్నించి అన్ని పొలాలకు నీళ్ళు అంది పంటలు యింకింత మంచిగ పండవట్టినయి. నాయినోళ్ళు టయిము సిక్కి బయట ఉప్పరిపన్లకు గూడా పోయి, అప్పటిదాకా పొలం దిక్మెల్లి బాయి తవ్వుదు దిక్మెల్లి సేసిన అప్పులు గూడ తీర్సవట్టింద్రు.

గట్లనే గట్లనే మేం పెద్దగైతుండంగనే మమ్మల్ని యిస్కులల్ల ఏపిండ్రు.

గప్పటిదాకా నాయినోళ్ళు బాయిల ఈత కొడ్తుంటే తువ్వాలు అందరు వేరు బనీను పట్టుకుని నాయిన ఈతకొట్టదం మురిపెంగా నూసిన వేమయు అన్నోళ్ళు ఈత నేర్సేతాల్లకు మాకు ఈతకొట్టాలనిపిస్తుండె గానీ గప్పటిదాకా మా బాయిల ఆడిపోరలు ఎవళ్ళు ఈత కొట్టలే.

ఐనా నాకు సెల్లెకు బాయిల దూకి ఈత కొట్టాలని మనస్సుల మస్తు పీకుతనే వుంటుండె.

శనారము, ఐతారము వచ్చిందంటే శనారము సగంపూట నుంచి, ఐతారము మొత్తమే మొగ పోరగాండ్లతోటి గల్సి నేను సెల్లె బాయిలకి ఎక్కుడు దిగుడు సేసుకుంట దరికాడ కూకుని కాళ్ళు నీళ్ళల్లకు సాపి తప్పద కొట్టుకుంట మొఖం కాళ్ళు సేతులు కడుక్కుంట, నోట్ల నీళ్ళు పోసుకుని పుక్కిళ్ళించుకుంట సెట్టుమీదకేని రాలిన సారపల్కులు తిన్కుంట, నీళ్ళు తాగుకుంట నీళ్ళల్ల ఆడుకుంటుంటే ఈతొచ్చిన పోరగాండ్లు ఈతకొట్టుకుంట చోర్ ఆట ఆడుతుంటే మేము గూడ గట్లెప్పుడు ఆడ్తమో గదా అని నేను సెల్లెలు అన్కుంటుంటిమి.

ఎండకాలవెుచ్చిందంటే సాలు పోరగాండ్ల మందరం బాయిగడ్డమీదనే జమైతుంటిమి.

ఎట్లయినా ఈతనేర్సి ఆటలాడాలని నేను సెల్లె పోరగాండ్ల తోటి గల్సి బాయిలకు దిగి పోలాలకు నీళ్ళు ఎప్పుడు పెడ్తరా అని ఎదురుసూసి బాయిల నీళ్ళు తక్వకాంగనే, ఆ దరికెని ఈ దరికి, ఈ దరికెని ఆ దరికి చాపలలెక్క దూకుకుంట మొగపోరగాండ్లతోటి ఈతనేర్సుతుంటే, ఒకొక్కసారి ఇస్పీదు సరిగలేక చేతికి దరి అందక నీళ్ళల్లకు మునిగిపోతుంపే గుండెలు లటుక్కుమంటుంటే నీళ్ళు మింగుకుంట కిందికి మీదికి మునకలేస్తుంటే ఎవలో ఒకళ్ళు చెయ్యిచ్చి దబుక్కున దరిమీదికి గుంజుతుండె. గప్పటికే నీళ్ళు ముక్కులకు పోయి నషా కఫాలంల్లోకి ఎక్కి అతలాకుతలమై దరిమీద కూకుని ఆయాసపడ్తుంటే పోరగాండ్లందరు పక్కపక్క నవ్వుతున్నా ఎట్లయినా ఈత నేర్వాలన్న కోర్కెమాలో సావలే.

కొన్ని దినాలకు ఎట్లయితేంది ఈత నేర్సుకున్నం. ఇంగ మాకు పట్టపగ్గాలు లేవు. మొగ పోరగాండ్లతోటి గల్సి పదిగంటలకు బాయిలకు దిగి ఈత కొట్టుకుంట చోర్ ఆట ఆడుకుంట బాయిలకేని దరిమీదికీ, దరిమీదికేని బాయిగడ్డ మీదికి, ఆడికేని మోటమీదికి, యింకా సింతసెట్టుమీదికి ఎక్కిదుంకుడు సుర్వు సేసినం.

ఒక్కొక్కసారి నిలవడ్డోళ్ళం నిలవడ్డట్లు మోట మీదికెని బాయిలకి దుంకేతాల్లకు బాయిల అడుగుల వున్న బురద మన్ను మెత్తగా కాళ్ళకు తాకుతుంటే గంత లోతుకొచ్చినమా అని అన్పియ్యంగనే గుండె ఆదినంత పనై అత్రంగా ఒక్క ఊపునే చాపలలెక్క మీదికి తేలి చోర్ అయినోనికి దొర్కకుంద నేను, గంగాలు, వరాలు, నర్సిగాడు, నరేందరు, ఎంకటేశు, జైయిందు, రమేషు అటొక్కలం ఇటొక్కలం బరిబత్తలనే ఒకలం పట్టక ఒకలం అటు ఇటు ఈదుకుంట ఉరుక్కుంట దుంకుకుంట బాయినంతా కుళ్ళు కుళ్ళు సేస్తా రెండు మూడు గంటల చోర్ ఆట ఆడేతాల్లకు బాయి నీళ్ళన్ని చాయి నీళ్ళయితుండె.

నద్మ నద్మ బిందె పట్టుకుని బాయినీళ్ళకొచ్చిన అంజొదిన శాంతొదిన మమ్మల్ని బరిబత్తల సూసి "గీ ఆడిపోరలకు గింతనన్నా సెరం లేదమ్మ మగ పోరగాండ్లతోటి గల్సి ఎట్ల ఈతకొడ్తుండ్రో సూదు" అంట ఈసడిస్తా బాయిలకి దిగి నీళ్ళు ముంచుకుంటుంటే

మా ఈపులకి సెప్పుండ్రి అన్కుంట ఆళ్ళముందుకు ఈదుకుంట వొచ్చి రెండు సేతుల తోటి తప్పద తప్పద నీళ్ళను కొట్టేతాల్లకు ఆల్లమీద నీళ్ళు రయ్యిన సిత్తుతుంటే

"ఏం సిగ్గులేని పోరలు" అంట ఉదుకుకుంట పోయి మా యవ్వారం మా అమ్మకు సెప్పేతాల్లకు

ఇల్లు, గద్దాము ఊకుతున్న అమ్మ సేతుల సీపురుకట్టతోనే బాయిగడ్డ మీదికొచ్చి బాయిలకి తొంగిసూస్తా, "ఓ గౌరాలు, ఓ గంగాలు, ఇంకా ఈతకొట్టుడు కాలే బిడ్డా, సెల్లెను తీసుకుని జెల్ది గడ్డెక్కుండ్రిరా" అంటనే మా యింటికి పోయే తొవదిక్కు సూస్తా "ఈళ్ళ మీద మన్నువద నా పిల్లలు బాయిల ఈతకొడ్తే ఈళ్ళ మిందడి సొమ్మేంపోయె ఆళ్ళ పిల్లలు గూదా బాయిల వుండ్రు" అంట సీపురుకట్టకున్న సెత్తను యింకింత జోర్గ దులుపుకుంట

"జెల్ది రండ్రి బిడ్డా మిమ్మల్ని సూస్తె కండ్లల్ల వెట్టుకుంటుండ్రు" అంట మల్లొకసారి బాయిలకు అమ్మ తొంగిసూస్తుంటే

"అమ్మ యింకొక దై ఆదొస్తమే నువ్వు ఫో, నువ్వు ఫో" అంట అమ్మ ముందరనే నీళ్ళల్ల బుదుంగు బుదుంగు మున్గుతుంటే అమ్మ కుషీ కుషీగా మమ్మల్ని సూస్తాసూస్తానే యింటికి మర్లుతుండె.

గట్లనే గట్లనే "ఒక్కదై ఒక్కదై" అని అన్కుంటనే రెండు మూడు దై లాదుకుంట ఆదుకుంట అలిసిపోయి బాయి గడ్డెక్కెతాల్లకు కండ్లన్ని ఎర్రగై నెత్తంతా దువిన్నట్లయి, ముఖాలు పీక్కుపోయి, పెయ్యంతా పేలిపోయి ఒట్టిచాపలలెక్కయి ఒనుక్కుంట ఒనుక్కుంట గడ్డెక్కి బట్ట వేసుకుంటుంటిమి.

గప్పటికి కూడా యింటికి పోబుద్ధిగాక ఒకలెనక ఒకలం సింతసెట్టెక్కి సింతకాయలు తెంపుకుని తింటుంటిమి లేదా సిమసింతకాయల సెట్టెక్కి బొంగుల తోటి సిమసింతకాయలు తెంపుకుని పొద్దిమింకేట్లాలకు యింటికి పోతుంటిమి.

ఒక యాదాది గిట్లనే ఎండకాలమప్పుడు బట్టలు బాయిగడ్డమీద యిడ్సి బాయిల చోరాట ఆడుకుంటున్నం. ఆయల్ల బాయిల నీళ్ళు కొన్నే వున్నాయి మోటమీద్కెని దుంకుతే బొక్కలిరుగతయి అన్జెప్పి ఎవలం బాయిగడ్డ ఎక్కి దూకుతలేం. అందరం లోపలనే ఆ దరిమీదికి ఈ దరిమీదకి ఉర్కుతనే చోర్ ఆట ఆడ్తున్నం ఆట మస్తు వుషారులో వుండంగనే.

బాయిగడ్డ మీదికేని కెక్కద కెక్కద మని నవ్వులు ఇన్పించి సటుక్కున ముగ్గురు అక్కసెల్లెండ్లం బాయిలకి దూకి ఈదుకుంటనే మీదికి సూసేత్లాకు అక్కద అంజొదినె, శాంతొదినె బాలనర్సక్క, వజ్జక్క సత్యనారాణ బావ నిలబడి మమ్మల్నే సూస్తా పగలబడి నవ్వుతుంటే

బావ సేతుల మా బట్టలున్నయి. గది సూడంగనే గుండెలు గుటుక్కుమన్నయ్. సిగ్గుతోటి సగం సచ్చినం.

ఎందుకంటే బాలనర్సక్కకీ సత్యనారాయణ బావకీ పెండ్లయి గప్పటికింకా నెల గూద కాలె. కొత్త బావ ముందల బరిబత్తెల ఉండేనరికి కండ్లు సిగ్గుతో సితికినయి, గుండెల సప్పుడు సెవిలకినవట్టిందిగానీ సూపులు నీళ్ళమీద నిల్పి దరికాడికొచ్చి మెదలోతు నీళ్ళల్ల నిలబడ్డ మమ్మల్ని సూసుకుంట ఆల్లు నవ్వుతుండంగనే పోరగాండ్లందరు తలా ఒక దిక్కు గడ్డెక్కి ఉర్కిపెఒతుంటే మేము ఆదనే సిక్కుదు సూసి

గడ్డమీదునోళ్ళంతా విరగబడి నవ్వుతుంటే సత్యనారాయణ బావ మోకాళ్ళ మీద కూకుంట

"దా, గౌరాలు, దా గంగాలు మీ సెల్లెను తీసుకుని గీడికి రండ్రి మీ బట్టలిస్తా" అంటుంటే ఒదినోళ్ళ నవ్వుడు నవ్వుదేగాదు గా తీర్గ నవ్వవట్టింండ్రు.

మాకైతే బావ మీద కోపం, వదినల మీదకి పోయి అసలు గీళ్లే ఓర్వక గీ పని సేయించిండ్రని ఒక దిక్కు వుక్రోషం ముంచుకొస్తుంటే

"మీ మరదండ్లు సెప్తె వినరు మొగపోరలతోటి బరిబత్తెల ఈత కొట్టద్దంటే గట్లనే కొడ్తరు తమ్మీ నువ్వు మొగపోరగాడివేగా నీతో ఈత కొడ్తరేమో అడ్గు" అంట ఒదినలిద్దరు తలా ఒక దిక్కు ఎగేస్తుంటే

యింగ సూస్కో మా కడ్పుల మంట తలా ఒక దిక్కు ముగ్గురం కల్సి ఎన్ని గలీజు మాటలు తిట్టాలో అన్ని గలీజు మాటలు ఒదినలని తిట్టినం గానీ అది మా పెదవి దాటి రాలే, బావా, వదినల, ఎకసెక్యాలు పైనుంచి మానలే.

మాతోటి అప్పటి దాకా ఈతకొట్టిన పోరగాండ్లు పోయి అమ్మకు గీ సుద్ది సెప్పెతాల్లకు

"ఆడిపిల్లలను పట్టుకుని గట్లసేస్తుండ్రేందే" అంట అమ్మ రయ్యారయ్య బాయికాడికొస్తుంటే, బట్టలను బాయిగడ్డమీదనే ఇడ్సి ముసిముసిగా నవ్వుకుంట అందరు తలా ఒక దిక్కు జారుకుంటుంటే సుద్దేందో సమజయి కామోషిగా బట్టలు తీసుకొని మమ్మల్ని యింటికి తొల్కొచ్చి పచ్చిబడిగె తీసుకుని మా ముగ్గురి వీపుల మీద పట్టపట్ట అంటిస్త

"శరం లేదే బద్మాషీలు. మొగపోరలతోటి బరిబత్తెల ఈత కొట్టొందంటే యింటరాయే మీరు ఏడెనిమిదేండ్లొస్తున్నా యింకా సిగ్గురాలే" అంట పురానం సుర్వుజేస్తుంటే బావ మీద వదినల మీద మస్తు కోపమొచ్చిందిగానీ బాలనర్సక్కని, విజ్జక్కని ఏమనుకోలే. ఎందుకంటే మేం గూడా గట్ల పెద్దగై గట్ల ఎప్పుడుంటమో అని ఎదురుసూసుదేనాయె.

అమ్మకు కోపం పోయినంక మల్లా మమ్మల్ని సమజాయించింది. "బిడ్డా గట్ల మీరు ఆళ్ళతోటి ఆడ్తిరి. అందరు మిమ్మల్ని ఏడిపిస్తుంటే నాకు మస్తు కోపమొచ్చె. నా కంటికి మీరు పిల్లల తల్లులైనా సిన్నోళ్ళే బిడ్డా గానీ గీ దునియకి గాదు" అంట దగ్గరకు తీసుకుంది.

ఇగ గాయల్ల నుంచి మొగపోరలతోటి ఈతకొట్టుడు మాని ఎవలు లేనప్పుడు లంగజాకెట్టు మీదనే బాయిలకు దుంకుడు మల్ల సుర్వు జేసినం గనీ ఈత మానలే.

నేనైతే నా ఇష్టమొచ్చినప్పుడల్లా పగటిపూట పోయి ఒక్కదాన్నే బాయిలకి దూకి ఈత కొడ్తుంటి.

గప్పుడెవలన్నా సూసి "ఓమ్మొ గింత లోతు బాయిల గీ పిల్ల యింత గూడ భయం లేక ఈత గొడ్తదేంది" అంట నాకు ఇనపడేలా సోది ఇన్పించినా నేను కెరల సెయ్యకపోదు. ఎందుకంటే, అమ్మ సెప్పిన కండిషన్లనే నేను ఈత కొడ్తున్న నాకెర్కె.

ఒక్కొక్కసారి బాయిల నీళ్ళమీద ఎల్లకిల్ల పడుకొని అటునుంచి ఇటు, ఇటు నుంచి అటు ఈదుతుంటే గడ్డమీదున్న చింతసెట్టు తన సేతులు సాచి రా బిడ్డా అని పిలుస్తున్నట్లన్పిస్తుంటే, ఆకాలంల సూర్యుడు నాకు చలికాస్తున్నట్లు, సార సెట్టు లేత కొమ్మలు ల నాతో దోస్తి సేస్తున్నట్లు సుట్టు ఉన్న బాయి తల్లి, అమ్మలా నన్ను తన వడిల లాలపోస్తున్నట్లు నిద్రపుచ్చి జోలపాడ్తున్నట్లు అన్పిస్తుంటే బాయి తవ్విననాడు "గీబూతల్లే మనకు అన్ని ఇస్తది బిడ్డా" అంట నాయిన అన్న మాటలే నా సెవిలగింగుర్లు తిర్గుతుంటుండె.

ఒక్కరోజన్నా బాయిని సూడకుంటే నా మనస్సు ఎట్లనో వుంటుండె. ఇంగ నేను పెద్దగైతున్న కొద్ది మా సుటుముట్టు బాయిలన్ని సుసైటీలకి అమ్ముడు పోవట్టినయి.

మా నాయినోళ్ళు గూడ మా పంటపొలాలతో మా బాయిన అమ్ముడుకు పెట్టిండ్రు.

పచ్చని సేండ్లు ప్లాట్లుగా మారి అండ్ల బంగళలు లేసినయి. బాయినీళ్ళు నిల్వావుండే దినమొచ్చింది. బాయిని గూడ గూడిపి ప్లాట్లు సెయ్యాలని సొసైటోళ్ళు అండ్ల రాళ్ళురప్పలు మురికి సెత్త తెచ్చి పోస్తుంటే మనస్సు అల్లకల్లోలం అయింది.

తేనె లెక్క తియ్యగున్న నీళ్లన్ని మరికిసెత్తల ముర్గిముర్గి నల్లగయినయి

అయినా నా మనస్సు అమ్మసుట్టు పసిపిల్లలెక్క, కోడిసుట్టు కోడిపిల్లలెక్క తిర్గుతుంటే నా అమ్మ నేను సూసినప్పుడల్ల సేతులు సాచి "రా బిడ్డా అంట నన్ను పిలుస్తున్నట్లనే ఉంది.

నా కండ్లముందే నా బయితల్లికి గోరికడ్తుంటే నా మనస్సు సెరువైంది.

మురిగి మురిగి కాల్వ అయి, సెత్తకుండి అయినా మూగదానిలెక్క కాలంల కల్సిపోయినా అమ్మంటే నాకెప్పటికీ ప్రాణమే. రేపో మాపో ఆడనే కంకరరాళ్ళతోటి పిల్లర్లు ఏసి ఆకాసాన్ని అంటే బిల్డింగులు కడ్తారేమో. అయినా ఈ భూదేవంత పచ్చగా, ఆమె ప్రేమంత చల్లంగా నా బాయితల్లి యాది నేసచ్చేదాకా నాతోటే వుంటది.

మన్నుబువ్వ నుండి ✳

## ప్రగతి నగర్‌లో ఐద్వా ప్రభంజనం

రంగారెడ్డి జిల్లా ప్రగతి నగర్ గ్రామ పంచాయితీ ఎన్నికల్లో అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం (ఐద్వా) ప్రభంజనం సృష్టించింది. గత పది సంవత్సరాలు ఐద్వా సభ్యులుగా వుండి మహిళలను ప్రజలను చైతన్య పరచిన రుక్మిణి, కె.వి. లక్ష్మి, పద్మావతి, ఎన్ రమ, జె. లక్ష్మి కుమారిలను గ్రామ ప్రజలు ఏకగ్రీవంగా ఎన్నుకున్న సందర్భంగా మానవి అభినందనలు తెలుపుతుంది. గత సంవత్సరం దేశంలోనే ప్రప్రథమంగా ఐఎస్ఓ 2000 సర్టిఫికెట్‌ను అందుకున్న ప్రగతి నగర్ గ్రామ పంచాయితి ఈ మహిళా సభ్యుల ఎన్నికతో మరింత అభివృద్ధిని సాధిస్తుందని ఆశిద్దాం.


జె. లక్ష్మీకుమారి, సర్పంచ్


వి. పద్మావతి


కె.వి. లక్ష్మి సుజాత


ఎన్. రుక్మిణీ


వెన్. రమ

మహిళల హక్కుల కోసం, నవ సమాజ నిర్మాణానికి
అవిశ్రాంత పోరాటం చేస్తున్న
అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం (ఐద్వా)
రజతోత్సవాల సందర్భంగా శుభాకాంక్షలు

# ప్రగతినగర్ గ్రామ పంచాయితి

## కుత్బుల్లాపూర్ మండలం, రంగారెడ్డి జిల్లా

**ప్రగతి పథంలో ముందుకు సాగుతున్న ప్రగతినగర్ గ్రామ పంచాయితి అభివృద్ధిలో భాగంగా చేసిన పనులు:**

- మంజీర ఆనీటి సౌకర్యం
- సిమెంట్ రోడ్లు
- మెయిన్ రోడ్డులో హైమాస్ట్ లైట్లు
- పర్యావరణ పరిరక్షణ కొరకు ఖచ్చితంగా ఇంటికి రెండు మొక్కల పెంపకం - గ్రామమంతా పచ్చదనం - పరిశుభ్రతకు ప్రాధాన్యత.
- ఎ.పి.ఎస్.ఆర్‌టిసి బస్సు సౌకర్యం
- మద్యం దుకాణాలపై నిషేధం
- హిందూ, ముస్లిం, క్రైస్తవ మతాలవారికి ప్రార్థనా స్థలాల కేటాయింపు.
- ప్రజల మనోవికాసానికై బాడ్మింటన్, క్రికెట్, ఆటస్థలాల ఏర్పాటు.
- నో ప్లాస్టిక్ జోన్ గ్రామంగా 20 మైక్రాన్స్‌కు తగ్గిన ప్లాస్టిక్ సంచుల వాడకంపై నిషేధం.
- దేశంలో ప్రపథమంగా ప్రగతినగర్ గ్రామ పంచాయితి ఐఎస్ఓ 2000 సర్టిఫికెట్ పొందడం.
- దేశంలోనే ప్రపథమంగా గ్రామంలోని సమస్యలు, సూచనలు, సలహాలు, ఇంటర్నెట్ ద్వారా గ్రామ పంచాయితి తెల్పేందుకు వెబ్‌సైట్ అవకాశం కల్పించడం.

**చేయాల్సిన పనులు:**

- కమ్యూనిటీ హాలు నిర్మాణం పూర్తి చేయుట
- స్విమ్మింగ్ పూల్ నిర్మాణం పూర్తి చేయుట
- బిక్షాటనపై నిషేధం - బిక్షాటన చేసే వారికి పని కల్పించడం.

# ఉద్యమాల బాటలో...

## హైదరాబాదు నగర కమిటీ ఆధ్వర్యంలో పిక్‌నిక్ :

నవంబర్ 26న హైదరాబాద్ నగర కమిటీ ఆధ్వర్యంలో, అలంకృత రిసార్ట్స్‌లో ఏర్పాటు చేసిన, పిక్‌నిక్‌లో 150 మంది మధ్య తరగతి మహిళలు భాగస్వాములయ్యారు. పిల్లలు పెద్దలు అందరూ ఆటలపోటీల్లో ఉత్సాహంగా పాల్గొన్నారు. కార్యక్రమానికి హాజరైన ఐద్వా రాష్ట్ర కార్యదర్శి కె. స్వరూపరాణి గారు హాజరై, మహిళా సమస్యలు, వాటిపై మహిళలు పోరాడాల్సిన ఆవశ్యకతను తెలియజేసారు. చట్టసభల్లో 33% రిజర్వేషన్ బిల్లుకు సాధించుకోవడానికి పోరాటం ఉధృతం చెయ్యాలని పిలుపు ఇచ్చారు. నగర అధ్యక్ష కార్యదర్శులు వి. గౌరి, చల్లాలీలావతితోపాటు, నగర ఆఫీస్ బేరర్స్ అందరూ ఈ కార్యక్రమానికి హాజరయ్యారు.



గోల్కొండ ఖిల్లాలో నిర్వహించిన మాస్ పిక్‌నిక్‌కు నగర నలుమూలల నుండి 600 మంది మహిళలు పాల్గొన్నారు. ఈ సందర్భంగా, రన్నింగ్, ఖోఖో, కబడీ తదితర ఆటలపోటీలు నిర్వహించారు. నగర కార్యదర్శి చల్లా లీలావతి మాట్లాడుతూ నగర వ్యాప్తంగా, ఐద్వాలో మహిళలను పెద్ద సంఖ్యలో సభ్యులుగా చేర్చి సంఘాన్ని బలోపేతం చెయ్యాలన్నారు. మహిళలంత ఐక్యంగా పోరాడితినే సమస్యలు పరిష్కారమవుతాయని పిలుపునిచ్చారు.

## మధ్యాహ్న భోజన పథకంపై :



పాఠశాలల్లో మధ్యాహ్న భోజన పథకం నిర్వాహకులకు బిల్లులు సక్రమంగా చెల్లించకపోవడాన్ని నిరసిస్తూ నెల్లూరు కలెక్టరేట్ ముట్టడి చేశారు. ఖమ్మంలో 4 డివిజన్‌లలో సర్వే చేసి ధర్నాలు, సదస్సులు నిర్వహించడం జరిగింది. నల్గొండలో 3 మండల్లాల్లో రిలే నిరాహార దీక్షలకు ఐద్వా మద్దతు తెలిపింది. ప్రకాశం జిల్లాలో ఆగిపోయిన బిల్లుల విషయమై మధ్యాహ్న భోజనం చేసే డ్వాక్రా మహిళలు 1 రోజు ధర్నా చేయగా వెంటనే అధికారులు స్పందించి బిల్లులను విడుదల చేయడం జరిగింది. నల్గొండలో ఐద్వా, సిఐటియు ఆధ్వర్యంలో 200 మందితో సదస్సు జరిపారు.

## మసకబారిన :

పదహారేళ్ళ దివ్య తల్లి దండ్రుల ముద్దు మురిపాలతో ఉన్నత చదువులు చదివి సమాజానికి తన వెలుగులు పంచాల్సిన దివ్య. ఆడతనమే ఆటవిడుపై సంతలో సరుకుగా చేతులు మార్చబడి నిర్జీవిగా మిగిల్చబడిన దివ్య నేటి ఆధునిక ఆటవిక సమాజానికి ప్రతీక.

విశాఖపట్టణంలో స్కూటర్ ప్రమాదంలో తల్లిదండ్రులను కోల్పోయి అనాధగా, ఏకాకిగా మిగిలిన దివ్యను ప్రక్క ఇంటిలో ఉండే ప్రభాకర్ నీకు పనిచూపిస్తానని నాతో రమ్మని చెప్పిన అతని మాయమాటలను నమ్మింది. తనను ఒక దరిని చేరుస్తాడని ఆశపడింది. అతడు ఒక " ఆడ మాంసపు ముద్దలతో" వ్యాపారం చేసే కటిక వాడని తెలియని దివ్య అతనితో వెళ్ళింది. కానీ ఆ మోసగాడు దివ్యను గుంటూరులోని వ్యభిచార గృహంలో పశువులా అమ్మేశాడు. "అక్కడ నాకీ పాపపు జీవితం వద్దమ్మా" అంటూ వ్యభిచార గృహం నిర్వహకురాలి కాళ్ళా వేళ్ళాపడి బ్రతిమలాడిన ఆ కసాయి హృదయం కరగలేదు. దివ్యను చిత్రహింసలు పెట్టి మరీ ఆ పసి శరీరంతో వ్యాపారం చేశారు. పైసలు పోగుచేసుకున్నారు. అంతటితో చాలదని నంధ్యాలకు చెందిన బ్రోకర్ సుధారాణికి 20వేలకు అమ్మేశారు. నేనేమి తక్కువ దానినా అని సుధారాణి దివ్యపై పెట్టిన పెట్టుబడిపై పదింతలు రాబడి రాబట్టుకునేలా వ్యవహరించింది. పైగా అక్కడికి నిరంతరం వచ్చే క్రైమ్ పార్టీ కానిస్టేబుల్ పుల్లయ్య ద్వారా తీవ్రంగా బెదిరించారు. పారిపోవాలని చూస్తే పోలీసులతో ఎన్‌కౌంటర్ చేయిస్తా కుక్క చావు చస్తావని బెదిరించి రాజకీయ నాయకుల అనుంగు అనుచరులకు ఆహారంగా వేశారు.

ఈ దుర్భర జీవనంలోనే శివ అనే యువకుడు పరిచయమై ఎంతకాలం ఈ జీవితం ఎక్కడికైన వెళ్ళి పెళ్ళి చేసుకుందాం అన్నాడు. దివ్యకు జీవితంపై ఆశ చిగురించి అతనితో కలిసి పారిపోయి బయటకు వచ్చేసింది. కానీ వేటకుక్కలాంటి కానిస్టేబుల్ పుల్లయ్య కంట పడటంతో తిరిగి దివ్యను సుధారాణికి అప్పగించి రక్షక భటుడే భక్షకుడై దివ్యను అప్పగించినందుకు 15వేలు డిమాండ్ చేసి మరీ వసూలు చేసుకున్నాడు. అప్పడప్పుడు వెళ్ళి సుధారాణితో మామూళ్ళు పట్టుకెళ్ళేవాడు. అనంతరం దివ్యను కర్నూలు నగరంలోని వెంకటరమణ కాలనీకి చెందిన బ్రోకర్ విజయలక్ష్మికి 20వేలకు అమ్మేసింది సుధారాణి. దివ్య శరీరంరతో వ్యాపారం చేసి తాను లక్షలు సంపాదించాలని విజయలక్ష్మి కౄరమృగాల గుంపుకు అప్పగించింది. బాషా అనే బ్రోకర్ ఇద్దరి కోసం అని చెప్పి ఆటోలో తీసుకెళుతూ మధ్యలో మరో నలుగురిని ఆటోలో తీసికెళ్ళి ఆ కామాంధులు తరువాత భయంకరమైన బాధతో విలవిలలాడుతున్న దివ్యను ఆటోలో తిరిగి తీసుకెళ్ళే సమయంలో బీటు కానిస్టేబుళ్ళ కంటపడ్డారు. ఇంకా

మనుషుల్లో మానవత్వం మిగిలి ఉన్నట్లుగా ఆ పోలీసులు ఆటో ఆపి దొరికిన కామాంధులను ఇద్దరిని పట్టుకుని చితకబాది దివ్యను రక్షించి ప్రభుత్వ ఆసుపత్రిలో చేర్పించారు. ఈ విషయం తెలుసుకున్న ఐద్వా నాయకులు వెంటనే ఆసుపత్రికి వెళ్ళి దివ్యను రక్షించి ప్రభుత్వ ఆసుపత్రిలో చేర్పించారు. దివ్యపై సామూహిక అత్యాచారం చేసిన కామాంధులను అరెస్ట్ చేసి కఠినంగా శిక్షించాలని వ్యభిచార గృహాలు నిర్వహిస్తున్న వారిని, వారికి అండగా ఉన్న రాజకీయ నాయకుల అనుచరులను, సహకరించిన పోలీసులపై కఠిన చర్యలు తీసుకోవాలని కోరుతూ కలెక్టర్ ఆఫీసు దగ్గర పెద్ద ఎత్తున ధర్నా చేసింది.

మంత్రి మారెప్పను చుట్టుముట్టి దివ్యకు న్యాయం చేయాలని డిమాండ్ చేసింది. వ్యభిచార గృహం నిర్వహిస్తున్న విజయలక్ష్మి ఇంటిముందు మహిళా సంఘం కార్యకర్తలు ధర్నా చేయటం వల్ల పోలీసు యంత్రాంగం, జిల్లా కలెక్టర్ స్పందించి వ్యభిచార గృహం నిర్వహిస్తున్న సుధారాణి, విజయలక్ష్మిలను అత్యాచారం చేసిన ఆరుగురు యువకులను అరెస్ట్ చేయటం జరిగింది. రాష్ట్ర ఐద్వా నాయకత్వం హోం మినిస్టర్ జానారెడ్డి గారికి దివ్య కేసు విషయంపైన, రాష్ట్రంలో పెద్ద ఎత్తున జరుగుతున్న ఆడపిల్లల అక్రమ రవాణాపైన కఠిన చర్యలు తీసుకోవాలని మెమోరాండం ఇచ్చింది. కానిస్టేబుల్ పుల్లయ్యను డ్యూటీ నుండి డిస్మిస్ చేయటం జరిగింది. ఈ సంఘటనకు స్పందించి మహిళా కమీషన్ చైర్‌పర్సన్ మేరి రవీంద్రనాద్ గారు వచ్చి దివ్యను పరామర్శించి సంబంధిత అధికారులను సంప్రదించటం జరిగింది. దివ్యను ఒక స్వచ్ఛంద సంస్థలో చేర్పించటం జరిగింది.

సంఘటన జరిగిన వెంటనే ఐద్వా పోరాటం చేయడంతో దివ్య సమస్య పరిష్కారమైంది.

### సంక్రాంతి ఆటల పోటీలు:



సంక్రాంతి సందర్భంగా ఐద్వా ఆధ్వర్యంలో రాష్ట్ర వ్యాపితంగా ఆటల పోటీలు జరిగాయి. నెల్లూరులో 65 సెంటర్లలో ఖమ్మం-250, నల్గొండ-30, కర్నూలు- 34, ప్రకాశం- 47, హైదరాబాద్-30, రంగారెడ్డి-6, విజయవాడ-30, గుంటూరు, వరంగల్-9, సెంటర్‌లలో మహిళలు, యువతులు అత్యధిక సంఖ్యలో పాల్గొన్నారు.

### మహిళా రిజర్వేషన్ బిల్లుపై:

చట్ట సభలలో మహిళలకు 33% రిజర్వేషన్ కల్పించే బిల్లు ఈ బడ్జెట్ సమావేశాలలోనైనా ప్రవేశపెట్టాలని డిమాండ్ చేస్తూ హైదరాబాద్‌లోని అంబేద్కర్ విగ్రహం వద్ద ఫిబ్రవరి 22వ తేదీన మానవహారం ఐద్వా, ఆంధ్రప్రదేశ్ మహిళా సమాఖ్య సంయుక్తంగా ఏర్పాటు చేసింది. ఈ కార్యక్రమంలో తెలంగాణాపోరాట యోధురాలు మల్లు స్వరాజ్యం మాట్లాడుతూ పదేళ్ళ నుండి ప్రతి సమావేశంలోనూ ప్రవేశపెట్టకుండానే ఏకాభిప్రాయం పేరుతో వాయిదా వేస్తున్నారని అన్నారు. ఈసమావేశాల్లో బిల్లును ప్రవేశపెట్టిచట్టం చేయాలని డిమాండ్ చేశారు. ఈ కార్యక్రమం రాష్ట్రంలోని 15 జిల్లాల్లో జరిగింది.




### అధికధరలపై:

రోజు రోజుకు పెరుగుతున్న నిత్యవసర వస్తువుల ధరలతో ప్రజానీకం అల్లాడుతోంది. బియ్యం, పప్పులు, చింతపండు, నూనెలు, కూరగాయల ధరలు విపరీతంగా పెరిగాయి. అధిక ధరలను నియంత్రించేందుకు ప్రభుత్వం చర్యలు తీసుకోవాలని 14 రకాలైన నిత్యావసర వస్తువులను చౌక దుకాణాల ద్వారా పంపిణీ చేయాలని డిమాండ్ చేస్తూ నెల్లూరు, వైజాగ్, కర్నూలు, హైదరాబాద్, నల్గొండలో ధర్నాలు జరిగాయి.




### తెల్ల రేషన్ కార్డులపై

తెల్ల రేషన్ కార్డు దారులకు కిరోసిన్ కోటాను ప్రభుత్వం తగ్గించివేసింది. మంజూరు చేసిన రేషన్ కార్డులకు సరిపడా కిరోసిన్ కోటాను విడుదల చేయకుండా



కిరోసిన్ తగ్గించివేసి గ్యాస్ సిలిండర్ తో లింక్‌పెట్టి తెల్ల రేషన్ కార్డులను ఎత్తివేసేందుకు చేసే ప్రయత్నాలను వ్యతిరేకిస్తూ హైదరాబాద్ సివిల్ సప్లయ్ ఆఫీసు ముందు 250 మందితో ధర్నా జరిగింది. కర్నూలు, వరంగల్ జిల్లాల్లో ఈ చర్యలను వ్యతిరేకిస్తూ చౌకరు దుకాణంవద్ద ధర్నా జరిగింది.

**ఇళ్ళస్థలాల పోరాటం:**

విశాఖ జిల్లాలో ఇళ్ళు లేని నిరుపేదలు ఇళ్ళ స్థలాలకోసం ఉద్యమించారు. వరుసగా 10 రోజులపాటు పేదవారిపై పోలీసులు తమ ఉక్కుపాదాన్ని మోపారు. రోజు రోజుకు తీవ్రమౌవుతున్న ఉద్యమాన్ని తిప్పికొట్టేందుకు దొరికిన వారినందరిని జైళ్ళలో పెట్టడం, మహిళా నాయకుల అరెస్టులను వ్యతిరేకిస్తూ దిష్టిబొమ్మ దగ్ధం కార్యక్రమాలు నెల్లూరు, ఖమ్మం, నల్గొండ, కర్నూలు, వరంగల్‌లలో దిష్టిబొమ్మ దగ్ధం, రాస్తారోకోలు జరిగాయి. నల్గొండలో ఐద్వా, సిటు అధ్వర్యంలో 200 మందితో సదస్సు జరిగింది.

**వాటర్ మీటర్లపై :**

మున్సిపాలిటీలు, కార్పొరేషన్ పరిధుల్లో నీటి మీటర్లు ఏర్పాటు చేసేందుకు ప్రభుత్వం నిర్ణయం తీసుకుంది. దీనిని వ్యతిరేకిస్తూ ఖమ్మం, పశ్చిమ గోదావరి జిల్లాల్లో మున్సిపల్ కార్యాలయాల వద్ద ధర్నా జరిగింది.



గిరిజన మహిళ యల్లమ్మను ముదిగొండ ఎస్.ఐ. అకారణంగా కొట్టిన ఘటనపై స్థానికంగా 1200 మందితో రాస్తారోకో చేయటం, మహిళా కమిషన్ చైర్ పర్సన్ మేరీ రవీంద్రనాద్ గారిని కలిసి మెమోరాండం ఇవ్వటం జరిగింది. ఈఘటనకు కారకుడైన ఎస్.ఐ.ను సస్పెండ్ చేయాలని, బాధితురాలికి తగిన వైద్య సదుపాయం అందించేందుకు చర్యలు తీసుకోవాలని కోరటమైనది.

**హైదరాబాద్ నగర కమిటీ ఆధ్వర్యంలో మెడికల్ క్యాంప్**

మల్కాజిగిరి 7వ వార్డు శ్రామికనగర్ జాన్ అండ్ రోజర్ స్కూల్‌లో మెగా మెడికల్ క్యాంప్ మల్కాజిగిరి 7వ వార్డు ఐద్వా కమిటీ అధ్వర్యంలో జరిగింది. ఈ క్యాంప్‌లో డాక్టర్ సుధాకరరెడ్డి, డాక్టర్ విజయేందర్ రెడ్డిలు 650 మందికి వైద్య సేవలందించారు. డాక్టర్ సునయ దంత పరీక్షలు నిర్వహించారు. వీరు కంటి పరీక్షలు 65 మందికి పైగా నిర్వహించారు. దంత పరీక్షలు 150 మందికి పైగా నిర్వహించారు. చికున్ గున్యా భాదితులు పెద్ద సంఖ్యలో హజరయ్యారు. మురికి వాడలకు తమ ద్వారా సేవలందిస్తున్నందుకు 7వ వార్డు మాజీ కౌన్సిలర్ చల్లా లీలావతి డాక్టర్ల అందరికీ కృతజ్ఞతలు తెలిపారు.



**మోటూరు ఉదయం ట్రస్టు కార్యక్రమం:**

గృహ హింస రక్షణ చట్టం-అమలు అనే అంశంపై మోటూరు ఉదయం ట్రస్టు ఆధ్వర్యంలో డిశంబరు 8వ తేదిన సదస్సు హైదరాబాద్‌లో జరిగింది. ఈ సదస్సులో మహిళా శిశు సంక్షేమ శాఖ కార్యదర్శి శ్రీమతి వసుధ మిశ్ర గారు, నల్సార్ లా యూనివర్శిటీ ప్రొఫెసర్ శ్రీ మాడభూషి శ్రీధర్ గారు ఈ రక్షణ చట్టంలో పొందుపరిచిన అంశాలను సామాన్యులకు అర్థమయ్యే భాషలో




వివరించారు. శ్రీమతి వసుధ మిశ్ర మాట్లాడుతూ రక్షణాధికారుల నియామకం త్వరలో జరుగుతుందని, సర్వీస్ ప్రొవైడర్ల నియామకానికి ప్రకటన విడుదల చేసే పనిలో ఉన్నామని ఎన్‌జిఓ సంస్థలు, స్వచ్ఛంద సంస్థలు అప్లయ్ చేసుకోవచ్చని ఆమె చెప్పారు. చట్టాన్ని బాధిత మహిళలు ఏవిధంగా ఉపయోగించుకోవాలో వివరించారు.

## విద్య... ఆరోగ్యం...

మన దేశంలో మహిళలు తమ ఆరోగ్యాన్ని అసలు పట్టించుకోరు. చిన్నవయసులోనే వారెదుర్కొంటున్న పలు సమస్యలకు కారణం బహిష్టు సమయంలో సరైన శ్రద్ధ తీసుకోకపోవడమే. వాడిన వస్త్రాన్నే తిరిగి వాడటం, ఎవరూ చూడకూడదని ఎండసోకని మరుగు ప్రాంతాల్లో ఆరేయడం వల్ల ఇన్ఫెక్షన్లకు కారణం కావడం... జరుగుతోంది. ఆరోగ్య కార్యకర్తలన్నా



వారికి ఈ విషయాల్లో జాగ్రత్తలు చెప్పవచ్చు కదా... విద్య, ఆరోగ్యం... స్త్రీల సాధికారతకు ప్రధానాంశాలని నేను నమ్ముతాను. అందుకే ఈ విషయాలు నాకు ఆందోళన కలిగిస్తుంటాయి...' ఐక్యరాజ్యసమితి గుడ్‌విల్ అంబాసిడర్ హోదాలో ఓసారి హైదరాబాద్ వచ్చినప్పుడు ప్రముఖ నటి, సంఘసేవకురాలు షబానాఅజ్మీ అన్న మాటలివి!

# రామభద్రపురంలో రక్షిత మంచినీటి పథకము

## నిర్మాణము

2 వాటర్ ట్యాంకులు నిర్మాణము చేయడం జరిగినది. వీధుల్లో 70% సి.సి కాలువలు, రోడ్లు నిర్మాణము జరిగినది.

మిగిలిన కాలనీలలో రోడ్లు, కాలువలు నిర్మాణమునకు కృషి చేయుటకు ప్రయత్నించుట.

రామ భద్రపురం పంచాయితీని ఆదర్శవంతంగా తీర్చిదిద్దాలని ఆంక్ష, ప్రభుత్వం నుండి వచ్చిన అభివృద్ధి నిధులు, అర్హులకు అందేలా కృషి చేయుట.

హై స్కూలు భవనముల నిర్మాణము కృషి జరిగింది.

ఇంటికి కుళాయి వేయుటకు వేరే ట్యాంకు తెచ్చుటకు కృషి చేయుట.

అభినందనలతో...

# రామభద్రపురం గ్రామ పంచాయితీ



చొక్కాపు లక్ష్మణ రావు
మాజీ సర్పంచ్





చొక్కాపు. సుశీల
సర్పంచ్

CMV01A119

# DISTRICT RURAL DEVELOPMENT AGENCY WARANGAL

## *Developmental Activities taken under different programmes*

| | 2005-06 | 2006-07 (As on 8.2.2006) |
|---|---|---|
| | | (Rs. In Lakhs) |
| **1) Families Assisted under SGSY** | | |
| * No. of Beneficiaries : | 2660 | 497 |
| **2) Subsidy & Bank loan Released under SGSY** | | |
| * Group Loans : | 332.70 Lakhs | 62.74 Lakhs |
| * Individual : | 157.99 Lakhs | 27.60 Lakhs |
| **3) Groups Assisted Under state Matching Grant \ Revolving Fund** | | |
| * No. of Groups : | 983 | 1005 |
| * MG/RF : | 98.30 Lakhs | 100.05 Lakhs |
| **4) Groups availed loans under NABARD SHG Linkage** | | |
| * Groups : | 14334 | 11536 |
| * Loan : | 5259.77 Lakhs | 5388.41 Lakhs |
| **5) Pensions for Dis-abled, Widow, Weavers & Old Age People:** | | |
| * No. of pensioners : | 73044 | 156286 |
| * Pension Amount : | 886.363 | 1250.29 Lakhs |
| **6) National Family Benefit Scheme** | | |
| * No. of Families assisted : | 1475 | 276 |
| * Amount Released : | 73.75 Lakhs | 13.80 Lakhs |
| **7) Surrendered Extremists Re-habilitation Scheme (RSVY)** | | |
| * No. of families assisted : | 41 | 13 |
| * Amount released : | 20.50 Lakhs | 3.25 Lakhs |
| **8) Pavala vaddi Scheme** | | |
| * No. of Groups : | 7787 | 17177 |
| * Amount sanctioned : | 52.18 Lakhs | 192.28 Lakhs |
| **Indira Kranthi Patham:** | | |
| **1). Income Generating Activities:** | | |
| * Micro Credit plan : | 874.65 Lakhs | 67.00 Lakhs |
| **2) Social Welfare:** | | |
| * Jobs - Partnership : | 60.77 Lakhs | 14.50 Lakhs |
| **3) Land:** | 58.52 Lakhs | 85.58 Lakhs |

**Project Director**, DRDA Warangal

**Sri. Bhaskara Chary, MA, M.Phil, LLB.,**
Project Dicrector,
DRDA, Warangal

**Smt. K. Damayanthi, IAS,**
District Collector / Chairperson,
DRDA, Warangal.

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMV01A119 |
| పుస్తకం పేరు | చైతన్య మానసి |
| తారీఖు | 21/08/23 |
| ముందు అట్ట | ఉంది |
| వెనుక అట్ట | ఉంది |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | లేవు |
| ఖాళీ పేజీలు | లేవు |
| లేని పేజీలు | లేవు |
| తయారు చేసినది | Hema |
| పేజీలు విడదీసినది | Hema |
| స్కాన్ చేసినది | pragathi |
| పరీక్ష చేసినది | hema |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |